

# అవి
# పిలవని పేరంటానికి
# వచ్చేయి!

మీ వంటింట్లో చీకటి మూలల్లోను గోడలలో బీటలు పగుళ్లు మొదలైనవి ఉన్న చోట్లా బారులు తీర్చి బొద్దింకలు, చీమలు మరియు యితర కీటకములు పొంచి తిరుగుతూ ఉండవచ్చును! ఫ్లిట్‌ను వాడి మీ యింట్లో కీటకముల బాధ లేకుండా చేసుకోండి. ఫ్లిట్ ఎంతో త్వరగా కీటకములను నాశనము చేస్తుంది మరియు దానిని జల్లిన చోటులలో ఎంతో సేపటి వరకు కీటకములు చేరవు!

ఫ్లిట్ శాస్త్రరీత్యా తయారు చేయబడిన కీటకనాశిని. దానిలో చేరే డి.డి.టి., లిండేన్, థానైట్ మొ॥ అతి శక్తివంతమైన-కీటకనాశినులు కలిసి పనిచేయుట వలన అది యింట్లో అన్ని కీటకములను నాశనము చేయును ఫ్లిట్‌ను ఎల్లప్పుడూ మీ యింట్లో ఉంచుకోండి!




**ఫ్లిట్ నేడు దొరకుతున్న కీటకనాశినులలోకెల్ల అత్యుత్తమమైనది**

స్టాన్ వాక్ ద్వారా మార్కెట్ చేయబడుతున్నది

స్టాండర్డ్-వాక్యూమ్ ఆయిల్ కంపెనీ (యు.ఎస్.ఏ.లో సంస్థాపితము; కంపెనీ సభ్యుల బాధ్యత పరిమితము)

సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25న.పై.

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 47
1 -7-58

Founder : K. NAGESWARA RAO


విలంబ ఆషాఢ బహుళ అమావాస్య బుధవారం



## విషయ సూచిక

ముఖచిత్రం : హిందీనటి మధుబాల



క్రెమ్లిన్‌లోని 250 టన్నుల బరువుగల గంట.

# రష్యాలో రెండువారాలు

చింతలపాటి వెంకటసుబ్బయ్య

నేనూ, మరో నలుగురు భారతీయులూ కలసి పదిహేనురోజులపాటు రష్యాలో పర్యటనచేయడం జరిగింది 1958 మే 20 తేదీన "ఏరియానా ఏర్ లైన్సు" వారి విమానంలో ఢిల్లీ నుంచి ఉదయం బయలుదేరి మధ్యాహ్నానికి కాబూలు చేరుకున్నాము. వాతావరణం అనుకూలంగా లేనందున రెండురోజులపాటు కాబూలులోనే వున్నాము. అక్కడనుంచి 28 వ తేదీన రష్యావారి "ఇల్యూషన్" విమానంలో రష్యా పొలిమేరలోఉన్న టర్మెజ్‌కు చేరినాము. ఆ పట్టణములోని కస్టమ్సుశాఖవారు మా సామానులను పరీక్ష చేయడం పూర్తిఅయినతర్వాత అదే విమానములో టాష్‌కెంటు చేరుకున్నాము టాష్‌కెంటునుంచి ప్రపంచ విఖ్యాతిగాంచిన "104 ఏ" జెట్ విమానంలో 700 మైళ్ళ వేగముతో 2600 మైళ్ళు ప్రయాణంచేసి నాలుగు గంటలలో మాస్కో చేరాము. విమానం "ప్రెషరైజుడ్" కావటంవల, ఎండకూ చలికీ అతీతంగా మా ప్రయాణం సౌఖ్యంగా సాగింది.

మాస్కో నగర మధ్యంలో ఉన్న "బోల్షాయ్ థియేటర్" సమీపంలోని హోటల్ "మెట్రొపోల్"లో, రష్యా "ఇన్‌టూరిస్ట్ ఏజన్సీ" వారు మాకు విడిది వసతులు ఏర్పాటుచేశారు. మాస్కోకు మనకు కాలమానంలో 2½ గంటలు తేడా. అక్కడ ఈ నెలలో 19 గంటలు పగలు, 5 గంటలు రాత్రి. మాస్కోలోని వివిధ విశేషాలను చూపటానికిగాను మాకు ఒక కారునూ ఆ కారులో ఒకమార్గదర్శినీ ఏర్పాటుచేశారు. ఎనిమిదిరోజులపాటు మాస్కోలోని విశేషాలను చూశాము నన్ను ఎక్కువగా ఆకర్షించిన విషయాలను ఇక్కడ తెలియజేసాను.

మాస్కో నగరములో 70 లక్షలుమంది ప్రజలున్నారు. మాస్కో విశ్వవిద్యాలయము చూశాము. ఈ విశ్వవిద్యాలయము 28 అంతస్థులతో, 880 అడుగులయెత్తు ఉన్నది. ఈ భవనములోనే ఉపన్యాసశాలలూ, వివిధ వైజ్ఞానికశాఖలూ, జలక్రీడా సరోవరాలూ, నర్తనశాలలు, విద్యార్థి వసతి గృహాలు, విద్యార్థులకు అధ్యాపకులకు కావలసిన సమస్త సౌకర్యాలూ ఉన్నవి. ఇచ్చటి చలువరాతి స్తంభములు, నడవలు ప్రేక్షకులను చకితులను చేస్తాయి

తరువాత మేమువెళ్ళినచోటు "క్రెమ్లిన్". ఇందులోనే వారి ప్రాచీన వస్తుప్రదర్శనశాల ఉన్నది. జార్ చక్రవరుల కాలంనాటి సింహాసనాలు, వాహనాలు అన్నీ ఇందులోనే భద్రపరిచారు. ఆఖరుకు వారుఎక్కిన గుర్రాలనుకూడా ప్రత్తితో నింపి సజీవాలా అని భ్రమించేటట్లుగా ఇక్కడే జాగ్రత్త చేశారు. ప్రపంచ విఖ్యాతిగాంచిన 250 టన్నుల బరువుగల గంట ఇక్కడ "క్రెమ్లిన్"లోనే ఉన్నది. "క్రెమ్లిన్‌కు" అనుబంధముగా "రెడ్ స్క్వేర్ మాసోలియం" ఉన్నది. ఇక్కడే లెనిన్ స్టాలిన్‌ల భౌతికదేహాలను చక్కని వెలుతురుగల గదిలో భద్రపరిచారు. ఇతర దేశాలలో నాయకుల భౌతికదేహాలను ద్రావకాలలో భద్రపరిచారు; కాని ఇక్కడ అదేమీ లేదు. వీరి భౌతికదేహాలను ఏవిధంగా భద్రపరచినారో చాలా ఆశ్చర్యకరం! లెనిన్, స్టాలిన్‌లు నిద్రలో వున్నారా అనిపిస్తుంది కాని, అవి వారి భౌతికదేహాలని ఏ మాత్రము స్ఫురించదు. ఇక్కడకు దగ్గరే "లెనిన్ లైబ్రరి" ఉన్నది అందులో రెండు వందలలక్షల గ్రంథాలున్నవి; పాఠకులు కూర్చొని చదువుకోడానికి సమస్త సౌకర్యాలతో చక్కని గదులు వున్నవి.

మరోనాడు పారిశ్రామిక వ్యవసాయ ప్రదర్శనకు వెళ్ళాము. ఈ ప్రదర్శనము 540 ఎకరాల విశాలస్థలములో శాశ్వత భవనాలతో ఏర్పాటుచేశారు. ఈ ప్రదర్శనము సంవత్సరంలో ఎనిమిది నెలలపాటు తెరచి ఉంటుంది. లోపల చూడడానికి బస్సుల ఏర్పాటు కూడా ఉన్నది. ఈ ప్రదర్శనం పూర్తిగా అవగాహన చేసుకోవాలెనంటె 5 లేక 6 రోజులపాటు తీరికగా చూడవలెనే గాని, మామాదిరి తొందర తొందరగా ఒక పూట చూస్తే సంగ్రహముగా మాత్రమే తెలుస్తుంది; పూర్తిగా అవలోకించడానికి ఒకపూట అవకాశం చాలదు.

తరువాత మా కంటిని ఎక్కువగా ఆకర్షించినవి భూగర్భ రైల్వేస్టేషనులు. వీటిని "మెట్రో" స్టేషనులంటారు. ఇక్కడి పారిశుధ్యము, గోడలపై చిత్రించబడిన త్రివర్ణ చిత్రములు, గాజుదీపగుచ్ఛాలు మొదలైనవాటిని చూసి ఏ మహారాజుల భవనములో అని అనుకుంటారు గాని, సామాన్య ప్రజలు రైళ్ళలో యెక్కడానికీ, దిగడానికీ యేర్పాటైన స్టేషన్లని ఎవరూ అనుకోరు. లండన్, ప్యారిస్ నగరాలలోని భూగర్భ రైల్వేస్టేషనుల కంటె యెన్నోరెట్లు అందముగాను, శుభ్రముగాను ఆకర్షణీయముగాను ఉన్నవి.

మాస్కోలోని "ప్లానెటోరియం" (గ్రహప్రదర్శనశాల) చాలా అద్భుతమైనది. వివిధ గ్రహ సంచారములు, "స్ఫుత్నిక్" నమూనాలు అవి యేవిధముగా అంతరిక్షములో సంచరించేది అన్నీ చూడవచ్చు

మాస్కోలో వున్న ఎనిమిది రోజులలో మేము కొన్ని వినోద ప్రదర్శనములు కూడా చూచినాము. మొదట చెప్పుకోతగ్గది "బోల్షాయ్ థియేటరు". ఇందులో 5 అంతస్తులలో ప్రేక్షకుల బాల్కనీలు, సమస్తమైన యేర్పాట్లూ, లైటింగు, సీనరీలతో యేర్పాటు అయిన రంగస్థలాలు ఉండి అన్ని రకముల నాటక ప్రదర్శనములకు అవకాశాలూ వున్నవి. ఇక్కడ మేము ఒక నాటకం చూచినాము. వందమంది నటులు ఒకేసారి రంగంమీద నటిస్తున్నప్పటికీ,

# ★ రష్యాలో రెండువారాలు ★

ఇంకా విశాలంగానే ఉన్నట్లు అనిపించింది ఈ రంగస్థలం.

సహజమైన కార్లూ, ఏరోప్లేన్లూ, నౌకలలో తిరుగుతున్నట్లుగా భ్రమింపజేసే "పనోరమా సినిమా" కూడా చూచినాము. ఇది మమ్ములను విభ్రాంతులను చేసినది.

తరువాత మేము ఆనందించినది—బొమ్మలాట (Puppet Show). ఈ బొమ్మలను రంగస్థలం క్రిందినుంచి ఆడిస్తారు. విశేషమేమిటంటే, బొమ్మలు చిన్నవైనా అవి ప్రేక్షకుల కందరికీ చక్కగా పెద్దవిగా కనపడేటట్లు భూతద్దములను అమర్చారు.

రష్యాలో సర్కసులంటె ఆసక్తి మెండు. ఈ సర్కసులు మనదేశములోవలె గుడారములలో కాక, శాశ్వత భవనాలలో ప్రదర్శిస్తారు.

ఆతరువాత "లెనిన్ క్రీడారంగం." ఇది చాలా పెదది. ఇందులో లక్షకుపైగా ప్రేక్షకులు కూర్చొని క్రీడా విన్యాసాలను చూసే అవకాశం ఉన్నది. పదిహేను వేలమంది ఆచ్ఛాదితప్రదేశంలో కూర్చొని అవలోకించే క్రీడాస్థలం కుడిప్రక్కన ఉన్నది. ఇందులోనే కృత్రిమ మంచులో ఆటలూ, విన్యాసాలూ, జరిపే "స్కేటింగ్ రింగ్" కూడా వున్నది.

ఇక్కడ "నైట్ క్లబ్బులు" లేనేలేవు రోడ్లప్రక్కగానూ, నగరములోనూ కొన్ని బహిరంగ రంగస్థలాలున్నవి. వాటిలో సాయంత్రముపూట ప్రదర్శనలు జరుగుతూ ఉంటాయి టిక్కట్లు లేకుండానే ప్రజలు ఈ ప్రదర్శనలు చూడవచ్చు.

మాస్కోలోని విశేషాలు, వింతలు, వినోదాలు చూచిన తరువాత మూడురోజులపాటు లెనిన్‌గ్రాడ్‌కు మకాం మార్చాము.



పారిశ్రామిక ప్రదర్శనశాల ముఖద్వారం.

ఇక అక్కడి విశేషాలు.

లెనిన్‌గ్రాడ్ నగరం 45 లక్షల ప్రజాబాహుళ్యముతో అమరికగా ఉంటుంది. ఇక్కడ కూడా 60,000 మంది ప్రేక్షకులు కూర్చునే అవకాశముగల క్రీడారంగము ఉన్నది. మెట్రో సేవనులు తక్కువ. ఇక్కడనే ఒక ఆశ్రమము ఉన్నది. దానిని "హెర్మిటేజ్" అంటారు. ఇక్కడఉన్న చంద్రకాంతశిలాశిల్పములు, రంగురంగుల చిత్రములు, పురావస్తువులు చాలా ఆకర్షణీయముగా ఉన్నవి.

లెనిన్‌గ్రాడు నగరమునకు పదిమైళ్ళ దూరములో "సీ.ర్ ప్యాలెస్" అనే వేసవి ఆరామం ఉన్నది. ఇది జలయంత్రములతోను చక్కని పూతోటలతోను, రమణీయముగా వుంటుంది.

ఇవన్నీ చదువుతూవుంటే మీకు రష్యా భూతలస్వర్గమేమో అనిపిస్తుంది కాబోలు. కాని వాస్తవమును విస్మరించకూడదు. ప్రతి దేశములోనూ మంచి, చెడూ రెండూవుంటవి. ఇతర విశేషాలను మనవి చేస్తాను.

వ్యాపారము, పరిశ్రమలు, వార్తలు, వార్తాపత్రికలు అన్నీ ప్రభుత్వ పరంగానే జరుగుతవి. వ్యక్తిగత వ్యాపారముగాని, స్వాతంత్ర్యము గాని నాస్తి. రజాకారు లీడరు "కాశింరజ్వీ" మీద కేసుపెట్టి, పది లక్షలు ఖర్చుపెట్టి, జైలుకుపంపి శిక్ష తరువాత అతడు పాకిస్తాను వెళ్ళడానికి మన ప్రభుత్వం అనుమతి ఇచ్చింది. అప్రకారము రష్యావారు చేసారని నాకు తోచదు. భారతదేశములోని కమ్యూనిస్టులు జీతాలలో తేడాలు మనదేశములో విపరీతముగా ఉన్నవనీ, రష్యా మొదలైన దేశములలో ఆ తేడాలు చాలా తక్కువని వాదిస్తుంటారు. జీతాలలో, తరతమ భేదాలు రష్యాలో కూడా ఉన్నవి. నెలకు నూటయాభై రూపాయలు అంటె 300 రూబుల్సు కనీస వేతనమైతే, పదివేల రూపాయలు అనగా 20,000 రూబుల్సు అత్యధిక వేతనము. ఇంత తేడాలుండగా తేడాలు మనదేశములోనే యెక్కువ అని గగ్గోలుపెట్టడం భావ్యంకాదేమో? నూటయాభైరూపాయలు కనీస వేతనమన్నానుగదా అని అదియేదో పెద్దజీతముని భావించడానికి వీలులేదు. ఎందుకంటె జీవనవ్యయప్రమాణం చాలా యెక్కువ. మన కార్మికుడు రమారమి రెండు అణాలలో ఒక కప్పు టీ గాని, కాఫీగాని త్రాగగలడు. కాని రష్యాలో కప్పు "టీ", "కాఫీ" ఖరీదు ఒకరూపాయి. దీనినిబట్టి కార్మికుని కనీస సదుపాయాలు మన కార్మికులకంటే యేమీ యెక్కువగా లేవు ఒక జత బూట్లు కొనుక్కోవలెనంటె 125 రూబుల్సు మొదలు 200 రూబుల్సు వరకూ ఉంటుంది అదే మనదేశంలో 10 రూపాయల మొదలు 30 రూపాయలవరకూ వుంటుంది. చలిదేశం అయినందున ఉన్ని బట్టలు, కోట్లు అవసరం. వున్నికోటు

ఖరీదు 700 రూపాయలు మొదలు 1500 రూపాయలవరకూ ఉన్నది. మనదేశములో 100 రూపాయలు మొదలు 200 రూపాయల వరకూ ఉంటుంది. కాబట్టి వారి వేతనాలు, ఖర్చులు యిక్కడ భారతదేశంలో మాదిరే ఉంటాయిగాని అట్టి వ్యత్యాసం లేదు. నెలకు 1000 రూబుల్సు జీతం వచ్చేవారు నెలకు 80 రూబుల్సు పన్ను చెల్లించవలసి వుంటుంది.

మనదేశంలో మాదిరిగా ఒకడు సంపాదించడం పదిమంది కూర్చొని తినడంమాత్రం రష్యాలో లేదు. శరీరదారుఢ్యంగలఅందరూ పనిచేసారు. అందువల్ల జీవిత సౌకర్యాలు కొంత యెక్కువగా లభించే మాటమాత్రం వాస్తవం; అంతా ఏదో ఒక కార్యాలయములోగాని, పరిశ్రమలలోగాని, సాముదాయిక వ్యవసాయ క్షేత్రములో గాని పని చేస్తూ వుంటారు.

విద్యార్థులందరికీ ఉచిత విద్యార్థి వేతనాలున్నాయి. కాని సోమరులుగా తిరిగి చదువుకోని విద్యార్థుల వేతనాలు తీసి వేసి కార్మిక కర్షక రంగాలలో ప్రవేశపెట్టడమో, సరిగా మార్కులు రానివారి వేతనాలు తగ్గించడమో జరుగుతుంది. అంతేగాని ఒకసారి వేతనం వచ్చిందిగదా అని ఆ వేతనం యెల్లకాలం ఉండదు.

రష్యాదేశంలో స్త్రీలు అన్ని రంగాలలోనూ పనిచేస్తారు. మాకు అన్ని ప్రదేశాలు చూపించడానికి నిర్దేశింపబడినవ్యక్తి స్త్రీ; మా మోటారు నడిపిన డ్రైవరు స్త్రీ: స్త్రీలు తాపీపనివారుగాను, టాక్సీ, ట్రాక్టరు, రైల్వేఇంజను డ్రైవర్లుగాను కూడా పని చేస్తారు.

రష్యా ప్రభుత్వ ప్రచురణశాఖవారి పత్రికలూ ప్రచారిత వార్తలూ తప్ప మరో వార్తా[illegible]కగాని, వార, మాస పత్రికలుగాని ఈ దేశంలో లేవు. ఇందువల్ల భారతదేశమును గురించిగాని, భారతీయులను గురించిగాని వారికి తెలిసిన విషయాలు చాలా తక్కువ. భారతప్రధాని నెహ్రూ అని మాత్రం తెలుసు. రాజకపూర్ సినిమా నటుడు అనీ, నర్గీస్ అతనితో నటించిందనీ తెలుసు; అంతే, మిగత విషయాలు వారికి తెలియవు.

రష్యాలో ఉక్కునూ, ఇనుమునూ చాలా పొదుపుగా వాడుతారు. అత్యవసరమైతే నే తప్ప వీటిని ఉపయోగించరు. రైల్వే లైను స్లీపర్లకు కర్రనే వాడుతారు. మనదేశంలో మాదిరి ఉక్కుస్లీపర్లను వాడరు. విద్యుచ్ఛక్తి శాఖలో దూరప్రాంతాలకు వెళ్ళే తీగెలను మాత్రము ఇనుప స్తంభాలపైన తీసుకొని వెళుతారు: కాని నగరాలలోనూ, పల్లెలలోను, వ్యవసాయ క్షేత్రాల లోనూ ఉండే తీగెలను కర్ర స్తంభాల పైనమాత్రమే తీసుకొని వెళ్ళుతారు. మన దేశంలోనూ అటవిక సంపద సమృద్ధిగా ఉంది. దానిని అభివృద్ధిచేసే ప్రణాళికలు అమలు జరుపుతున్నారు. ఈ పరిస్థితిలో మనదేశంలో కూడా ఆ విధముననే ఇనుము, ఉక్కులను పొదుపుగా వాడుకుంటే, ఇతర అవసరాలకు ఉక్కు బాహాటముగా దొరికే అవకాశం ఉంటుంది.

మా పది, పదిహేను రోజుల పర్యటనలోనూ నలుగురు భారతీయులను కలుసుకోగలిగినాము. అందులో ముగ్గురు ఆంధ్రప్రదేశ్ నుంచి వెళ్ళినవారే. దూరభారంలో, దేశంగానిదేశంలో తెలుగు వాళ్లను చూచేటప్పటికి వారికీ మాకూ కూడా ప్రాణాలు లేచివచ్చినట్లు అయింది. కృష్ణా జిల్లా ఉయ్యూరుగ్రామమునుండి శ్రీ కె. సీతారామయ్యగారు మాస్కోలో ఆటోమొబైల్ నూనెలపైన పరిశోధన సాగిస్తున్న శాస్త్రవేత్త. 1931 నుంచి వీరు మాస్కోలోనే ఉన్నారు. వీరికి రష్యా పౌరసత్వం గూడా లభించినది.

రెండవవారు హైదరాబాదునుంచి మాస్కో వెళ్ళి అక్కడ ఒక పుస్తక ప్రచురణ సంస్థలో పనిచేసున్న శ్రీ గిడుతూరి సూర్యంగారు. మూడవవ్యక్తి స్త్రీ. శ్రీమతి ఆదిలక్ష్మిగారు. వీరు నెల్లూరుజిల్లా వాసి. లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాలయములో తెలుగు తమిళ భాషలలో ఆచార్యత్వం వహిస్తున్నారు. ఇక మిగిలినది మాస్కో రేడియోలో హిందీ అనౌన్సరుగా పనిచేస్తున్న శ్రీ జయస్వాల్. వీరందరినీ కలుసుకున్నప్పుడు మేమందరం అనిర్వచనీయమైన ఆనందం పొందాము.

రష్యాలో ఉన్న 11 రోజులకూ "ఇన్ టూరిస్ట్ శాఖ"కు 240 రూపాయలుమాత్రం చెల్లించినాము. మా అంతట మేము అదే హోటల్సులో ఉండి, అదే ప్రదేశాలు చూడాలంటే కనీసం 1500 రూపాయలైన అయివుండేది. ఈ అదనపు ఖర్చును రష్యా ప్రభుత్వము భరించినది. ఎటొచ్చి ఒకటి రెండు సంవత్సరాలుగామాత్రం ప్రయాణీకులను రష్యా రానిస్తున్నది. వారు తమ దేశంలో చూపదలచినవి మాత్రము చూపుతున్నారు. యాత్రికులను వారి దేశములోనికి రానివ్వడాన్ని గురించి విభిన్నాభిప్రాయాలు ఉన్నవి. అందుకని ఈ యాత్రలు యేక్షణములో పోయినా ఆశ్చర్యపడవలసిన అవసరము లేదు. రష్యనులు ఒక ఊరినుంచి మరోక ఊరికి వెళ్లవలెనంటే "వీసా" ఉండాలి. అటువంటి బాధ మనకు లేకుండా చేసినందుకు భారత ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. ★



మాస్కో విశ్వవిద్యాలయ భవనాలు.



లెనిన్‌గ్రాడ్‌లోని పీటర్ ఉద్యానవనం.



# ఢిల్లీకాంగ్రెస్ రాజకీయాల్లో మౌసలపర్వం

**శ్రీ కృష్ణ**
[ ఆంధ్రపత్రిక ప్రతినిధి ]

ఢిల్లీ కాంగ్రెసులోని రెండు ముఠాలకు జరుగుతున్న ప్రచ్ఛన్న యుద్ధానికి ఫలితంగా చాలమంది కాంగ్రెసువాదులు సంస్థనుంచి బహిష్కృతులయ్యారు. ఒక ముఠాకు నాయకురాలు శ్రీమతి సుభద్రా జోషీ, మరొక ముఠాకు నాయకుడు చౌధురి బ్రహ్మప్రకాష్.

రెండేళ్ళక్రితం ఈ యిద్దరూ గాఢ స్నేహంతో ప్రవర్తించేవారు. వీరు ఒక ముఠాగా ఏర్పడి, ఢిల్లీ కాంగ్రెసు అధ్యక్ష పదవినుంచి ముందు లాలా రాధారమణ్‌ను, తరవాత శ్రీకృష్ణనాయర్‌ను పడగొట్టారు. ఆ తరవాత ఇద్దరూ విరోధించుకున్నారు. ఆ విరోధం చిన్నసైజు అంతర్యుద్ధంగా పరిణమించి జోరుగా సాగుతోంది. శ్రీమతి సుభద్రా జోషీకి బద్ధశత్రువులైన శ్రీ రాధారమణ్, శ్రీకృష్ణనాయర్ ఇప్పుడామెకు సన్నిహితమిత్రులయ్యారు.

శ్రీమతి జోషీకి కావలసినంత పలుకుబడి ఉంది. కేంద్రమంత్రివర్గంలోని పెద్దల దగ్గరకూడా ఆవిడమాట చెలుతుంది. ఆమె భర్త శ్రీ జోషీ కమ్యూనిస్టుపార్టీ సభ్యుడు. వేర్వేరు పార్టీలకు చెందిన ఈ దంపతుల సహజీవనం ఢిల్లీలో కమ్యూనిస్టుపార్టీ బలపడటానికి చాలవరకూ కారణమని కొందరి అభిప్రాయం.

ఢిల్లీ మునిసిపల్ కార్పొరేషనుకు లోగడ జరిగిన ఎన్నికలలో కాంగ్రెసుపక్షం పొందిన పరాజయానికి కారకులని ఆరోపణ చేయబడిన కాంగ్రెసువాదుల ప్రవర్తనపై విచారణ జరపటానికి రాజస్థానీ నాయకుడు శ్రీ జైనారాయణవ్యాస్‌ను నియోగించారు. శ్రీ వ్యాస్ జరిపిన విచారణ ఫలితంగా రెండుడజన్లమందికి పైగా కాంగ్రెసువాదులను కాంగ్రెసునుంచి బహిష్కరించారు

అయితే ఒక సందేహం : నియోజకవర్గంలోని ప్రజల ఇష్టా యిష్టాలతో ప్రమేయం లేకుండా కాంగ్రెసు అభ్యర్థిని పార్లమెంటరీ బోర్డే నిలబెట్టటం కాంగ్రెసు ఓటమికి ఎంతవరకూ కారణమైందీ అనేసంగతిని శ్రీవ్యాస్ ఎక్కడా ప్రస్తావించలేదు. కొన్ని కొన్ని నియోజకవర్గాలలో ప్రజలు తమకు నచ్చిన అభ్యర్థిని నిలబెడితే కాంగ్రెసువాదిని ఎన్నుకోటానికి సుముఖత చూపించారు. కాని పార్లమెంటరీబోర్డు "అదేం కుదరదు. మేము లాంతరు స్తంభాన్నినుంచో పెట్టినా మీరు ఎన్నుకోవలసిందే" అని ఖరారుగా చెప్పేసింది. వోటర్లు దీనికి ప్రతిక్రియగా తమ ఇష్టం వచ్చినవారిని ఎన్నుకున్నారు.

మరొకసందేహం. కాంగ్రెసులో చీలికలకు కారకులైన శ్రీమతి సుభద్రా జోషీని, చౌధురి బ్రహ్మప్రకాష్, శ్రీకృష్ణనాయర్ మొదలైనవారిని శ్రీవ్యాస్ ఎందుకు వదిలేశారో తెలియదు. సేనాధిపతుల ఆజ్ఞమీద సాగించిన యుద్ధానికి సైనికులను బాధ్యులుగాచేసి ఉరితీసినట్లు, అసలు ముఠాధిపతులను ఏమీ అనకుండా వారి అనుచరులపై చర్యతీసుకున్నారు.

మరి అభ్యర్థులను సెలెక్టుచేసే పారమెంటరీబోర్డు సెలెక్షన్ కమిటీ సంగతేమిటి? ఈ కమిటీ సభ్యుల ప్రవర్తనను కూడా విచారణ చేయించాలిగదా? ఓడిపోవటం తథ్యమని తెలిసిన అభ్యర్థులను వీరు సెలెక్టు చేసినందుకు వారిపై చర్య తీసుకోలేదేం?

కాంగ్రెసు అధ్యక్షుడు మామూలుగా వార్తాపత్రికలు చదువుతూ ఉంటారనుకుంటాను. నా ఊహ నిజమే అయితే, కాంగ్రెసు మునిసిపల్ పార్టీలోని రెండు ముఠాలకు రోజూ జరిగే పోరాటపువార్తలు కూడా ఆయన చదువుతూనే ఉంటారు. అచ్చే 'అటువంటి పోరాటమేమీ లేదో' అని ఏమీ ఎరగనట్లు ముఠాధిపతులు ప్రకటనలు చేస్తున్నా విభేదాలు నానాటికీ మితిమీరిపోతున్నాయనే సంగతి అందరికీ తెలిసినదే. ఇటీవల జరిగిన బహిష్కారాల ఫలితంగా కాంగ్రెసుపార్టీలో ఐకమత్యం ఏర్పడుతుందా అనేది చూడవలసిన విషయం.

ఢిల్లీ కార్పొరేషనులో కూడా ఒకరకం ప్రచ్ఛన్న యుద్ధం జరుగుతోంది. కార్పొరేషను ఏర్పడకముందు, సభ్యులే ఢిల్లీకి నిజమైన పరిపాలకులుగా ఉండేవారు. తమకు ఏ ఫైలు కావలసి వస్తే ఆ ఫైలు తీసుకుని తనిఖీ చేసి, మునిసిపల్ శాసనాన్ని తోసి రాజనేటటువంటి నిర్ణయాలు చేసేవారు. ఇప్పుడు కార్పొరేషను చట్టం ప్రకారం ఈ అధికారం మునిసిపల్ కమీషనరు కొక్కడికే ఉంది. ఈ కమీషనరు సమర్థుడూ, అనుభవజ్ఞుడూ అయిన ఐ. సి. యస్. ఉద్యోగి. అధికారపత్రాలను తనిఖీ చేయటానికి పార్లమెంటు సభ్యులకు ఎలా అధికారం లేదో అలాగే కార్పొరేషను ఫైళ్ళను తనిఖీచేసే అధికారం కార్పొరేషను సభ్యులకు లేకుండా చేశారు. మునిసిపల్ ఉపనిబంధనలకు వ్యతిరేకంగా తమ వోటర్లను ఇళ్ళుకట్టుకోనిచ్చే అధికారం ఇకమీద కార్పొరేషన్ సభ్యులకు లేదు. ఈ అధికారాలను లాగివెయ్యటంతో సభ్యులు చిరచిరలాడుతున్నారు. మునిసిపల్ కమీషనరుకు వ్యతిరేకోద్యమం లేవదీయటంలో ఏకమవుతున్నారు. కమీషనరు ఈ పరిస్థితులలో ఎంతకాలం ఉద్యోగం చేయగలుగుతారో, ఎంతకాలం ఢిల్లీలో పౌర శాసనాలు అమలు చేయగలుగుతారో అనేది కేంద్ర మంత్రులమీద, ముఖ్యంగా ప్రధానమంత్రి మీద ఆధారపడిన విషయం. చివరికి మునిసిపల్ కమీషను మూటముల్లె కట్టుకుని ఢిల్లీ గల్లీలను, కుట్రలనూ వదిలేసి బొంబాయికి తరలిపోవలసిన స్థితి రావచ్చు.

* * *

1935 సం॥ పు భారతప్రభుత్వ చట్టంలో ఉద్దేశించిన ఫెడరేషన్ వ్యవస్థ విషయమై కొన్ని కొత్తవిషయాలను లార్డ్ పెర్సీ (న్యూకాసిల్) ఇటీవల వ్రాసిన ఒక పుస్తకం (సమ్ మెమరీస్) లో వెల్లడించారు.

(55 వ పేజీ చూడండి)

(గతసంచిక తరువాయి)

చివరకు 1927 సం|| మార్చి 27 వ తేదీ ప్రొద్దుటే పెరల్ బక్ కుటుంబంతో సహా కాఫీ ఫలహారాలు తీసుకుంటున్న సమయంలో ప్రళయం విరుచుకుపడ్డది. విప్లవకారులు పట్టణంలో ప్రవేశించి తెల్లవాళ్లందరినీ కాల్చి చంపుతున్నారని ఎవరో పరుగెత్తుకుంటూ వచ్చి పెరల్ బక్ కు చెప్పిపోయారు వెంటనే పెరల్ బక్ కట్టుబట్టలతో తన చెల్లెలి కుటుంబంతో సహా యిల్లువిడిచి బయటకొచ్చేశారు. కాని ఎక్కడ తల దాచుకోడం. భయంతో గజగజ వణికిపోతున్న ఆ కుటుంబాన్ని కాపాడ్డానికి 'లూ' ముందుకు వచ్చింది.

పరుగెత్తుకొచ్చిన 'లూ' పెరల్ బక్ చేతిలోని చంటిబిడ్డని ఎత్తుకుంటూ "అమ్మా భయపడకండి. నా గుడిసెలో దాక్కుందురుగాని రండి. త్వరగా రాండి ఆలశ్యం చేయకండి. అంటూ పెరల్ బక్ కుటుంబాన్నందర్నీ పెరటివైపునుండి పొలాల్లోవున్న తన మట్టి గుడిసెకు తీసికెళ్ళింది. 'లూ' గుడిసె లోపల రెండువిరిగి పోయిన బెంచీలు మాత్రం వున్నాయి. ఒక బెంచీమీద తన బిడ్డను, చెల్లెలి బిడ్డను పడుకోబెట్టింది పెరల్ బక్. రెండవ బెంచీ మీద తన భర్త, చెల్లెలి భర్త, తండ్రి కూర్చున్నారు తలలు పట్టుకుని—

"యిగుగో యిప్పుడే వస్తానమ్మా అంటూ తలుపు మూసి బయట తాళం వేసుకుని పెరల్ బక్ కుటుంబానికి భోజన సదుపాయాలు చేయడానికి పరుగెత్తింది 'లూ'.

గంటలు గడిచి పోయాయి, వూరంతా తుపాకుల కాల్పులతో ప్రతిధ్వనించి పోయింది. తెల్లవాళ్ల యిళ్లు తగలబడిపోతున్నాయి మంటల ఫెళ ఫెళలూ, తెల్లవాళ్లందర్నీ నల్లుల్ని చంపినట్లు చంపుతూన్న చైనీయుల వికటాట్టహాసాలూ, దిక్కులు పిక్కటిల్లి పోయేట్లు వినబడుతున్నాయి పెరల్ బక్ కు—

ఎన్నో సంవత్సరాలుగా చైనాలోని అన్ని ప్రాంతాల్లోనూ కుములుతూ, రగులుతూ వస్తూన్న ప్రజల్లోని తిరుగుబాటు ఆ రోజు విశ్వరూపం ధరించింది.

చైనీయుల తప్పులేదు. తెల్లవాళ్ళ పాపం పండింది అనుకుంది పెరల్ బక్.

'లూ' గుడిసెలో, లూ సంరక్షణలో మూడు రోజులు అజ్ఞాతవాసం చేశారు, పెరల్ బక్ కుటుంబం అంతా.

మూడవ నాడు దీపాలు పెట్టిన తర్వాత లూ 'గుడిసె తలుపు తెరుచుకుంది. పెరల్ బక్ స్నేహితురాలి భర్త రహస్యంగా లోపలకొచ్చాడు. పెరల్ బక్ స్నేహితురాలు ఒకామె పెరల్ బక్ కుటుంబానికి ధైర్యం చెప్పడానికి భర్తను పంపింది. మట్టి గుడిసెలో మూడు రోజులుగా పసిబిడ్డల్లో తలదాచుకుంటున్న ఆ కుటుంబాన్ని చూసి స్నేహితురాలి భర్త కన్నీరు కార్చాడు. క్షమించమని వేడుకొన్నాడు. "మేము కొందరం కలిసి మీ కుటుంబాన్నీ మీ జాతివారి కుటుంబాలను మరి కొన్నిటినీ కాపాడ్డానికి ప్రయత్నిస్తున్నాం. ఈ విషయమై కొత్త అధికారులతో మనవి చేశాం. మా చేతనైనంతవరకూ మీలాంటి మంచి వారికి సహాయపడాలనే ప్రయత్నిస్తున్నాం. చైనీయులు హృదయంలేని చతుష్పాద జంతువు లనుకోకండి." అని స్నేహితురాలి భర్త చెబుతూంటే కృతజ్ఞతతో పెరల్ బక్ హృదయం నిండి పోయింది.




అతను వెళ్ళిపోయిన కాసేపటికి 'లూ' వచ్చింది. చివరకు పెరల్ బక్ యిల్లుమాత్రం కాల్చలేదు కాని లూటీచేశారని చెప్పింది 'లూ.' ఆ సమయంలో తనక్కడికి పరుగెత్తుకెళ్ళి కొన్ని వసువులు తీసుకొచ్చి భద్రపరిచాననికూడా చెప్పింది. ఆసమయంలో—జీవితం మీదనే విరక్తపుట్టిన పెరల్ బక్ కు ఏం వసువులు పోయాయో ఆలోచించి బాధపడేఓపిక లేకపోయింది.

"మా కోసం నీ ప్రాణాలకు ముప్పు రాకుండా చూసుకో లూ" అన్నది పెరల్ బక్.

"ఆ! చూస్తానుగా ఎవడొస్తాడో యీ గుడిసెవైపుకు! వాణ్ణి ప్రాణాలతో పోనిస్తానా! మూర్ఖపు పశువులు. మంచీచెడ్డా తెలీకుండా గాడిదా గుర్రం ఒకటిగా కనిపించేవాళ్లకళ్లకు కావరంకమ్మి యీలాంటి అట్టహాసం చేస్తున్నారు" అని లూ వుద్రేకంలో అంటూంటే పెరల్ బక్ 'లూ' పాదాలకు మనసులోనే నమస్కరించింది.

మర్నాడు మళ్ళీ స్నేహితురాలి భర్త భోరున ఏడుస్తూ వచ్చి పెరల్ బక్ ముందు మోకరిల్లాడు. "తల్లీ క్షమించండి మిమ్మల్ని మేమేం చేయలేకపోయాం. యీ రోజు రాత్రి అయ్యేలోపుగా తెల్లవాళ్లందర్నీ కాల్చిచంపుతామని కంకణం కట్టుకున్నారు వాళ్లు. మేము నిస్సహాయుల మయిపోయాం. ఎదురుచెబితే మమ్మల్నికూడా చంపుతారు. మీ కుటుంబంకోసం నా భార్య ఏడుస్తోంది యింట్లోకూర్చుని—మీ స్నేహితులమైకూడా మిమ్మల్ని మీ ప్రాణాల్ని కాపాడలేక పోతున్నాం" అని వెక్కివెక్కి ఏడ్చాడా అమాయకుడు—అంతావిన్న పెరల్ బక్ కుటుంబం కొయ్యబారిపోయారు.

ఏడుస్తున్న స్నేహితురాలి భర్తను పెరల్ బక్, ఓదార్చి పంపించేసింది.

ఏక్షణంలో, మృత్యుదేవత పిలుపు వస్తుందోనని సాయంకాలం దాకా ఎదురుచూస్తూ కూర్చున్నారు అప్పటికే సగంచచ్చిపోయిన పెరల్ బక్ కుటుంబం.

చీకటి పడ్డతర్వాత గుడిసెతలుపు తెరవబడింది ఈసారిచేతులో టార్చిలైటు పట్టుకున్న కమ్యూనిస్టు ఆఫీసరతోబాటు ప్రొద్దుటే వచ్చిన స్నేహితురాలి భర్తకూడా వున్నాడు.

కాని అతను యీసారి పెరల్ బక్ వైపుకూడా చూడకుండా, అసలు పెరల్ బక్ కుటుంబమే తనకు తెలీనట్టు నటించాడు. అతనలా నటించకపోతే, ఉభయులకూముప్పు కలుగుతుందని పెరల్ బక్ గ్రహించింది.

"మీరంతా యూనివర్శిటీ బిల్డింగుల్లోకి వెళ్లండి - అక్కడే తెల్లవాళ్లంతా రేపు సాయంకాలందాకా వుండాలి. యిది కొత్త గవర్నమెంటువారి ఆజ్ఞ...అంటూ కర్కశంగా చెప్పాడు పెరల్ బక్ స్నేహితురాలి భర్త - అలా ఆజ్ఞాపించాడేగాని పెరల్ బక్ ఏమనుకుంటుందోనని క్షమించండి. అని అతని పెదాలు గొణుగుతూండడం పెరల్ బక్ చూసింది - తన కుటుంబంకోసం అంత శ్రమపడుతున్న అతనికి తన మనస్సులోనే కృతజ్ఞత చెప్పుకుంది.

యూనివర్సిటీ బిల్డింగ్ కు కమ్యూనిస్టుల వెనకనడుస్తున్న పెరల్ బక్ చేతిలోని చంటి బిడ్డ కాలు ముందు నడిచే ఆఫీసర్ వీపుకు తగిలింది. కోపంతో మండిపోయిన ఆఫీసరు చటుక్కున వెనక్కు తిరిగాడు "క్షమించండి పసిబిడ్డ - అన్నది గజగజ భయంతో వణికిపోతున్న పెరల్ బక్.

తన చిన్నతనంలో ఒకసారి తెలీక తను

# ★ పెరల్ బక్ ★

చేసిన దురుసుతనానికి తనవైపు గుడ్లురిమి చూసిన ఒక చైనీయుడి దగ్గిర తనతల్లి అదే వినయంగా క్షమాపణ వేడుకున్న సంఘటన ఆక్షణంలో జ్ఞాపకంవచ్చింది పెరల్ బక్ కు.

యూనివర్సిటీ బిల్డింగులో, తలదాచుకున్న తెల్లవాళ్ళంతా 24 గంటల్లో షాంఘై వెళ్ళిపోవాలని ప్రకటించారు అధికారులు.

మర్నాడు సాయంకాలం 6 గంటలకు అమెరికన్ కౌన్సలేట్ వారు సిద్ధంగావుంచిన ఓడదగ్గిరికి అయిదు నిమిషాలు ముందు వెళ్ళిన పెరల్ బక్ కుటుంబమూ, మిగతా తెల్లవాళ్లూ బ్రతికి బయటబడ్డారు.

పెరల్ బక్ జీవితంలో 1927 మార్చి నెలలో జరిగిన భయంకరమైన అసంఘటన జీవితంలో ఆమె మర్చిపోలేదు.

'షాంఘై' లో వుండడం కంటే నరకం లేదంటుంది పెరల్ బక్. అన్ని దేశాలనుండి వచ్చిన కాందిశీకులతో కిటకటలాడిపోయే షాంగై అంటే పెరల్ బక్ కు అసహ్యంగా వుండేది. కాని విధి లేదు. తను కూడా రెఫ్యూజీయేగా! తను చైనా విడిచిపెట్టి వెళ్ళలేదు. చైనా తన్ను వుండనివ్వదు—తన జీవిత సమస్య తేలిందాకా కొంతకాలం జపాన్ దేశం అంతా పర్యటించి రావాలనుకున్నది పెరల్ బక్. ఆ గడ్డు రోజుల్లో కూడా జపాన్ కు ఎల్లాగో కష్టపడి పాస్ పోర్టు సంపాదించింది పెరల్ బక్. తన తండ్రి కొరియా వెళ్ళివస్తానని వెళ్ళిపోయాడు—చెలెలు కుటుంబంతో సహా కోబ్ వెళ్ళిపోయింది తను తన కుటుంబంతో జపాన్ వెళ్ళింది పెరల్ బక్.








## జపాన్‌లో

పెరల్ బక్ కు జపాన్ నచ్చింది. ముఖ్యంగా జపానీయుల చురుకుతనం, తెలివితేటలు పెరల్ బక్ ను ఆకర్షించాయి. చైనీయుల మాదిరిగా నల్లమందు మత్తులో మందంగా పడివుండకుండా, జీవితంలో ఒక్క క్షణంకూడా వృధాకానివ్వకుండా ప్రతిపనీ చకచక చేసుకుపోయే జపానీయులను చూడముచ్చటయింది పెరల్ బక్ కు. కొద్దిరోజులు హోటలులోవుండి చుట్టుపక్కల వూళ్ళన్నీ తిరిగి చూసినమీదట దగ్గిరలోవున్న అందమైన కొండలమీద కొన్నాళ్ళు నివసించాలని నిశ్చయించుకుంది.

కొండమీద దేవదారుచెట్లకింద నాలుగు గదుల చెక్కయిల్లు ఒకటి చిక్కింది. రేకులతో కట్టిన ఒక స్నానాల గదకూడావుంది. ఆ యింటికి—

ప్రతిరోజూ ప్రొద్దుటే 'కిమోనోలు' ధరించిన నలుగురు స్త్రీలు కోడిగుడ్లూ, కూరగాయలూ అమ్మడానికి వచ్చేవారు పెరల్ బక్ యింటివెపు - యింకా నిద్రలేవక పోతే వాళ్ళే తలుపుతట్టి నిద్రలేపేవాళ్ళు. ఆ నలుగురు స్త్రీలూ రెబ్బలాడుకోకుండా నలుగురిదగ్గరా సమానంగా కూరలూ, గుడ్లూ కొనేది పెరల్ బక్. నలుగురూ తృప్తిగా నవ్వుతూ వెళ్ళిపోయేవారు.

ఒకరోజు స్నానంచేస్తున్న పెరల్ బక్ కు రేకు తలుపుసందులోనుండి నల్లటికన్ను కనిపించింది. తనచేతి వేలితో తలుపుసందులో కనిపించే కన్ను పొడవబోయింది. వెంటనే ఆకన్ను వెనక్కు తగ్గింది. అసలు ఆకన్ను ఎవరిదా అన్న సందిగ్ధంలోపడి స్నానముగించి బయటకొచ్చింది పెరల్ బక్. మామూలుగా కోడిగుడ్లు యిచ్చే జపాన్ స్త్రీకి పెరల్ బక్ యింట్లో వుందో లేదో తెలుసుకోడానికని నీళ్లచప్పుడవుతోంటే స్నానాలగదిలోకి చూశానని చెప్పింది ఆఅమ్మి అమాయకంగా నవ్వుతూ.

## గయ్యాళి 'లీ'

నాన్‌కింగ్ లో పెరల్ బక్ కు ఒకపనిమనిషివుండేది. ఆమెపేరు, లోక కత్రిపే 'లీ'. మహాగయ్యాళి. ఆవిడగయ్యాళితనాన్ని భరించలేకనే ఆమె ప్రేమించిన ప్రియుడు కూడా పెళ్ళాడకముందే పారిపోయాడు. అతిణ్ణి వెతుక్కుంటూనే లీ, వెళ్లింది కొంతకాలం పెరల్ బక్ దగిర పనివదిలేసి. జపాన్‌లోని కొండల్లో వుంటున్న పెరల్ బక్ జాడ ఎలా తెలుసుకుందో ఏమో! ఒకరోజు వున్నట్లుండి వుప్పెనలాగా వచ్చింది 'లీ'. లీ గయ్యాళి అయినా పెరల్ బక్

కోసం ప్రాణం పెట్టేది—అంగుకే జపాన్‌లో వున్న ఈ మె కోసం పాస్‌పోర్టు కూడా లేకుండా సమర్థించుకొచ్చింది. తనకోసం వెతుక్కుంటూ వెనకాలే వచ్చిన పోలీసు వాళ్ళను పొడలగొట్టి పంపించింది.—'లీ'వల్ల చికాకు కలిగినా ఒక విధంగా 'లీ' రావడం పెరల్ బక్‌కు మేలయింది. యిల్లంతా శుభ్రంగా వుంచడమేగాకుండా, ఏ వేళకు కావలసింది ఆ వేళకు అమర్చిపెట్టేది లీ. లీ వస్తూనే జపాన్ తనకు నచ్చిందని చెప్పింది.

"ఎందుకంటే చైనాలో ఏ పెద్ద మనిషైనా రిక్షాకోసం కేకేసే యిద్దరు రిక్షావాళు ఒకేసారి ఎగబడతారు—అందులో ఏ ఒకడికి బేరం తగిలినా, రెండవవాడు అగ్గి బరాటా అయిపోయి మొదటివాడిని నానాబూతులూ తిడతాడు. కాని జపాన్‌లో అలా కాదు. ఇద్దరు రిక్షావాళ్ళు పొరపాటున ముందు కొస్తే ఒకళ్ళకొకళ్ళు క్షమాపణ చెప్పుకొన్నాక మర్యాదగా వెనక్కి తగ్గుతాడు రెండవవాడు. ఒక్కొక్కసారి బేరం నీది అంటే నీది అని పరస్పరం బ్రతిమలాడుకొంటారు. చూశారా, ఎంత తేడా వుందో చైనాకూ, జపాన్‌కూ! జపాన్‌వాళ్ళు మర్యాదస్తులు" అన్నది లీ. గయ్యాళి మనిషి 'లీ' స్వభావం బాగా తెలిసిన పెరల్ బక్ కనిపెట్టిన సులభమైనమార్గం లీ చెప్పిందానికంతా ఁ వునని ఒప్పుకోడం—

కొద్దిరోజులలోనే పెరల్ బక్‌కు శుభవార్త వచ్చింది. తెల్లవాళ్లంతా తిరిగి చైనా రావచ్చనీ, కమ్యూనిస్టుల్లోనుండి చేరిన కొత్త గవర్నమెంట్ పేరట జనరల్ చాంగై షేక్ అనుమతి యిచ్చాడనీ విన్నది.

అది సంతోషకరమైనవార్తే అయినప్పటికీ, అందమైన జపాన్ దేశాన్ని వదిలి వెళ్ళడానికి బాధపడ్డది పెరల్ బక్—ఏ క్షణంలో భూకంపం వస్తుందో, ఏ క్షణంలో వుప్పెనవచ్చి సముద్రం వూడ్చుకుపోతుందో తెలీని జపానీయులు మృత్యువు ఒడిలో కాపరంవుంటూ మృత్యువును గురించి బాధపడేవారు కారు.

మళ్ళీ డిసంబరు నెల వచ్చేసరికి పెరల్ బక్ కుటుంబంతో సహా చైనా వెళ్ళిపోయింది. కాని యింకా నాన్‌కింగ్ వెళ్ళడానికి అనుమతి రాలేదు. నాన్‌కింగ్ వెళ్ళేదాకా కొంతకాలం షాంగైలోనే వుండాల్సి వచ్చింది పెరల్ బక్ కుటుంబం. ఆ సంవత్సరం క్రిస్టమస్ చాలా బాధాకరంగా గడిచిపోయింది. పెరల్ బక్ జీవితంలో—పిల్లలకి ఒక్క 'గిఫ్ట్' పంపిన వాళ్ళు లేరు—అన్నీ తనే కొనుక్కోవలసి వచ్చింది పిల్లలకోసం. ఆ పరాయి చోట్లో—చాలీచాలని అద్దెకొంపలో అన్ని జాతుల వారితోనూ కలిసి వుండటానికి పెరల్ బక్‌కు కొంచంకూడా కిట్టలేదు.

ఒకరోజు పెరల్ బక్ అద్దెకున్న మేడమీది గదిలోకి మేడకిందిభాగంలో వుండే వంటగదిలోనుండి 'లీ' కేకలు వేయడం వినిపించింది. మళ్ళీ ఏం కొంపలంటుకున్నాయోనని పెరల్ బక్ కిందికిపరుగెత్తింది. గయ్యాళి 'లీ' తన పారిపోయినప్రియుణ్ని ఒకగుంజకు కట్టేసి, "పెళ్ళాడతానని ఎందుకు పారిపోయావు చెప్పు" అని చేతులో చీపురుఒకటి పట్టుకుని అతణ్ణి నిలదీసి అడుగుతోంది—పెరల్ బక్‌కు నవ్వుతోబాటు కోపంకూడా వచ్చింది—విషయం ఏమిటని విచారిస్తే 'లీ' చెప్పింది పెళ్ళాడుతానని మోసంచేసి వెళ్ళిపోయిన తనప్రియుడు, షాంగై మార్కెట్‌కు కూరగాయలు తేవడానికి వెళ్ళిన తనకంటబడ్డాడనీ, అతని పక్కనే తనకంటే పెద్దదీ అంగవిహీనురాలూ అయిన ఒక ఆడదికూడా తన ప్రియుడితో కూడా కులుకుతూ నడుస్తోందనీ, అనుకోకుండా పట్టుబడ్డవాళ్ళిద్దర్నీ అక్కడే పట్టుకుని దులిపాననీ, చేతికిచిక్కిన ప్రియుణ్ని యింటికిలాక్కొచ్చి గదిలో పెట్టి తాళం వేశాననీ లేపోయినా అతను పెళ్ళాడేదాకా గదితాళం తీయననీ చెప్పింది ఆవేశంతో వున్న 'లీ'.

(ఇంకావుంది)

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక
# బాలల సంఘం

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో 1958 జూలై 1-వ తేదీ నుంచి 'బాలలసంఘం' స్థాపించాము. జూలై 1-వ తేదీ నాటికి 15 సంవత్సరాల వయస్సు నిండని, ఐదేళ్ళ వయస్సుకు తక్కువ గాని ప్రతి తెలుగుబాలుడూ, బాలికా సభ్యత్వం పొందవచ్చు. సభ్యత్వానికి గుసు మేమీ చెల్లించవలసిన పనిలేదు. తెలుగు బాలబాలికలందరూ వెంటనే సభ్యులుగా చేరి సచిత్ర వారపత్రిక అప్పుడప్పుడు నిర్వహించే చిన్న చిన్న పోటీలలో పాల్గొని "సంఘం" ఆశయాలను జయప్రదం చేయడానికి సహాయపడతారని ఆశిస్తున్నాము.

### గమనిక

పదకొండు మొదలు 15 సంవత్సరాలవరకూ వయస్సుగలవారిని 'A' వర్గంగానూ, ఆరు మొదలు 10 సంవత్సరాల వయస్సువరకూ గల వారిని 'B' వర్గంగానూ విభజించడం జరుగుతుంది

## ముఖ్య విషయాలు

సభ్యులుగా చేరదలచిన బాలబాలికలు చేయవలసిం దొకటే. దీనితోపాటు ఒక సభ్యత్వపు దరఖాస్తును ముద్రిస్తున్నాము. అందులోని ఖాళీస్థలాలను మీ వివరాలతో జాగ్రత్తగా నింపి (కొట్టివేతలు, దిద్దుపులు వుండకూడదు.) ఆ అచ్చు దరఖాస్తును తిన్నగా కత్తిరించి కవరులో:

సంపాదకుడు,

ఆంధ్ర పత్రిక సచిత్రవారపత్రిక,
తంబుచెట్టివీధి, మద్రాసు-1.

అనే చిరునామాకు పంపాలి. కవరుమీద ఎనుకపైపు "సచిత్ర వారపత్రిక బాలల సంఘం" అని స్పష్టంగా వ్రాయాలి. మామూలు కాగితాలమీద వ్రాసిపంపే దరఖాస్తులను స్వీకరించము.

ఒక్కొక్క దరఖాస్తుమీదా ఒక్కొక సభ్యుని, లేదా, సభ్యురాలి పేరుమాత్రమే వుండాలి. సభ్యత్వపు దరఖాస్తును సచిత్ర వారపత్రికలో సాధ్యమైనంతవరకు వారం వారం ప్రచురిస్తుంటాము.

సభ్యులుగా చేర్చుకున్నట్లు ఒక్కొకరి పేరా విడివిడిగా ఒక్కొక సభ్యత్వపు కార్డును పంపుతాము. ఆ కార్డుమీద సభ్యత్వ క్రమాన్ని సూచించే ఒక సంఖ్య వుంటుంది. ముందు ముందు సభ్యులుగాని, సంఘం గాని జరిపే ఉత్తర ప్రత్యుత్తరాలలో ఆసంఖ్యను ఉదహరిస్తూండడం జరుగుతుంది.

పదిహేనేళ్ళ వయస్సు పూర్తికాగానే, ఆతేదీతో బాలల సంఘంలో సభ్యత్వం దానం తటదే రద్దయిపోతుంది.

### లక్ష్యాలు

(1) సభ్యులుగాచేరే బాలబాలికలను ఆరుమొదలు పదేళ్ళవరకూ ఒక వర్గంగానూ. (B), పదకొండు మొదలు పదిహేనేళ్ళ వరకూమరొకవర్గంగానూ (A), విభజించిఉభయ వర్గాలకూ విడివిడిగా అప్పుడప్పుడు రెండురకాల పోటీలు నిర్వహించి ప్రథమశ్రేణిలో నెగ్గేవారికి మాకుతోచిన బహుమతుల నివ్వడం. (ఈ విషయంలో పోటీనిర్వహణకర్తలదే తుదినిర్ణయం)

(2) సభ్యులలో వారివయస్సుకు తగినట్లుగా రచనాశక్తిని, వకనాసక్తినీ, కళాభిమానాన్నీ యథాశక్తి పెంపొందచేయడం.

(3) చిత్రలేఖనం, నృత్యం, అభినయం, గాత్రం, వీణ, వయొలిన్ మొదలయిన లలిత కళలలోనూ, వ్యాయామక్రీడలలోనూ ప్రత్యేక అభిరుచీ, ప్రవేశం కనబరిచే బాలబాలికలను బహుమతులద్వారానూ, ఇతరవిధంగానూ ప్రోత్సహించడం

(4) ఏ ప్రాంతంలో నివసిస్తున్నవారైనప్పటికీ తెలుగు బాలబాలిక లందరిమధ్యా స్నేహ సమైక్యభావాలను పెంపొందజేయడం

(5) ఉన్నత పాఠశాలలలో చదివే విద్యార్థులకు ఉచిత విద్యార్థివేతనాలను బహూకరించడం. (దీనికి సంబంధించిన వివరాలను ముందుముందు ప్రకటిస్తాము)



---

**ఆంధ్ర సచిత్ర వారపత్రిక**
**బాలల సంఘం**
[సభ్యత్వపు దరఖాస్తు]

GROUP
A లేక B

సభ్యుని (సభ్యురాలి) పూర్తిపేరు (విడివిడి అక్షరాలలో)

పుట్టినతేదీ, నెల, సంవత్సరం : జూలై 1 నాటికి వయస్సు ఏండ్లు : నెలలు :
తండ్రి, లేక, సంరక్షకుని పూర్తిపేరు ....
ఊరిపేరు, జిల్లా, తాలూకా, పోస్టు [వీధి నెంబరు] ....
* చదువుతున్న తరగతి, లేక, ఫారము ; ....
పాఠశాల పేరు : ....
ప్రధానోపాధ్యాయునిపేరు (తెలిస్తే) ; ....

అర్యా :
ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘములో నన్ను సభ్యునిగా/సభ్యురాలుగా చేర్చుకొన ప్రార్థన, పైన వ్రాసిన విషయాలన్నీ యదార్థములు.

ఇట్లు

[తేదీ : -1958]

(సంతకము)

* వరా : ఏ పాఠశాలలోనూగాక ఇంటివద్దనే ట్యూషన్ చెప్పించుకొనే బాలబాలికలు కూడా సభ్యులుగా చేరవచ్చు. 'చదువుతున్న తరగతి' అనే విషయానికి ఎదురుగా 'ప్రైవేట్ స్టడీ' అని వ్రాయాలి.

సంచిక: **16-7-58** | ఈ దరఖాస్తు **19-7-58** నాటికి మాకు చేరాలి

# ★ కొందరు సభ్యుల పేర్లు ★

సచిత్ర వారపత్రిక బాలలసంఘంలో ఇప్పటివరకూ సభ్యులుగా చేరినవారిలో కొందరి పేర్లను, వారి ఊళ్ళను ఇక్కడ ప్రచురిస్తున్నాము. ఇకమీదట వారం వారం కొందరి పేర్లను ప్రచురిస్తుంటాము. సభ్యత్వపు కార్డులను త్వరలోనే అందజేస్తాము.

1. పంగారు మహేశ్వర రావు (విశాఖపట్నం) 2. దేవులపల్లి మధుసూధన్ (ఆకిరిపల్లి, కృష్ణా) 3 తుమ్మపాటి వెంకట గణపతి రావు (విజయవాడ) 4 బిజాపురి రామకోటేశ్వర రావు (ఒంగోలు) 5. పాకల వెంకట సుబ్బారావు (ఏలూరు) 6 రెబ్బాప్రగడ లక్ష్మీదేవి (కొవ్వూరు) 7. విస్సాప్రభాకర్ (గుంటూరు) 8. నిభానుపూడి రామకృష్ణారావు (ఏలూరు) 9 మామిళ్ళపల్లి వెంకట లక్ష్మీనారాయణ (నరసరావుపేట) 10. బేబీ చంద్రకళ (మంచెరియాల్, ఆదిలాబాద్ జిల్లా) 11. తోమురి సాయిబాబా (ఏలూరు) 12. పల్లపోతు జయదేవ్ (బాపట్ల) 13 జంధ్యాల సుందరరామశాస్త్రి (గుంటూరు) 14 గరికపాటి రజనీమయి (అమర్తలూరు, గుంటూరుజిల్లా) 15. బోడపాటి సీతాకుమారి (మద్రాసు) 16. కె. రఘు (బళ్లారి) 17. చినగరఘం గోపాలకృష్ణ (పెద్దాపురం) 18. వింగినేని సాంబశివరావు (పెదవడ్లపూడి) 19. కొంపెల సూర్యకృష్ణప్రసాద్ (కొత్తపేట, తూ॥ గో॥) 20. విజ్జపు భాస్కర రావు (కాకినాడ) 21. జోతా వెంకటప్పయ్య (ఆకిరిపల్లి, కృష్ణా) 22. పుణ్యమూర్తుల నరసింహ రావు పండిట్ (కాకినాడ) 23. వంకమ సాంబశివరావు (పొన్నూరు) 24 శీరం చంద్రమోహన్ (దుగిరాల) 25. కడియాల వివేకానందమూర్తి (తణుకు) 26. చేబ్రోలు పాపారావు (దైవాలరావూరు, గుంటూరు జిల్లా) 27 పోలా మధుసూధనరావు (వైరా ఖమ్మం జిల్లా) 28. పానుగంటి అన్నాజీరావు (తణుకు) 29. పెద్దాడ రవి రాజచంద్ర (అమలాపురం) 30 గోగడ అశోక్ కుమార్ (గుంటూరు) 31. రాంపల్లి లలితాదేవి (ఏలూరు) 32 ఒబిరిశెట్టి లక్ష్మి (తుని) 33 చెన్నుపాటి సురేష్ బాబు (నూజివీడు) 34 కోలవెన్ను వెంకట కృష్ణబాబు (విజయవాడ) 35. కాజ రాజ్యం (చిలకలూరిపేట) 36 నడకుదుటి సూర్యకుమారి (రాజమండ్రి) 37 తాళ్ళూరి చంద్రశేఖరరావు (హైదరాబాదు) 38. ఈవి ప్రేమజ్యోతి (రామచంద్రపురం) 39. మ. జయాకొద్దీన్ (కామారెడ్డి, నిజామాబాద్) 40. జి. మల్లయ్య (కామారెడ్డి) 41. యు. శ్రీధర (కర్నూలు) 42. బండి సత్యనారాయణ (ఏలూరు) 43. కొత్త పద్మినీ రాజ్యం (దుగ్గిరాల) 44 సి. నళిని (మద్రాసు) 45. చెరుకూరి సత్యనారాయణ (వైరా) 46. పులిపాటి శ్రీరంగశాయి (తెనాలి) 47. కాట్రగడ్డ నాగేశ్వరరావు (వెంట్రప్రగడ, కృష్ణా జిల్లా) 48. తుర్లపాటి కృష్ణవేణి (కావలి) 49. తులసి వెంకట సూర్యనారాయణమూర్తి (అనపర్తి, తూ॥ గో॥) 50 పయ్యావుల వెంకట చక్రధరరావు (ఏలూరు) 51. సూరపనేని విజయసాయి (పెడసనగల్లు, కృష్ణా) 52 అయ్యగారి విశ్వేశ్వరరావు (రాజమండ్రి) 53. పఠానేని వరలక్ష్మి (సంధిపూడి, తూ॥ గో॥) 54. రావిపాటి ప్రభాకరరావు (గూడెపల్లి, గుంటూరుజిల్లా) 55. మధ్యపతి రాధాయ్ (గుంటూరు) 56. ద్వారంపూడి సీతారామిరెడ్డి (సత్యారామేశ్వరము, ప॥ గో॥) 57. గురువాడ సంజయకుమార్ (నిజామాబాద్) 58. కోనూరు చిట్టి నారాయణమ్మ (విశాఖపటణము) 59 బందా బాలాత్రిపురసుందరి (విజయవాడ) 60 నాకొభట్ల శ్రీ లక్ష్మి (ఉప్పాడ, తూ॥ గో॥)

61. తాతినేని ప్రేమకుమార్ (విజయవాడ) 62. ఏకుకూరుల రామకోటేశ్వర రావు (మధిర, ఖమ్మంజిల్లా) 63 యం. సత్యనారాయణ (హైదరాబాదు) 64. అయ్యగారి వెంకటకౌండిన్య కృష్ణకుమార్ (హైదరాబాదు) 65. బి. వసుంధర (మద్రాసు) 66. కె. రమేష్ చందర్ (హైదరాబాదు) 67. కలవకొలను కృష్ణమూర్తి (హైదరాబాదు) 68. అయ్యగారి మురళీకృష్ణ (ఏలూరు) 69 పాలకుర్తి రామగోపాలరావు (హైదరాబాదు) 70. ముక్తవరపు పార్థసారథి (భువనగిరి, నల్గొండ) 71. చల్లా గురుగుహ (కడప) 72. దేశాయి హనుమంతరావు (విరుపాపురం, కర్నూలుజిల్లా) 73. ఎస్. బాలసరస్వతి (అరగొండగొల్లపల్లి, చిత్తూరు) 74. పార్నంది శ్రీనివాసరావు (విశాఖపట్నం) 75. చిట్టూరి ఇందిర (విశాఖపట్టణం) 76. జవళి బాపుసాహెబ్ (తనకల్లు, అనంతపురంజిల్లా) 77. అబ్బరాజు చంద్రమౌళి (హైదరాబాదు) 78. ఎస్. ఆర్. శ్రీధర్ (మద్రాసు) 79. బి. ఎస్. విజయకుమార్ (కర్నూలు) 80. గుండా నాగరత్నమ్మ (రంగాపురం, కర్నూలుజిల్లా) 81. దెంగుకూరు కనకదుర్గ (గుంటూరు) 82. కొండూరి పురుషోత్తము (గుంటూరు) 83 కాశీవరపు వెంకట రామకృష్ణారావు (పిఠాపురం) 84. దేశరాజు వేణుగోపాలరావు (రాయఘడ, కోరాపుట్టిజిల్లా) 85. ఎల్లమహంతి గోపాలకృష్ణపాత్రో (బరం

(55 వ పేజీ చూడండి)



"మా మామగారిది బహుచిత్రమైన వీలునామా!"



చెల్లెలు, బావా, అంత వేగంగా వస్తారని వెంకట్రావు అసలు అనుకోలేదు. 'వస్తాం, వస్తాం' అంటూ రాసిన ఉత్తరాలు వస్తూనే వున్నాయి. కాని మనుషులుమాత్రం రావడం లేదు. ఈసారి మనుషులూ, ఉత్తరం ఒకేసారి చేరడం జరిగింది.

స్టేషనులో చేస్తున్న పని కాస్తా గబుక్కున ముగించి పరుగెత్తుకుని వచ్చాడు, సామాను దించుతున్న బావదగ్గరకు వెంకట్రావు.

ఆనందంతో అలా నిలబడిపోయాడు. చెల్లెలు పలకరించేటంతా తన్నో తను లేడు. ఇంతలోనే బావ సామానంతా దింపేశాడు. వెంకట్రావు తనలో సిగ్గుపడ్డాడు. వాళ్ళిద్దర్నీ తన యింట్లో దిగబెట్టమని పోర్టరుకి పురమాయించి తిన్నగా రైలుబండి సాగనంపడానికి తగు పెత్తనం చెయ్యడానికి వెనక్కి వెళ్ళాడు.

వెంకట్రావు ఆ ఊళ్ళోవున్న ఆ చిన్న స్టేషనులో చిన్న మాస్టరు. ముసలితల్లీ తనూ ఉంటున్నారు. అతని సంసారం అంతతో ఆ యిద్దరే. పెద్ద మాస్టరు సెలవులో వెళ్ళాడు. అతని జాగాలో వెంకట్రావు పని చేస్తున్నాడు. వెంకట్రావుస్థానే పనిచెయ్యడానికి రాజు వచ్చాడు.

రాజుకి ఏ ఎంపికీ ఆ గొడుగుపట్టే సమరత ఎక్కువగా ఉంది. దానికితోడు మనిషి చాలా మంచి స్వభావం కలవాడు. కలిసి కట్టుగా ఉంటాడు. అంత అందమయినవాడు కాకపోయినా, అందంగా ఉండడానికి అతను పడేశ్రమ అంతా చాలా అందంగా ఉంటుంది.

కల్గిన బట్టలు లేకపోయినా, ఖరీదయిన అందమయిన కళ్ళద్దాలు పెడతాడు. జుత్తు గిరజాలు వంకరపోయినా, రోజూ అరవు అరడజనుసార్లయినా అద్దంముందు నుంచుని వాసననూనె రుద్ది, అరగంట దువ్వి దువ్విన మరింతో నొక్కి, నొక్కి వంకీలు అద్దుకుంటాడు. నల్లని మొగానికి స్నో రాసి, పౌడరుపూసి, తెల్లగా ఉంచుతాడు. మడత నలగని పాంటు, అలాంటిదే చొక్కా ధరిస్తాడు. తన్నుగురించి తాను చాలా శ్రద్ధ తీసుకుంటాడు. నాజూకుగా ఉండాలనీ, అలా కనిపించాలనీ ఉబలాటం హెచ్చు. ఈ కార్యక్రమం అంతా ముగించి, అందమైనవాడిననుకుని, "గ్రెగరీ పెక్"లా నడుస్తూ బయలుదేరుతాడు.

తను చేసే ఉద్యోగంవల్ల వచ్చే రాబడి, తన ఉబలాటపడే నాజూకుతనానికి, అందానికి అయ్యే ఖర్చుకు ఏ మాత్రం చాలదనే విషయం రాజుకు తెలియకపోవడం అతనిలో జాలిగొల్పే విషయం. అందంగా ఉండాలని రాజు ఎంత ఎక్కువ తాపత్రయపడతాడో, తను మంచిగా ప్రవర్తించడానికీకూడా అంతకన్న ఏ మాత్రం తక్కువ తాపత్రయం పడడు.

వచ్చిన రెండు మూడు రోజులవరకూ చూస్తూ, అతని వ్యవహారం అంతా చూసి వెంకట్రావు చాలా ఆశ్చర్యపడ్డాడు. రానురాను అతని మంచితనానికి ముగ్ధుడయ్యాడు.

అతను వంటరిగా, వచ్చీరానివంట వండుకుంటూ, చేతులు కాల్చుకోడం చూసి, జాలిపడి, అతన్ని తనయింట్లో తిండి తినమని బలవంతం చేశాడు. రాజు మొదట్లో కొంచెం మొహమాటం పడ్డా, వెంకట్రావు చూపె వాత్సల్యానికి, అభిమానానికి లొంగిపోయి అతనియింట్లో మనిషిలాగే ప్రవర్తించ కలిగేడు. రానురాను ఇద్దరూ ప్రాణస్నేహితులుగా తయారయ్యారు.

వెంకట్రావు చెల్లెలిపేరు శారద. ఆ అచ్చు రవివర్మ బొమ్మలో శారదలాగే తీర్చి దిద్దినట్టుంటుంది. ఆమె ముఖం ఎంతో కళతో ఆకర్షణీయంగా వుంటుంది.

కాని ఆమె పెనిమిటి మూర్తి బ్రహ్మదేవుడి బొమ్మలా మాత్రం ఉండడు. కాకపోతే అంత [illegible] ఉంటాడు.





ఇద్దరినీ ఒకరి ప్రక్క ఒకరిని చూస్తే ముచ్చటవేస్తుంది.

ఇలాంటి జంట అపురూపము.

ఏర్చి కూర్చినట్లుంటుంది.

ఇది, చూసేవారి అభిప్రాయము.

వెంకట్రావు చెల్లెలూ, బావా, వచ్చిన వ్పటినుండీ, రాజు మళ్లీ స్వయంపాకం మొదలు పెడదామనుకున్నాడు. వెంకట్రావు అతన్ని మందలించడమే గాకుండా తన చెల్లెలు శారదకు, బావ మూర్తికీ, రాజును తన తమ్ముడు అంటూ పరిచయం చేశాడు.

అయినా రాజుమాత్రం రెండు మూడు రోజులపాటు, సిగ్గుతోనూ మొహమాటంతోనూ తిరుగుతూ, తర్వాత రెండు రోజుల్లో ఆ కుటుంబంలోని వానిలా మెలగడం మొదలుపెట్టాడు.

వెంకట్రావుకు రాజుయందుంతే సౌహార్దమూ, అతనితల్లి రాజుమీద చూపే వాత్సల్యమూ, వెంకట్రావు బావ మూర్తికి రాజుమీద కలిగిన సారస్యమూ, శారద కలుపుగోలుతనమూ, రాజులో ఉన్న సిగ్గునూ, సంకోచాన్నీ శ్రేష్ఠతోసహా పెకలించివేశాయి.

రాజు శారదకు చిన్నన్నయ్య. మూర్తికి చిన్నబావ, ముసలమ్మకు చిన్నబాబు, వెంకట్రావుకు తమ్ముడూను. మరి ఆయింట్లో అతను మొహమాట పడవలసిన విషయమేముంది గనక!

మూర్తి రాజుతో "బావ—బావ" అంటూ అస్తమానం వేళాకోళం ఆడుతూ ఉంటాడు. రాజును విడిచిపెట్టి ఉండడు.

ఆ అడవిలో మూర్తికి ఊబుసుపోకకు చాలావరకు రాజే కారణం. ఇద్దరూ ఎప్పుడూ, ఏవో అర్థంలేని కబుర్లు చెప్పుకుంటూండడం, అప్పుడప్పుడు సాయంత్రం షికారుకు పోతూండడం కూడా అలవాటు అయింది.

శారదకు రాజంటే అన్న వెంకట్రావు మీదున్నంత అభిమానం ఏర్పడింది.

అతని సరళ స్వభావం, స్నేహప్రవర్తన, స్వంత రక్తబంధువులా ఆ కుటుంబంతో పాటు మసలడం, మొదలయిన విషయాల వల్ల, ఆమె హృదయంలో రాజుకుగూడా తన బంధువులతోపాటు, ఓ విశిష్టస్థానం ఏర్పరచగలిగింది.

అప్పటికే రాజు ఆ వూరువచ్చి నెలకు పైగా అయింది. ఈ నెల్లాళ్ళనుండి కష్టమనేమాట ఎరక్కుండా కాలంగడచిపోతూంది. అన్నివిధాలా వెంకట్రావు, అతని తల్లీ చెల్లెలూ, రాజునుకూడా తమవానివలెనే చూస్తూఉన్నారు.

అయినా రాజుకుమాత్రం అలా పరాశ్రయ జీవిలా ఉండడం లోలోపల బాధగానేఉంది. ఆ నెలాఖరున జీతం అందగానే ఏదో డబ్బు యివ్వదలచుకున్నట్లు వెంకటరావుకు చూచాయగా తెలియజేశాడు. వెంకట్రావు కొట్టినంతపనిజేసి తీవ్రంగా మందలించాడు. దాంతో అతని ధైర్యం అమాంతంగా అతనిలోనే అరిపోయింది.

ఆరోజు శెలవుకావడంవల్ల రాజు ప్రక్కఊరుపోయివస్తానని వెంకట్రావుకు చెప్పి వెళ్ళాడు.

ఆరోజంతా మూర్తికి ఏమీతోచలేదు. ఇన్నాళ్ళనుండీ మూలలకు నెట్టబడ్డ బాధ ఆరోజు ఒక్కసారి పెల్లుబికింది. ఈ అడవిలోకి ఎందుకువచ్చానురా అనుకున్నాడు తనలో తను.

కాలుకాలిన పిల్లిలా తచ్చాడాడు ఇల్లంతా. శారద రెండు మూడుసార్లు మెలగా నవ్వుతూ హాస్యంకూడా చేసింది. అంత విసుగుదలలోనూ నవ్వకుండా ఉండలేకపోయ్యాడు. ఆరోజెంతకూ తరిగేటట్టు లేదు మూర్తికి.

మరునాడు ఉదయం బండిలో రాజు రానేవచ్చాడు. రాజు తనతోకూడా వెంకట్రావు తల్లికో తెల్లనిమల్లుపంచె, శారదకు ఓ చక్కని వాయిలు చీర తీసుకొచ్చాడు. అతని జీతంలో చాలా భాగం, తలనూనె,

# ★ చీకటి వెలుగులు ★

సబ్బులు, సెంటు, పౌడరు, స్నో, మొదలయినవాటికే ఖర్చు చేశాడు.

వెంకట్రావు రాజుయొక్క అనురాగానికీ, ప్రవర్తనకు కొంచెం నొచ్చుకున్నాడు. రాజును తియ్యతియ్యగా తిట్టాడు. రాజు కూడా నవ్వుతూనే సమాధానం చెప్పాడు. వెంకట్రావు చూపించే అభిమానానికీ స్నేహానికీ ఇదేం కాదన్నట్లు చల్లని మాటల్లో వ్యక్తపరిచాడు రాజు.

శారద ఆ కోక అందానికి లోలోపలనే మురిసిపోయింది. ముసలమ్మ మల్లుపంచె స్పృశిస్తూ "వెర్రినాయన" అనుకుంది. మూర్తి ఆ పౌడరు సెంటూ మొదలయినవి చూసి నవ్వుతూ "భోగంపిల్లవై పుట్టవలసిందోయ్" అన్నాడు.

మూర్తి మనస్సులో "మంచికుఱ్ఱవాడు" అనుకున్నాడు. శారద హృదయంలో మా రాజన్నయ్య-రాజన్నయ్య-అనుకుంటూ పని లేకపోయినా ఇల్లంతా పదిసార్లు కలయ తిరిగింది. ముసలమ్మ ముఖంమీద బోసినవ్వు ఆటలాడుతూంది మూర్తికి కొండంత బరువు నెత్తినుండి దింపినట్లయింది.

## 2

శ్రీరామనవమి పండుగ దగరకు వచ్చింది. నవమి ఉత్సవాలు ప్రక్కనున్న పట్నంలో చాలా బాగా జరుగుతయని, రాజు మూర్తికి చెప్పాడు. మూర్తికూడా 'అలాగే వెడదాం' అన్నాడు రాజుతో. రాజు మూర్తిని తీసుకు వెళ్ళి ఊరంతా పూర్తిగా చూపిస్తానన్నాడు.

రాజు మూర్తికి ఆ ఉత్సవాల గురించి వర్ణించి చెబుతూంటే, అవన్నీ ఎన్నోసార్లు చూసిన వెంకట్రావుకే మళ్ళీ ఓసారి చూడాలనిపించింది. ప్రక్కను నిల్చుని వింటూన్న శారద తనూ కూడా వస్తానంది.

మూర్తి వద్దన్నాడు. ఆడవాళ్ళతో వెళ్ళడం పిల్లిని చంకపెట్టుకు వెళ్ళడంవంటిదన్నాడు నవ్వుతూ. రాజు కబుర్లు విన్న శారద, మూర్తి వద్దనడంవల్ల, ఓసారి తప్పక చూసితీరాలి అనుకుంది. నిస్సహాయంగా వెంకట్రావువైపు చూసింది. వెంకట్రావు నవ్వుతూ "నువ్వేం తీసుకువెళ్ళక్కర్లేదులే మాతిమ్మడు రాజున్నాడుగా" అన్నాడు మూర్తితో.

రాజుకూడా నవ్వుతూ "ఏమండోయి బావగారూ, మా చెల్లెలు మాకేం బరువుగాదు. మీకేం శ్రమపడక్కరలేదు. ఎలాగయినా యింటి అల్లుడుగదా మీరు. ఆ విషయాలన్నీ నాకొ'న వదిలెయ్యండి" అన్నాడు.

మూర్తి నవ్వుకున్నాడు. శారద సంతోషించింది. రాజు, వెంకట్రావు సంతుష్టి పొందారు.

సరిగా నవమినాడు వేకువనే చేరారు రాజు, మూర్తీ, శారదా పట్నంలో. రాజు వాళ్ళిదరినీ సేవను ప్రక్కనే ఉన్న అయ్యరు హోటలులోకి తీసుకువెళ్ళాడు. ముగ్గురూ, కడుపునిండా టిఫిను సేవించారు.

ఊరంతా అలంకరణలో కలకలలాడుతోంది. ఎక్కడచూసినా, పచ్చనిపందిళ్ళూ తోరణాలూ, బాజాభజంత్రీలూ, పూజలూ. అంత పెద్దపట్నం ఎంతో శోభస్కరంగా విలసిల్లుతోంది. ఇది వాళ్ళ ముగురిలోనూ ఆనందం రేకెత్తించింది.

రాజు మూర్తినీ, శారదనీ వెంటపెట్టుకుని అన్ని వీధులూ త్రిప్పుతున్నాడు. ఒకదాన్ని మించి ఒకటి ఉన్నాయి. మూర్తి, శారదా, ఆ సుందర దృశ్యాలకు మనస్సు అర్పించి చూస్తూ నడుస్తూ ఉన్నారు.

ఏ మూల చూసినా, ఏ దారి చూసినా ప్రజలతో ఊగిసలాడుతోంది పట్టణం అంతా.

రాజు, శారదామూర్తులకు అన్నివింతలూ చూపిస్తున్నాడు. రోజంతా, ఊరంతా తిరిగేశారు. ఖర్చంతా రాజే చేస్తున్నాడు ఎంత చెప్పినా వినకుండా. నయాన్ని భయాన్ని కూడా చెప్పి చూశారు. కాని లాభం లేకపోయింది. ముళ్ళమీద నడుస్తూన్నట్టు బాధపడుతూ ఇద్దరూ అతనివెంట తిరుగుతూన్నారు.

శారదకు ఎందుచేతో ఇంటికి పోవాలనే వాంఛ తీవ్రంగా బాధించటం మొదలుపెట్టింది. సాయంత్రం బండికే ఇంటికి తిరిగి వెళ్ళాలని పట్టుపట్టింది. అసలు చూడవలసిన ఉత్సవాలూ, దృశ్యాలూ, కార్యక్రమాలూ, రాత్రే ఉంటాయి గనుక, ఎలాగా ఇంత దూరం వచ్చాక, ఆరాత్రి కూడా ఉండిపోదామని రాజు పట్టాను. మూర్తికి మనస్సులో ఆ రాత్రి ఉండిపోవాలనిపించినా, ఇదమిత్థమని తేల్చకుండా, నిస్సహాయంగా గుడ్లప్పగించి చూస్తూ నిలబడిపోయాడు.

అటు భార్యంటే ప్రేమా, అనురాగమూ, ఇటు మిత్రుడంటే గౌరవమూ, స్నేహభావమూ, అన్నీ పెనవేసుకుని అతన్ని మాట్లాడలేకుండా బంధించివేశాయి.

నిజానికి శారదకు కూడా, కలకలాడుతూ, తులుకుతూఉన్న ఆపట్టణం విడచి ఆరాత్రికి పోవాలని లేదు కాని ఆ అలజడీ, ఆ జనసమూహపు సందడీ, ఎంత చెప్పినా వినకుండా రాజు చేసే ఖర్చూ, అతను చూపే ఆదరణా, అంతఃకరణా, ఆమె ఎదలో ఏదో తెలీని అశాంతి, ఆవేదనా కలిగిస్తున్నాయి.

ఒక నిముషమయినా ఇక్కడ ఉండొద్దు అనే తీవ్రవాంఛ, ఆమెను నిలవనీయకుండా చేసేసింది. అంచేతనే తెగించి ఆమె రాజుకు నిష్కర్షగా చెప్పేసింది: తనింక ఉండలేననీ ఆ మనుష్యుల గుంపులో తిరగలేననీను. ఏమయినా సరె వెంటనే వెనుతిరిగి వెళ్ళాలని కచ్చితంగా తేల్చేసింది.

ఆమె మొండిపట్టుకి ఆమే వింతపడింది. మూర్తి ముఖంలో విషాదచ్ఛాయలు స్ఫురిస్తున్నాయి. రాజు ఉత్సాహంఅంతా హరించిపోయింది. ముఖం వెలవెలబోయింది. చకచకా మాట్లాడుతూ, ఆనందం ఉట్టిపడుతూ వచ్చేవాడల్లా నిస్పృహుడయ్యాడు. కొంతసేపట్లో తేరుకున్నాడు.

రాజు సేవనుకు దారితీశాడు. ముగ్గురూ నిశ్శబ్దంగా నడుస్తున్నారు. గాలి దుమారం

లేచి, నల్లని మబ్బు దట్టంగా క్రమ్మి, ఉరుములూ, మెరుపులతో పెద్ద వాన కురిసి చటుక్కున ఆగిపోయి, తెల్లమబ్బు క్రమ్మి చలగా ఉన్న ప్రకృతిలా ఉన్నారు వాళ్ళు ముగురూను.

వాళ్ళు ముగ్గురూ స్టేషనులో అడుగు పెట్టారు వాళ్ళు వెళ్ళవలసిన బండీ దారి తీసింది.

ముగురూ నిష్ప్రభాంతో నిలబడ్డారు. వెయిటింగు హాల్లోకిపోయి కుర్చీల్లో చతికిలబడ్డారు నీరసంగా. నిశ్శబ్దంగా ఉన్నారు. ఇంతసేపూ ఏదోవిధంగా కల్పించి మాట్లాడే రాజుకు కూడా మాట్లాడవలసిన విషయాలు తట్టడం లేదు.

ఈ నిశ్శబ్దతకూ, నిరుత్సాహానికీ శారద మంకుపట్టే నేమో కారణం అనుకున్నాడు మూర్తి మనస్సులో. విషాదంతో చిన్నబుచ్చుకున్న ముఖం వేలాడేసుకుని మూల కుర్చీలో ముడుచుకు కూర్చున్న రాజును చూసి శారద తనలో తను చాలా నొచ్చుకుంది.

రాజు కొంచెం కాలం గతించాక లేచి అవతలకువెళ్లి రెండు మూడు నిమిషాల్లో తిరిగి వచ్చాడు. లోపల విద్యుద్దీపాలు వెలిగాయి. తెలీకుండానే పగటి తెలుపుపోయి, రాత్రి నలుపు అలుముకుంది బైట. దూరాన్నుండి దీపాలు మెరుస్తూ ఆ చీకటిని చీలుస్తున్నాయి.

అలా మాటాడకుండా ఊరుకోడం రాజుకు ఏమీ సబబుగా తోచలేదు. మళ్ళీ చాలా సేపటివరకు ఏ బండీ లేదనీ, వాళ్లు వెళ్ళవలసిన బండి వచ్చేసరికి రాత్రి ఒంటిగంట కావచ్చుననీ చెప్పాడు.

మళ్ళీ ఓ సారి పూరు చూసివస్తే బావుంటుందేమోనన్న అభిప్రాయం వెలిబుచ్చాడు మూర్తి. కాని శారద వద్దంది.

రాజు పడక కుర్చీలో కూర్చుని కాలు ఆడిస్తూ కన్ను మూశాడు శారద మూల మంచంమీద వాలింది. మూర్తికూడా ఓ కుర్చీలో వాగిలపడ్డాడు.

రాజు గుర్రు పెడుతున్నాడు. మూర్తికి నిద్రపట్టలేదు. లేచి, లైటు ఆర్పి మళ్లీ కుర్చీలో జారగిలపడ్డాడు. చాలా ఉక్కగా ఉంది. నిద్రపట్టే సూచనలేమీ తనలో కనపడలేదు.

మెల్లగా, చప్పుడు కాకుండా లేచివెళ్ళి ప్లాటుఫారంమీద పచారు చేస్తున్నాడు మూర్తి. అరగంట కాలం గడిచింది. కాళ్ళు పీకడం మొదలెట్టాయి. దూరాన మోటార్లు ఇటూ అటూ వెడుతున్న శబ్దం నీరసంగా వినబడుతోంది

ప్లాటుఫారంమీద కూలీలు, ఏవో పెట్టెలు సామానులు చిన్న తోపుడు బండిమీద వేసుకుని, మోటు మాటలు మాట్లాడుకుంటూ, నవ్వుతూ నడుస్తున్నారు. మూర్తి మళ్ళీ లోపలికివెళ్ళి, పడకకుర్చీ బయటకు తెచ్చుకుని, ఏవో అవ్యక్తపు ఆలోచనలు మెదడులో ఉరకలు పెడుతూంటే స్తబ్దంగా పడుకున్నాడు.

ఉండుండి చలనిగాలి మెల్లగా వేసోంది. మూర్తికి ఎప్పుడు ఎలా నిద్రపట్టిందో తెలీదు. హఠాత్తుగామాత్రం మెలకువ వచ్చింది.

చెవులు గింగిర్లు పెట్టేంతధ్వనితో కీచుమనే కేక ఆ వెయిటింగు రూములోనుండి వచ్చింది. మూర్తి లోనికి వెళాడు. రాజు లైటు వెలిగించాడు. కూలీలు, హమాలులు, సిబ్బంది ఉద్యోగవర్గం అక్కడ ఉన్నట్టే ప్రత్యక్షమయ్యారు.

శారద అచేతనంగా, ముద్దలా పడిఉంది. శరీరం బిగుసుకుపోయి చల్లగాఉంది కంపిస్తూ. ఆమె బట్టలూ, శరీరమూ చెమటతో తడిసి ముద్దలలాయి ముఖమంతా కళావిహీనమయి, ఏదో జబ్బుపడినట్లు, నీరసంగా అలసినటుంది.

మూర్తి నిశ్చేష్టుడయి, తలమీద దెబ్బ తిన్నవాడిలా నిలబడి ఉన్నాడు. అతను ఏం చెయ్యాలో, చెందాలో ఆలోచించకుండా నిలబడ్డాడు.

రాజుమాత్రం అక్కడున్న కూలీలలో ఒకణ్ణి ఓ చెంబుతో నీళ్ళు తెమ్మని పురమాయించాడు. వాడు నీళ్లు తేగానే శారద ముఖముమీద నీళ్లు చిలికి జేబురుమాలుతో తుడుస్తూ, పేపరుతో విసరడం మొదలెట్టాడు. అంతా నిశ్శబ్దంగా ఉన్నారు. మూర్తి వెర్రివాడిలా రెప్ప వాల్చకుండా శారద ముఖములోకి చూస్తూన్నాడు. అతన్ని భయం ఆవరించింది.

శారద కళ్ళువిప్పి వెర్రిగా మూర్తివేపు చూసింది. చుట్టూ చూసి రాజువైపు చూసింది. మూర్తి ఆమె ముఖముమీదికి వంగేడు. రాజు నీళ్ళతో విసురుతున్నాడు. ఆమె మళ్లీ నీరసంగా, నెమ్మదిగా మూలిగి కొయ్యబారింది.

రాజు అక్కడున్న వాళ్లందరినీ కొంచెం సేపు అవతలకుపొమ్మని బ్రతిమలాడాడు. అంతా అవతలకు తప్పుకున్నారు. మామూలుగా రాజు పరిచర్యలు చేస్తున్నాడు మూర్తి వెర్రిగా చూస్తూ నిలబడేఉన్నాడు.

శారద మళ్లీ కళ్ళు తెరచింది. కాసిని మంచినీళ్ళు ఇమ్మని తాగింది. మూర్తి చేయూత తీసుకుని, లేచికూర్చుని బట్టలు సర్దుకుంది అలా వణుకుతూనే ఉంది. మూర్తి సంగతేమిటని అడుగుదా మనుకున్నాడు. కాని ఆమె పరిస్థితిచూసి అలాంటి ప్రశ్నలేమీ వెయ్యకూడదని నిర్ధారణ కొచ్చాడు. రాజు ఆందోళనగా, ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డాడు.

అన్నగారిఊరు వెళ్లకుండా తిన్నగా వాళ్లింటికి పోదామంటూ ప్రాధేయపూర్వకంగా చెప్పింది శారద మూర్తితో. రాజు మాట్లాడలేదు. మూర్తి ఆశ్చర్యచకితు



పెండ్లి అయిన వెంటనే అతను భార్యను ప్రశ్నించాడు. "ఎవరు ఆ పిచ్చివాడు? మా నాన్నగారు నాకు ఇచ్చిన పది వేల రూపాయిల చెక్కును అటూ ఇటూ చూసి అదేపనిగా నవ్వుతున్నాడు?"

"మా నాన్నగారికి ఎకౌంటువున్న బ్యాంకి మేనేజరు."

## చీకటి వెలుగులు

దయ్యాడు. కాని శారద మరీ అదేమాటంది. మనిషి గజ గజ వణికిపోతూంది. మతి భ్రమణం కలిగినదానిలా చూస్తోంది కళ్లంట నీరు గారుతూ.

మూర్తికి ఏదీ తెలియడం లేదు. ఏం చెయ్యాలో బోధ పడడంలేదు. కళ్లంట నీళ్లు తిరుగుతున్నాయి. హృదయం కరుణార్ద్రమయింది. తనకు తెలీకుండానే అలాగే పోదాం అన్నాడు. ఆ వాగ్దానంలో ఆమె కొత్త కుదుటపడట్లు కనిపించింది. కాని అగది అన్నివైపులా బిత్తరిచూపులు చూస్తూనేవుంది. కళ్లంట నీరు కారుతూ మూర్తి కళ్లలోకి రెప్పవాల్చకుండా అప్పుడప్పుడు చూస్తోంది.

రాజామాత్రం మౌనంగా, నిశ్చలంగా నిలబడాడు కొండలాగ. డబ్బు తీసి వాళ్లూరుకి టిక్కెట్లు కొనమని మూర్తి రాజాకి ఇచ్చాడు. రాజా ససేమిరా ఒప్పుకోలేదు. ఆ రెండు టిక్కెట్లు కూడా తన డబ్బుతోనే కొని తీసుకువచ్చాడు.

బండి వచ్చింది. మూర్తీ శారదా ఎక్కారు. పెట్టెలో మరెవ్వరూ లేరు. గంట కొట్టాగా బండి కదిలింది.

ప్లాటుఫారంమీద రాజా ఘనీభవించిన విచారంలా నిలబడ్డాడు. ప్రక్కనున్న ఇళ్లూ దీపాలూ మరుగవుతున్నాయి. రాజా స్టేషనూ మాయమయ్యారు.

రైలు పెట్టెలో లైటు గుడ్డిగా వెలుగుతోంది. శారద కళ్లవెంట నీళ్లు కారుతూనే ఉన్నాయి. మూర్తి ఆందోళనతో, జాలితో ప్రేమతో, ఆమెను దగ్గరగా తీసుకున్నాడు.

ఆమె శరీరం చల్లగా వణుకుతూంది గాలికి ఊగే ఆకులాగ. అతను ఏమి మాట్లాడాలో తెలియలేదో, లేక మాట్లాడలేకుండా ఉన్నాడో అర్థంకావడంలేదు.

ఆమె హృదయంలో రామరావణయుద్ధం జరుగుతోంది. ఏవో మాటలు బయటపెడదామన్నటు ఆమె పెదవులలో ఘర్షణ పడుతున్నాయి. పెదవులు కదులుతున్నాయి. కన్నీరు కుళాయినుండి కారే నీరులాగ కారుతోంది ఆమె అతని ముఖములోకి దీనంగా, చూస్తూ, "క్షమించరూ" అంది ఆ గుడ్డిదీపానికి వినపడుతుందేమో అన్నంత మెల్లిగా రహస్యంగా. అతని చేతులు ఆప్యాయంగా, మృదువుగా, ఆమెతలని నిమురుతున్నాయి. ఆమె ఏవో ఇంకా ఏవేవో మాటలు చెప్పబోతూంది.

ఇంతలో ముత్యాలా మెరుస్తూ రెండు వెచ్చటి కన్నీటిచుక్కలు ఆమె కంఠంమీద రాలాయి. ఆ అశ్రుకణాల్ని పెనవేసుకుని "క్షమించేను" అనే స్వరాలు ఆ నిశ్శబ్ద తంత్రులమీద మ్రోగాయి—ఆమె మరి మాట్లాడలేదు. అతని ఒడిలోకి ఒరిగింది. ★

# ఒకే ఉదయం

ప్రకాశం నెమ్మదిగా నడుచుకుంటూవచ్చి ఇంట్లోకి ప్రవేశించాడు నక్షత్రాలయితే అస్తమించాయిగాని ఇంకా తెల్లవారలేదు. దూరంగా రాబందులు అప్పుడే నిద్దరలేచి ఉత్సాహంగా అరుస్తున్నాయి. గాలి దిక్కుతోచనట్లు బరువుగా వీస్తోంది.

ప్రకాశం ఒక్కొక్క మెట్టే ఎక్కి మేడపైకి చేరుకున్నాడు. అతనికి మెదడు నిండా ఏదో బరువైన వస్తువు - చీకటి లాంటిది—నిండినట్లుంది. అతని బాల్య స్నేహితుడు శంకరం ఒకగంట క్రితమే చచ్చిపోయాడు. ప్రకాశం ఇప్పుడు తిరిగి వస్తున్నది ఆ శంకరం ఇంటిదగ్గర్నుంచే.

ప్రకాశానికి ఆ విచారంతో మేలుకుని ఉండడం ఇష్టంలేదు. ఈ మేడమీంచి చూస్తే శంకరం ఇంటివాకిలి కనిపిస్తుంది. అక్కడ వాళ్ళు శంకరాన్ని ఆఖరి ప్రయాణానికి సిద్ధంచేస్తున్నారు. 'శంకరం చచ్చిపోయాడు' అనుకున్నాడు ప్రకాశం.

శంకరానికి నలభై ఐదేళ్లు. తనకన్న రెండేళ్ళే పెద్ద. శంకరం చచ్చిపోయాడు—తన చేతుల్లోనే. తన ప్రాణస్నేహితుడు! రాత్రి రెండుగంటలకి తనకి కబురొచ్చింది శంకరానికి ప్రమాదంగా ఉందని. ఆ చీకట్లో శంకరం కొడుకు దీపం చూపిస్తుండగా నడుస్తుంటే తను రెండుసార్లు తూలి ముందుకు పడబోయాడు. కాళ్ళు వణుకుతున్నాయి. అడుగుపడవలసినచోట పడటంలేదు......తరవాత ఆ దృశ్యం అంతా ఒక్కసారి అతనికి గుర్తొచ్చింది. అతను తట్టుకోలేక పోయాడు. "నేనిప్పుడు ఆలోచించలేను. నాశక్తికి మించినపని" అనుకుని నిద్రపోవాలని మంచంమీద పడుకున్నాడు తనకిప్పుడు నిద్రకావాలి. నిద్ర. నిద్రపోవాలి.

కళ్లుమూసుకున్నాడు. శంకరం చచ్చిపోయాడు. టైఫాయిడ్. రెండుసార్లు తిరగబెట్టింది. ఇంక నెమ్మదిస్తుందనుకున్నారు. నిన్ననేగా తనువెళ్ళి శంకరంతో మాటాడతా! శంకరం ఎంతహుషారుగా మాట్లాడాడు! నలభైరోజులు అలా పడుకుని ఉండడం. వాడికి విసుగెత్తి పోయిందిట. "జ్వరం కాస్త తగ్గగానే రిక్షాలో ఊరంతా తిరిగేస్తా. డాక్టర్ వీల్లేదన్నాసరే ఊరు చూడక పిచ్చెత్తి పోతోందిరా" అన్నాడు శంకరం.

శంకరం పెద్దవాళ్ళలో కలిసిపోయాడు. చచ్చిపోడం ఎంతసులభం...అతను నెమ్మదిగా లేచి కూర్చున్నాడు. గదినిండా నీడలు. రాత్రి తగ్గించి ఉంచిన కొడిగుడ్డు దీపం పాలిపోయినట్లుంది. ప్రక్కనే మంచంమీద ఉష నిద్రపోతోంది. ఉషకి

## "జ్యేష్ఠ"

ముప్పైఎనిమిదివెళ్ళి ముప్ఫైతొమ్మిది వస్తుంది వచ్చేనెలలో. ఉష నిద్దరోతోంది. డాబామీద తమపిల్లలు నిద్దరోతున్నారు. పెద్దవాడికి పందొమ్మిదేళ్ళు నిండుతాయి. రెండునెల్లో......తనకి నలభైమూడేళ్లు. తను పెద్దవాడై పోతున్నాడు.

అతనికి గుండె ఝల్లుమంది. తరవాత గుండె దడదడా కొట్టుకుంది. భయం. శంకరాన్ని మోసేస్తున్నారు కాబోలు—బాజా మోగుతోంది.

చావంటే ఎందుకు భయపడాలి? అతనికి జవాబు దొరకలేదు. తను కాలేజీ కుర్రాళ్ళకి "షేక్‌స్పియర్" నాటకాలు అర్థం చేసుకోడం నేర్పుతాడు. వాటిలో చావు బోలెడు చోట కనిపిస్తుంది. ఒక్క చావైనా లేని ఇంగ్లీషు నవలలు తను చదివిన గుర్తు లేదు. ఒకటైనా చావు కబురు లేని వార్తా పత్రిక తను చూడలేదు. తను అప్పుడు చావంటే భయపడ్డాడా? లేదు. బొత్తిగా భయపడ

#  ఒక ఉదయం 

లేదు. ఇప్పుడెందుకింత భయం? శంకరాన్ని తీసుకుపోతున్నారు. వాడి కుటుంబం మళ్ళీ ఒక్కసారి గొల్లుమంది. శంకరానికి ఇప్పుడు ఎవరెంత గట్టిగా ఏడిచినా వినపడదు. శంకరం చచ్చిపోగానే తనలో పెద్ద కుదుపు కలిగింది. శంకరం కొయ్యబారి పోగానే తనకి అక్కణ్ణించి పరుగెత్తుకుని ఒచ్చేయాలనిపించింది. ఆ శవాన్ని చూస్తుంటే ఒక నిముషం క్రితం దాని పేరు "శంకరం" అని నమ్మబుద్ధి కాలేదు. తనకి ఆ జరుగుతున్నది నిజంలా తోచలేదు......

ఉష లేచి కూర్చుంది. అతన్ని చూసి నిశ్శబ్దంగా నవ్వి ఆవలించింది అతనిలో ఏం చలనం కలగలేదు. మామూలుగా ఉన్నటయితే అతను ఆ చిన్ననోరు ఆవులింతలో పువ్వులా విచ్చుకోడం చూస్తూ ఒళ్ళు మరిచేవాడు. చావు బాజాలు దూరంగా వినిపిస్తున్నాయి. వలకొళ్ళు ఈ ఊరికి ఉత్తరంగా ఉన్నాయి. తనూ శంకరం చిన్నప్పుడు అక్కడున్న పెద్ద వేపచెట్టెక్కి దొంగతనంగా బీడీలు కాల్చేరు ఓసారి. అది ఎవరో చూసి పెద్దవాళ్లతో చెపితే... ఇప్పుడు తను పూడ్చిపెట్టే చోటుకి వాళ్లతో వెళ్లవలసింది. కాని, కాలు కదలందే. ఎక్కడేనా తూలిపడితే! తనూ పెద్దవాడై పోతున్నాడు.

అతనికి భయం వేసింది.

ఉషని చూస్తూ 'మనం పెద్దవాళ్ళమవుతున్నాం' అన్నాడు. పుట్టెడు దిగులు ఆ మాటల రూపంలో వెళ్ళిపోయింది. ఇంక తొంభైతొమ్మిది పుటు మాత్రం అతని నెత్తి మీద ఉంది. ఉష విని ఊరుకుంది. ఏం మాట్లాడలేదు. అర్థం కానట్లు చూసింది.

అది అతనికి నచ్చలేదు. స్నేహితుడు చచ్చిపోయి అంత దుఃఖంలో తనుంటే ఏం పట్టించుకోకుండా కూర్చుంది ఉష. ఉష మళ్ళీ ఆవులించింది. ఉష నోరు విచ్చిన దానిమ్మ పండులా ఉంది. అది అతనికి నచ్చలేదు. ఉక్రోషం వచ్చింది. "ఉషా. శంకరం పోయాడు - తెలుసా?" నిష్ఠూరంగా మాట్లాడేడు.

ఉష తల ఆడించింది. ఆలోచిస్తూ "ఏడుపులు వినిపించాయి. ఏం చూడను? నా ఆరోగ్యం కూడా ఏం బాగాలేదు. ఎప్పుడు ఏదో మగతగా ఉంటోంది..." అన్నది.

ప్రకాశం వింటున్నాడు, 'నేను పెద్దవాణ్ణై పోతున్నాను' అనుకుంటూ. చచ్చిపోడం... టేబిల్ మీద అద్దంతీసి పరీక్షగా తన మొహం చూసుకున్నాడు. కొద్దిగా గడ్డం మొలిచింది. కళ్లకింద గీతలు జాగ్రత్తగా చూస్తే కనిపిస్తాయి. తలలో అక్కడా అక్కడా ఒక తెల్లవెంట్రుక. అదంలోకి చూస్తూనే, "అదికాదు ఉషా. శంకరం చచ్చిపోయాడు" అన్నాడు. ఎందుకు అలా అన్నాడో అతనికి తెలీదు.

ఉష ఒకసారి గది అంతటా చూసింది. డాబామీద మంచాలమీద పిల్లలు నిద్రపోతున్నారు. నెమ్మదిగా "నాకు మళ్లీ నెలతప్పింది" అన్నది.

ప్రకాశం ఉలికిపడ్డాడు. ఒక్కసారిగా ఇంటి కప్పుకేసి చూస్తూ తీవ్రంగా ఏదో ఆలోచించడం మొదలు పెట్టాడు.

...నిజంగా? నిజంగా! నిజం. తన ఇంట్లో మరోపాప. తన ఇంట్లోంచి మరో ప్రాణం.

అతను మళ్లీ తలదించి ఉష మొహంలోకి చూసేసరికి ఇరవై సెకన్లు పట్టింది. అతని మొహంనిండా వెలుగు పులుముకున్నట్లుంది. అతని కళ్లలోంచి పొంగుతున్న సంతోషం బుగ్గలమీద కాలవలు కట్టింది. అతను ఇకిలిస్తున్నాడు. అది కాలేజీ కుర్రాడి నవ్వు! ఇరవై సెకండ్లలో ఎంతమార్పు! ఒక స్విచ్ ఆఫ్ చేసి మరోవాటి ఆన్ చేసినట్టే!

అతను తన మంచంమీంచి లేచివచ్చి ఉష మంచంమీద ఆమె పక్కనే కూర్చున్నాడు. ఉష ఎడం అరచేతిని తన రెండు చేతుల్లోకి కప్పేశాడు. ఉష ముంజేతిమీద ఇందుపగింజంత పుట్టుమచ్చ ఉంది. ఆ తేనెరంగు చేతిమీద పట్టుకుడ్డలా మెరుస్తుందది. ఉష లేచి నిలుచుంది. కొద్దిగా కోప్పడింది. "ఊ వదలండి మరీ చిన్నపిల్లలై పోతున్నారు" అంది. ప్రకాశం "ఏయ్ 'పిల్లా' వెళ్తే వెళ్లావు కాని ఆ జెడ ముందుకు వేసుకుని మరీ వెళ్లు" అన్నాడు ఉష మెట్లు దిగుతుంటే.

"ఏయ్ పిల్లా!" అతని నవ్వు పొంగి వచ్చింది. "మరీ చిన్నవాణ్ణై పోతున్నాను. ఊహుహు" అని నవ్వేశాడు. ఆ నవ్వు నిద్దట్లో విని పిల్లలందరూ లేచికూర్చున్నారు. ★



మేష్టారు: "రామూ నీలాగు ఎడమ జేబులో పదిరూపాయిలు, కుడిజేబులో ఏడు రూపాయలు వున్నాయి. అప్పుడు ఏమాతుంది?"

రాము: "లాగు నాదిమాత్రం ఎప్పుడూ కాదండి"



కొండముది హనుమంతరావు

(గతసంచిక తరువాయి)

మహా శ్రద్ధగా మూడు రూపాయలు చెల్లించి రెండు రిజర్వుడు టిక్కెట్లు కొనుక్కొని వస్తున్న మావారి మొహం ఈ కుటుంబాన్ని చూసేసరికి తెలతెలబోయింది. గుటకలు మింగుతూ "నమస్కారమండీ!" అని చేతులు జోడించారు మావారు ఆ బట్టతలాయనకు.

ఎవరో యీ దైవ సమానుడని నేను ఆలోచిస్తున్నాను—ఆఫీసు సూపరింటెండెంటును [illegible] అంటే అయ్యన్నపలు 'శర్' [illegible] చెప్తుంటారీయన. సూపరింటెండెంటుగారేమో స్కూల్ ఫైనలేనుట [illegible]. మావారేమో ఎంతచెడ్డా (చెడ్డట్లు సెకెండుగా కాదనుకోండి. థర్డ్ క్లాసులో పాసవటం) [illegible]! నిజం చెప్పొద్దూ ఇంగ్లీషుమాటకు తడుముకోకుండా మాట్లాడుతారు. వ్రాయటంకూడా మంచి భాషే వ్రాస్తామంటారు. అదెంత [illegible] (అంగం తెలిసిన) భగవంతుడికే తెలియాలి! సూపరింటెండెంటు పెద్దవాళ్లతో ఇంగ్లీషులో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపాలంటే మావార్ని పిలుస్తుంటారుట. ఇలా చాలా ఉన్నాయి కారణాలు.

పోనీ చిన్నప్పటి గురువుగారేమోనంటే—గురువును దైవ సమానంగా చూడవలెనని సుమతీ శతకంలో చదువుకున్నానేమోగాని ఆచరణలో కాదు సరిగదా అంతర్యంలో కయినా అలాంటి సద్భావం ఉన్నట్లు నేనెప్పుడూ ఎరుగను.

మావార్ని చూసి బట్టతలాయన కోటు జేబులు గాభరాగా తడుముకోసాగారు.

"పర్సు తేవటం మర్చిపోయినట్లున్నానే!"

"ఇంత మతిమరుపేమండీ! మీతో చచ్చిపోతున్నాను నేను. ఇప్పుడెలా? అసలు తెచ్చారా? లేకపోతే దోవలో ఏమయినా పారేసుకున్నారా?"

ఆ ఉత్తమ ఇల్లాలి మాటమీద నమ్మకం నిండుగా ఉందో ఏమో ఆ మానవుడు నేలమీద వెదకటం మొదలుపెట్టాడు.

"రిక్షా ఎక్కేటప్పుడు నాన్నగారిదగ్గర నుంచి నువ్వు తీసుకుంటివి గదుటే అమ్మా!" పెద్దపిల్లవాడు గుర్తుచేశాడు.

"అయ్యో! నా మతి మండ! నిజమే సుమండోయ్. ఇదిగో పర్సు!" అంటూ ఆమె బొడ్లోనుంచి పర్సుతీసి, లెక్కపెట్టి ఆరు రూపాయి కాగితాలు మావారికిచ్చి, "నాలుగు రిజర్వుడు తెచ్చిపెట్టు భాస్కరం" అన్నది.

"అలాగే!" అని వారు బుకింగ్ ఆఫీసు దగ్గరకు పోయారు.

చిన్నపిల్లలిద్దరూ గేటులోకూడా ట్రయిలరు చూస్తున్నారు. పెద్దపిల్లలిద్దరూ గోడల కంటించిన పోస్టర్లు కళ్ళు పెద్దవిచేసుకుని చూస్తూ వాటిమీద వ్రాసివున్న అక్షరాలు చదువుతున్నారు.

"అమ్మాయ్! మీ ఇద్దరేవచ్చారు. పిల్లలు లేరా?" అని ప్రశ్నించింది స్థూలకాయురాలు.

బట్టతలాయన నా రెండు జడలూ, స్లిప్పరూ మార్చి మార్చి చూస్తున్నవాడు కాస్తా భార్యమాటలకు సన్నగా నవ్వి—"ఎవరనుకుంటున్నావా అమ్మాయి?" అని మాటిగా ప్రశ్నించాడు.

"భాస్కరం భార్యకదూ? ఆ మాత్రం నేను గ్రహించలే ననుకున్నావేమిటి!"

"బాగుంది నీతెలివి. భాస్కరం చెల్లెలి అమ్మాయి. భార్యను పురిటికి పుట్టింటికి పంపించాలని కదూ మొన్న సాయంత్రం ఒకగంట ముందుగానే ఆఫీసునుంచి పోయాడు—" 'దైవసమానుడు' ఆఫీసరు అని గ్రహించగల్గాను.

మొదట నేనూ అదే అనుకున్నానులెండి. ఆ ముక్కూ మొహం అచ్చగా భాస్కరంతీరే! అయినా [illegible] మేనమామ [illegible] తేమో, పోలికలున్నాయి అని అభిప్రాయ పడ్డాను..."

మావారి అబద్ధానికి, ఆ అబద్ధాన్ని కప్పిన ఆఫీసరుగారు భార్య తెలివిని అంచనా వేసి కట్టిన విలువకూ. [illegible] ఒక చదువుకున్న అమ్మాయి (అనికాదు—కట్టుకున్న భార్యముందు అని మావారు అంటారు) ముందు తనని కుర్చి తెలివితక్కువ వాడన్న క్రింద కట్టటంతో ఆ ఇల్లాలి మొహం మార్చుకున్న రంగులకూ, తనబండారం ఎక్కడ బయటపడుతుందో నన్న భయంతో టిక్కెట్లు కొనుక్కొని వస్తూ మావారు చూస్తున్న విచిత్ర చూపులకూ—నాలుగు విధాల నాకు పెద్ద నవ్వువచ్చింది. నవ్వు నాలుగంధాల [illegible] పెద్దలు—అనుకుని సాధ్యమైనంతవరకు వస్తున్న నవ్వును మింగ ప్రయత్నించి విఫలురాలనై జేబుగుడ్డ నోటికడ్డు పెట్టుకున్నాను.

"పొరపాటులే అమ్మాయ్! తెలియక అనుకున్నాను భాస్కరం భార్యవని"—స్థూలకాయురాలు తను అన్న నిజానికి నొచ్చుకుంది.

ఎవరు పొరపడ్డారో చెప్తామంటే కథ అడ్డం తిరిగేట్టుంది—మావారి అబద్ధం పునాదుల్తో సహా కూలిపోతుందాయెను మరి!

"పేరేమిటన్నావ్?"

చెప్పాను.

"ఏ ఊరిచ్చారు?"

"గుంటూరు" నోటికొచ్చిన పేరు చెప్పాను.

మావారు నోరు తెరుచుకు చూస్తున్నారు. నన్ను గుంటూరిచ్చుట మేమిటో వారి కర్థంకావటం లేదు.

"ఎవరిసంగతి [illegible]?" అని మావారు నన్ను ప్రశ్నించారు.

"వాళ్ళత్త వారి విషయం చెప్తున్నదిలే" అని వారి ప్రశ్న కామె సమాధానం చెప్పి "ఏం చేసుంటాడు మీ ఆయన?" అని నన్ను ప్రశ్నించింది. నాకేం చెప్పాలో తోచలేదు.

"నేనేం చేసేది మీకు తెలియటంలా?" అని అనుకున్నారు మావారు ఆమె ఏ ఉద్దేశంతో ప్రశ్నించిందో అర్థంకాని పరిస్థితిలో.

"నీవిషయం కాదమ్మాయ్ మీ బావమరది విషయం నేనడిగేది!"

"మా బావమరది విషయమయితే దాన్ని మీ ఆయనేం చేస్తుంటా డంటారేం?"

"మీ బావమరిది మీ చెల్లెలికి మొగుడా



డోయ్-భర్తగారు" అని ఆఫీసరు మధ్యలో కలుగజేసుకున్నాడు.

మావారి పరిస్థితి చూస్తుంటే నాకు ఎక్కడలేని జాలి కలుగుతున్నది. నావంక అర్థరహితంగా చూస్తున్నారు. తనకే మయినా మతి చెడిందా, లేక ఎదటఉన్న వాళ్ళకేమయినా మతి పోయిందా అన్న సందిగ్ధావస్థలో పడ్డారాయన.

"కాలేజీలో లెక్చరరు"

"పేరేమిటీ?" ఆసక్తితో ప్రశ్నించాడు ఆఫీసరు.

ఏంపేరు చెప్దామా అని ఆలోచిస్తున్నాను. మా వారి పేరు భాస్కరరావు కాబట్టే, తత్సంబంధమయిన నామమే చెప్పాలని నా ఉద్దేశం. ఏదో నానోట కొచ్చిన పేరో, నాకు నచ్చినపేరో చెప్తే ఆయన బాధపడవచ్చు. ఆయన బాధమాట అలా ఉంచి చెటంత (మీకు చెప్పలేదు కాబోలింకా-మావారు మంచి పొడుగు, పొడుగుకు తగ్గలావూ; అందులోనూ ఈ రోజు ధోవతికూడా కట్టుకున్నారో ఏమో-ఏమో ఏమిటా కలుకున్నట్లు ప్రత్యక్షంగా కన్పిస్తుంటే-ఒడూ, పొడుగూ కొట్టవచ్చినట్టు కన్పిస్తున్నయ్) మొగుడ్ని ముందు పెట్టుకుని ఎవరిపేరో నేనెలా చెప్పేది మీరే చెప్పండి. సూర్యనారాయణ భానుమూర్తి, రవి...పర్యాయపదాలు ఒక్కటొక్కటే గుర్తుకు తెచ్చుకుంటున్నాను.

"మీది మరీ విచిత్రమండి ఎంత చదువుకున్నమ్మాయయితే మాత్రం మొగుడిపేరు చెప్తుందా?" అన్నది ఆమె ముడుతలుపడ్డ ఆమె మోహంమీద స్త్రీ సహజమయిన లజ్జారేఖలు లాస్యం చేసినయ్.

ఇంకా నయం—తొందరపడి చెప్పాను కాదు. ఆలస్యం అమృతం విషమంటారు కాని, ఒకొక్కప్పుడు ఆలస్యం అత్యంత సహకారిగా ఉంటుంటుంది. పేరు కనుక నేను చెప్పేఉంటేనా నన్ను సిగ్గూ-శరమూ విడిచిపెట్టిన దానిక్రింద లెఖ్ఖ కట్టేసేది ఆ ఇల్లాలు.

"ప్రభాకర రావండి" అన్నారు మా వారు-అసలు పరిస్థితి ఇప్పటికి అర్థమయింది కాబోలు.

"ఫిజిక్స్ లెక్చరర్ ప్రభాకరరావేనా?" ఆశ్చర్యపడుతూ ప్రశ్నించాడు ఆఫీసరు.

"ఆ!"-పాత్రకు న్యాయం కూర్చుతూ నే ఉన్నాగదూ?-అన్నట్లు నా వంక చూశారు.

"ఇన్నాళ్ళు నుంచి చెప్పావు కాదేమి టోయ్—ప్రభాకరరావు మీ బావమరదని. వాళ్ళ నాయనా, నేనూ బాల్యస్నేహితులం. పెళ్ళికి శుభలేఖ కూడా వచ్చింది. కాని పోలేకపోయాను."

ప్రభాకరరావంటే రెండేళ్ళ క్రితం-మనం విశాఖపట్నంలో ఉన్నప్పుడు—ఏదో

## ★ శ్రీవారితో సినిమాకు ★

ఇంటర్వ్యూ ఉందని మనింటికి వచ్చాడూ- అతడేనా?"

"ఊ. అతడే. రెండురోజు లుండవోయ్ అంటే మా నాన్నగారి వంట్లో బాగాలేదని వెంటనే వెళిపోయాడు."

చాలా మంచి పిల్లవాడు. బుద్ధిమంతుడు. అందానికి అందం, చదువూ ఆస్థి. అనువైన సంబంధం. ఈడూ జోడూ చాలాబాగుంది"

కథ ఇంతదాకా వస్తుందనుకోనని నేను తెల్ల మొహం వేసుకుని నిల్చున్నాను.

"పదండి. సినిమా మొదలెట్టారు" అన్నాడు ఆఫీసరు.

బ్రతుకు జీవుడా! అనుకుంటూ హాల్లోకి పోయి కూర్చున్నాం. మధ్యలో పిల్లలు కూర్చున్నారు—ఆ పక్కన ఆఫీసరు, మా వారూ, ఈ పక్కన ఆఫీసరు భార్య, నేనూ.

"సినిమా ఏమీ బాగాలేదు. నా మనసెంత సేపటికీ సినిమామీద నిలవక ఇందాకటి నుంచీ జరిగిన విషయాలచుట్టూ పరిభ్రమిస్తున్నది. తలుచుకున్న కొద్దీ నవ్వొస్తున్నది.

ఆఫీసరుతో పెళ్ళాన్ని పురిటికి పుట్టింటికి పంపించాలని చెప్పారా? అబద్ధమాడితే గోడ కట్టినట్లుండాలి అంటారు. మరి ఏమిటీ వీరు? నాలుగురోజులు పోయిన తర్వాత "ఏమోయ్! భాస్కరం మీఆవిడకన్నదా?" అంటే ఈయనేం చెపుతారు. ఇంకా లేదంటారు పోనీ మొదటిసారి. అలా ఎన్నాళ్ళు 'ఇంకా లేదు' అని చెప్తూ ఉంటారు? ఇంత తెలివితక్కువవారేం?

ఇంకా పైగా నాతో నేమో డాబులు చెప్పారు.

అమ్మ మెయిల్లో వస్తున్నది, స్టేషనుకు నాకను రమ్మని తమ్ముడు టెలిగ్రాం చేసి.. ఈయన స్టేషనుకు వెళ్లారు. మీ ఆఫీసరు గంటముందుగా ఎలా వదిలారు?—అని అడిగితే "ఆఫీసర్ని మనం అడగటం కూడానా. మనం ఎప్పుడు వెళ్ళదలుచుకుంటే అప్పుడు వెళ్ళవచ్చు..." అన్నారు.

"అంతచచ్చు వెధవాండి మీ ఆఫీసరు?" అని అంటే—



"చంపేశావ్! ఆ కన్సెషనూ, పర్మిషనూ మనకొక్కరికే. మరెవ్వరికీ లేదు మా ఆఫీసులో" అన్నారు మహా బింకంగా.

ఈయన చెప్పిందంతా ఇప్పటిదాకా ఇంకా నిజమే ననుకుంటున్నాను. కాని అసలువిషయం బయటపడింది. పెళ్ళాన్ని పురిటికి పుటింటికి పంపాలని ప్రాధేయపడితే, పెళ్లామూ, పిల్లలూగల ఆఫీసరు పాపం దయదలచి వరమిచ్చాడు.

ఆలోచించిన కొద్దీ నాకు నవ్వొస్తున్నది.

ఆఫీసరుభార్య నా మొహంవంక ఎగాదిగా పరీక్షగా రెండు మూడుసార్లు చూసి ఆమె నవ్వసాగింది. నేను సినిమాలోని సన్నివేశాలకూ, సంభాషణలకూ నవ్వుతున్నాననుకుందో ఏమో. హిందీ సినిమాయెను—ఆమె కర్థమయి ఉండవు సంభాషణలు. ఆదేదో హాస్యసన్నివేశమనుకుని ఆమె నవ్వుతున్నది. నవ్వకపోతే పక్కనున్నవాళ్ళు యీమెకి సినిమా అర్థంకావటం లేదు అనుకుని పోతారేమోనని. ఇదంతా చూస్తుంటే నాకు నవ్వు ఆగింది కాదు. జేబురుమాలే శరణ్యమయింది.

నేను జేబురుమాలు నోటికడ్డుపెట్టుకోవటం చూసి ఆమె పమిటచెంగు నోట్లో కుక్కుకుంది.

అసలు సినిమా క్లోజ్‌గా ఫాలో అవుతున్న ఆఫీసరుకీ 'సినిమా' రుచించలేదు.

'మీ రిద్దరూ పొట్టలుబ్బేటట్లు నవ్వుతున్నారుగాని నాకేమంతనవ్వు రావటంలేదే కథ ఇంత సీరియస్‌గా ఉంటే మీకందులో హాస్యమెక్కడ కన్పించింది?—" అన్నాడు ఆఫీసరు మా వైపు తిరిగి.

ఆమె తెల్ల మొహం వేసుకుని నా మొహంలోకి తొంగిచూసింది.

అప్పటికే నేను శతవిధాల ప్రయత్నించి నవ్వు నాపుకోగలిగాను. ఆమె పట్టుబడ్డ దొంగలా మొహం వాల్చుకుంది.

"అమ్మా! మంచినీళ్ళు!" అంటూ ఆరేళ్ల పిల్ల అమ్మ తలపై కెక్కింది.

"మంచినీళ్లు కావాలంటే ఇప్పుడెలా వస్తయ్. కాసేపాగు" ఆమె కసిరింది పిల్లని.

"నాలికెండిపోతుంటే...ఎట్లాగమ్మా. ఎప్పటికయిపోతుందో సినిమా!" మొండికేసింది పిల్ల—దాహం నిజంగానే అవుతున్నదో, లేక కాసేపు బయటకు పోదామని సర్దాయే కలిగిందో మరి!

"పిల్లల్ని తీసుకురావద్దన్నాను అందుకనే నా మాట వింటేగా—అఘోరించు."

పిల్ల మెల్లగా రాగం తీయ నారంభించింది. అది గ్రహించిన ఆఫీసరు "ఇహ లాభంలేదు. అది ఊరుకోదు. అలా బయటికి తీసికెళ్లి సోడా ఇప్పించు," అన్నాడు భార్యతో.

"నాకేం తెలుసు సోడా ఎక్కడ ఉంటుందో ఏమో!"

పాపం! నూలకొయురాలాయను. అంత శరీరాన్ని కుర్చీలోంచి లేవదీయటమంటే ఆమెకు ప్రాణంమీదికి వచ్చినట్లుండటం సహజమేగా!

"సోడా ఎక్కడ ఉంటుందో తెలియదు గాని పిల్లల్ని వద్దన్నా సినిమాకు తీసుకు రావటంమాత్రం బాగా తెలుసును"

"పిల్లలున్నవాళ్లు సినిమాకు తీసుకురాకుండా ఇంటిదగ్గర వదిలిపెట్టివస్తారా ఏం? వదిలిపెట్టేమాటుకు బుదిగా ఉండే సంచా వినున్నావా? మీతో నాకెక్కడ పోట్లాట ఎందుకు?" అని మా వారిని ఉద్దేశిస్తూ—"ఇదిగో అబ్బాయ్! భాస్కరం, కాస్త దీన్ని తీసికెళి సోడా పట్టుకురా నాయనా!" చిన్నగా కేకేసింది.

మా వెనకా-ముందూ వరుసల్లో ఉన్న వాళ్లు "ష్" అన్నారు-ఒక్కసారి.

అమ్మగారు ప్రార్థనాపూర్వకంగా అన్నా అనుల్లంఘనీయ ఆజ్ఞకిందే లెక్క.

తప్పేదేముందని మావారికి కుర్చీలోంచి లేచి, ధోవతి ఊడిపోతుందేమోనన్న భయంతో కొంబోలు చెంగులు జాగ్రత్తగా పైకి పట్టుకుని, పిల్లని తీసుకునిపోతూఉంటే "ఉండబ్బాయ్! డబ్బులిస్తాను" అంటూ కొంగు ముడివిప్పసాగింది ఆమె.

"నా దగ్గర ఉన్నాయిలెండి" అంటూ ఆ ఏడ్చేపిల్లను రెక్కపట్టుకుని ఆయన నడిపించుకుని గేటుదాకా పోయేవరకు ఆమె కొంగు ముడివిప్పుతూనే ఉంది-ముడిని తిట్టుకుంటూ కాని ఆ ముడిమాత్రం విడలేదు.

"వెళ్లనే వెళ్లాడే!-" అంటూ కాస్త వదులయిందేమోనని తిరిగి గట్టిగా చివర్లు రెండూ పట్టుకుని ముడిని మళ్లీ బిగించింది.

పిల్లకు సోడా ఇప్పించి లోపలికివచ్చారో లేదో ఇంటర్వెల్లయింది. లైట్లు వెలిగాయి.

తల అటు తిప్పి చూదునుగదా-మా జేళ్లి పిల్లవాడు మావారి ఒళ్లో కూర్చుని ఏదో గొణుగుతున్నాడు. ఏమంటాడా అని చెవి ఒగ్గి విన్నాను.

మావారు ఆ తగారి కోరిక ప్రకారం అలవాటులేని ధోవతి కట్టుకుని, అది ఊడిపోకుండా ఉండేందుకుగాను బెల్ట్ పెట్టుకున్నారని మొదట్లోనే చెప్పానుకదూ. మన ప్రభుత్వ చిహ్నముంది చూశారూ అశోకస్థంభం, సింహపుతలలూ - ఆ బొమ్మ మావారి బల్ట్ మీద ఉంది. దాని ఖర్మం చాలక - కాదు, మావారికి రోజులు బాగుండక - ఆ బొమ్మ కాస్తా ఆ గుంటడి కళ్లలో పడింది. దాన్ని పట్టుకుని వదలడు. గోరుతో గిల్లుతాడు; వేళ్ళతో పట్టుకు ఊడబెరుకు

తాను. ఎలా వస్తుంది అది? నయాన నచ్చ చెప్తున్నారు మావారు. కాని వాడు వినిపించుకుంటేగా! తను పట్టిన కుందేలుకు మూడే కాళ్ళన్న పద్ధతిలో ఉన్నాడు. పిల్లవాడాయను - అందులోనూ ఆఫీసరుగారి ఆఖరిబిడ్డ, అంతేగాక ఆఫీసరుగారి భార్యకు ముద్దులకొడుకు ఎక్కడలేని గారాబమున్నూ. అసలే కోతి; అదేమో కల్లు త్రాగిందట, నిప్పుతొక్కిందట - అన్నసామెతగా ఉంది పరిస్థితి.

నయాన పనికాకపోతే భయపెట్టమన్నారు పెద్దలు. కాని ఈ పిల్లవాడిని - ఇంత ప్రత్యేక వ్యక్తిత్వంగల పిల్లవాడిని - కళ్ళతోనయినా భయపెట్టటానికి ఎన్ని దమ్ములుండాలి?

పిల్లవాడా బొమ్మకోసం ఏడుస్తుంటే - ఇక్కడ ఈమెగారి (మాతృ) హృదయం గిలగిలలాడుతున్నది.

“బెల్ట్ తీసిఈయి భాస్కరం కాసేపు. వాడు పట్టుపట్టాడంటే ఓ పట్టాన వదలడు. సినిమా వదిలినతర్వాత మాయబుచ్చి నేను నీకు ఇప్పిస్తాన్...

మావారు ఆ మాటలువిని ఆముదం తాగిన మొహం పెట్టారు. వారి బాధ నా కర్థమయింది పొద్దుటినుంచి ఆయన పరువు - మర్యాదలను నిలపెట్తున్నది ఆ బెల్ట్! దానినే కనుక ఇప్పుడీ పిల్లవాడి కీయటమంటే తన పరువును నడిబజారులో స్వహస్తాలతో వివస్త్రచేయటమే!

పిలవాడు స్థాయి హెచ్చించి ఏడ్వసాగాడు ఇహ లాభంలేదనుకుని మావారు బెల్ట్‌తీసి పిల్లవానికిచ్చారు. అక్కడితో అయింది నా పని! బెల్ నడుముకు పెట్టమంటాడు. మంత్రసాని తనానికి ఒప్పుకున్న తర్వాత తప్పేదేముంది?

పిల్లవాడి నడుమెంత ఉంటుంది! గట్టిగా బిగించేసరికి బెల్ట్ రెండు చుట్లు తిరిగి బొమ్మను కప్పేసింది. బొమ్మ కనపడటం లేదు - అని ఏడ్పు లంకించుకున్నాడు. ఆయన ఏంచేస్తారు పాపం? అవధులు దాటుతున్న కోపాన్ని ఆఫీసరుగారి అబ్బాయి అన్న భావం కళ్ళెంవేసి ఆపుతున్నది

బొమ్మ కనపడేలా పిల్లవాడు కోరినట్లు బెల్ట్ పెట్టారు వదులయి పాదాల్ని ముద్దు పెట్టుకుంది బెల్ట్. పిల్లవాడు గంతు వేయసాగాడు.

సహనం కోల్పోయిన మావారు “నావల్ల కాదు బాబూ! మీ అమ్మచేత పెట్టించుకో పో—” అంటూ పిల్లవాడ్ని ఆఫీసరుగారి భార్యదగరకు పంపించారు.

పిల్లవాడి తత్వమెరిగిన తల్లి కొంగు విప్పి (ఈసారి అరనిమిషంలోనే ముడి ఊడింది— అదేం విచిత్రమోగాని) ఒక చిలి కానీ వాడి చేతిలో పెట్టి బెల్టు గట్టిగా పెట్టింది.

“బొమ్మే దొంగలెత్తుకు పోకుండా— మన్నాలో దాచిపెట్టానమ్మా. ఏం?” అంది ఆమె.

వాడు సమ్మతిచూపిస్తూ తల పంకించాడు. మావారు నిర్విణ్ణు లయిపోయారు.

ఆమె ఒళ్ళోనుంచి జారి “అక్కడ కూర్చుంటా” అంటూ మావారి దగ్గరకు జేరారు మళ్ళీ

లైట్లు రినయ్. సినిమా తిరిగి ప్రారంభమయింది

ఒక అయిదు నిమిషాలు గడిచాయో లేదో వారి ఒళ్ళో కూర్చున్న ఆ మూడేళ్ల పిల్లవాడు “ఖు—పోవాలి” అంటూ మొదలుపెట్టాడు.

మొదట రెండు సార్లు వినిపించుకోలేదాయన. పిల్లవాడు ఇంకొంచెం పెద్దగా అడగసాగాడు. ఈ ‘వానలేని వరద’కు వినుకోవాల్సింది పోయి మానవుడు ఓపికగా, “కాసేపు ఉండమ్మా. సినిమా వదులుతారు. వెళ్దాం” అని బుజ్జగించ ప్రయత్నించాడు

ఈ మాత్రానికే వినిపించుకుంటే ఇంక లేనిదేముంది? ఆయనపాలిట శత్రువుడు లాగా తగులుకుండే ఆ గుంటడు!

“అయితే ఇక్కడే పోసుకుంటా...” అంటూ చొక్కా ఎత్తి, కూర్చోబోయాడు పిల్లవాడు.

మావారికటు ప్రక్కన కూర్చున్న కాలేజీ విద్యార్థి “ఎక్స్‌క్యూజ్ మీ! సర్! మీకు పుణ్యముంటుంది. హాలు కరాబు చేయించక అలా బయటికి తీసుకెళ్ళరూ!” అని చిన్నగా ప్రార్థించాడు.

అత్తమీద కోపం దుత్తమీద చూపించినట్లు మావారు ఆ కాలేజీ విద్యార్థి మీద కోపంగా చూసి “యుస్ యువర్ ఆడర్” అంటూ కుర్చీలోంచి, లేచి పిల్లవాని చేయి పట్టుకొని ‘నడువు’ అన్నాడు.

“చీకటి...బయం. ఎత్తుకో” అన్నాడు ఆ పిల్లవాడు.

పలకరిస్తే ఎక్కడ తననే తీసికెళ్లమంటాడో అని తటపటాయిస్తున్నదో ఏమో స్థూలకాయురాలు, మావారు ఎటూ బయల్దేరారు కదా అని నిర్భయంగా “కాళ్ళుతగిలి పడతాడేమో! ఎత్తుకు తీసుకుపో అబ్బాయ్” అన్నది.

మోసేవాడికి తెలుస్తుంది బరువు! ఆ పిల్లవాడు అఖరువాడవటమూ, తల్లి గారాబం ఎక్కువగా ఉండటం వల్లనో ఏమో పెంకితనమే గాకుండా దేహంకూడా బాగా పెంచాడు. అసలా పిలవాడ్ని చూస్తే మూడేళ్లవాడనుకుంటారనీ-ఆరేళ్లో, ఏడేళ్లో వయస్సుంటుంది అని అభిప్రాయపడతారు. నిజం చెప్పొద్దూ.-ఆమెమీద నాకు చెడ కోపం వచ్చింది. పిల్లకు సోడా పట్టించమందంటే కొంతకాకపోతే కొంతయినా అరముంది. మూడేళ్ళపిలవాడ్ని ఎత్తుకుని పోవాలా' సరాయి మగవాడు

ఆమె అంటేనుటుకు ఈయన ఎత్తుకో వచ్చాడా పిల్లవాడ్ని-అని నేననుకుంటూనే ఉన్నాను-అంతపిల్లవాడ్ని, అంత బరువున్న వాడ్ని, పొడుంకాయలాగా నున్నగా నల్లగా, దిట్టంగా, వున్నవాడ్ని, ఎత్తుకోనే ఎత్తుకున్నారు. ఇంత ‘జోహుకుమ్‌రాయుడు’ అయిపోయారేమా ఈయన అని నాకు ఆగ్రహం కల్గింది.

ఎత్తుకుని ఆమెనూ, నన్నూ దాటారో లేదో ధోవతి గోచీ ఊడి కాళ్ళకడ్డంపడి మనిషి తూలి-రాక్ ఎన్ రోల్ సంగీతానికి తాళంవేస్తూ పాటలో లీనమయిపోయి ఈ లోకం మర్చిపోయిన ఒక వర్కింగ్ గర్ల్ ఒళ్లోపోలుపడ్డారు పిల్లవాడూ, తనూ.

పిల్లవాడు భయపడి ‘గీ’ మన్నాడు-దెబ్బ ఏమీ తగలకపోయినా.

పడ్డవాడు లేవ ప్రయత్నిస్తూంటే ఆ అమ్మాయి ఒక్కతోపు తోసింది. ఆ తోపుకు సీట్లమధ్య అమ్మాయి కాళ్ళమీద పడిపోయారు. ఆ అమ్మాయి “యూ! ఫూల్ !” అని కాళ్ళు గుంజుకో సాగింది.

“ఐయామ్‌సారీ!” అంటూ వారెలాగో లేచి ఏడుస్తున్న పిల్లవాడినోటికి చేయి అడ్డుపెట్టి ‘పదపద’ మన్నాడు

‘కళ్ళు దిగఱపెట్టుకు నడవాలి’ అన్నది అమ్మాయి మొహం కందగడ చేసుకుని. చీకట్లో ఆమెకళ్ళు జ్యోతుల్లా ఉన్నాయి.

పిల్లవాడి నోటిమీదనుంచి చేయితీస్తే, ఎక్కడ ‘గీ’ అంటాడోనని చేయి తీయకుండానే, రెండోచేత్తో ధోవతి గోచీ పెట్టుకుని జాగ్రత్తగా కళ్ళు దగ్గఱపెట్టుకుని నడుస్తూ హాలు బయటికిపోయారు.

బెల్ లేకపోవటంవలన పెద్ద పరాభవమే జరిగిందే-అని నేను విచారిసూ కూర్చున్నాను. అయిదునిముషాలు దాదాపు గడిచినయ్. వారింకాతిరిగిరాలేదు. బయట ఆపిల్లవాడింకా ఏమేడిపిస్తున్నాడో అని నాకు భయంగా ఉంది.

“ఇంకా రాలేదు వాళ్ళు. కొంచెం బయటికిపోయి చూసిరండి. పిల్లవాడేం గోల చేస్తున్నాడో” అన్నాను నేనామెతో.

వెనుకటికెవడో నీముక్కునదేమిటంటే, నీ చేత్తోనే తుడువు అన్నాడుట. సరిగ్గా అలాగే అంది ఆమె.

“కాస్త నువ్వే చూసిరామ్మ రాధా! నేను పెదదానిని. లేచి పోలేను. మీ అన్నయ్యలాగా కాళ్ళుతగిలి ఎక్కడపడతానో.”

ఆమె మాటమీద గౌరవం మాట అలా ఉంచి, నోరు లేని మా వారిని ఆ పిల్లాడు

(47-వ పేజీ చూడండి)




## [ఉద్యోగపర్వమునుండి]

వ. ఇట్లు పుట్టినబిడ్డకుఁ బుత్త్రప్రకారంబున జాతకర్మాదికృత్యంబులు నిర్వర్తించి శిఖండి యనుపేరు వెట్టి యతిప్రచ్ఛన్నం బుగాఁ బెనిచి రహస్యంబు తెఱం గాకన్నియకుం జెప్పి యక్షరశిక్షాదు లాచరించి ద్రోణాచార్యుకడ శస్త్రాస్త్ర పరిశ్రమంబు సేయించుచుండ జవ్వనంబు చొరవకుం దఱి యగుటయు నమ్మగువం జూచి వగచి తల్లిదండ్రులు దమలో విచారించి వేగంబ వివాహంబుసేయవలయుఁ బరమేశ్వర వరంబుకొలంత దన నెఱసినప్పుడ నెఱయుం గాక యని నిశ్చయించి దశార్ణదేశాధీశుం డగు హేమవర్మ యను రాజకన్యకం దగిన తెఱంగునఁ బాణిగ్రహణంబు సేయించి తెచ్చియున్నంత.

ఆ. అక్కుమారి చతుర యగుట శిఖండివ, ర్తనము నెడఁ బ్రమాదమున నెఱింగి
యుగ్గడింప నొల్ల కూరక యెఱుఁగని, యదియపోలె నుండె నాత్మ నొచ్చి.

వ. ఇట్లు దశార్ణవిభుపుత్త్రి యెఱింగి శిఖండి పురుషుండు గామి దనదాసికిం జెప్పిన నదియు నప్పు డన్నరనాథున కెఱిం గించిపుచ్చిన నతండు విషాదరోషంబుల నొంది దూతం బుత్తెంచిన వాఁడు వచ్చి పాంచాలపతిం గాంచి యిట్లనియె.

చ. కొడు కని తెచ్చి యి ట్లగునె కూఁతు వివాహము సేయ దీన నీ
పడసినలాభ మేమి నగుఁబా టగు నింతియ కాక యెల్ల నే
ర్పడ నెఱుఁగంగ వచ్చితి నరాతిభయంకరు హేమవర్మ నా
గడమున గాసిచేసితి మగంటిమి నీదెన నైనఁ జూపుమా.

ఆ. అనిన నగుచు వాని కను ద్రుపదుం డివి, యేటిమాట లిట్టు లేల చేయ
వచ్చు నింత వెట్టివారును గలరె యి, త్తెఱఁగు వొసఁగకునికి యెఱుఁగరాదె.

వ. అని వెండియు నేర్పునం దీర్పుమాట లనేకంబు లాడి నిక్కం బరయం జూచిన వానికిం జొరవ యీక త్రోపుసేసి వీడ్కొలిపి పుచ్చినం బోయి వాఁడును నిజనాథున కవ్విధంబు విన్నవించిన.

క. కోపోద్రేకంబున నతఁ, డా పాంచాలపతిమీఁద నతులితసైన్యా
టోపమున వచ్చి పురిపరి, ఖాపరిసరతలముచుట్టుఁ గైకొని విడిసెన్.

వ. ఇట్లు విడసిన.

ఆ. పట్టువడ్డ ముచ్చు పగిదిఁ బాంచాల భూ, నాయకుండు దనకు నానచేటు
రాక కుమ్మలించి యేకాంతమునఁ బత్ని, యొక్కతియును గొల్వ నూరకుండె.

వ. తదీయదండనాథులు సమరోత్సాహంబునం బ్రవర్తిల్లి రంత సూర్యాస్తమయ సమయం బగుటయు రెండువీళ్లను భండ నంబుతోడి వేడుకం జేసి వేగుటయ వేచియుండె.

క. అప్పుడు శిఖండి మరణము, తప్పఁగ నడి కొండు ప్రతివిధానము సేయం
జొప్పడమిఁ దలఁచి యొరులకుఁ, జెప్పగ వెన నరిగెఁ బురము చెంత యడవికిన్.

### శిఖండి యక్షునివలన బురుషత్వంబు నొందినవృత్తాంతము.

వ. అవ్విపినంబు స్థూలకర్ణుం డనునొక్కయక్షునికి నివాసం బై యునికిం జేసి నిర్జనం బై యుండు శిఖండియు నత్తెఱం గెఱుంగుం గావున నతని నుద్దేశించి యందుఁ జొచ్చి తత్ప్రదేశంబున మహనీయసుందరం బగు తదీయమందిరం బున కరిగి యచ్చటఁ బ్రాణవియోగం బగువిధం బాచరింపం బూనిన.

ఉ. యక్షుఁ డెఱింగి వచ్చి యిటు లాఁడి చావఁగ నేల చెప్పు మ
జ్జాక్షీ భవన్మనోరుజకు నౌషధ మే నొనరింతు నన్న ఫా
లాక్షుఁడు దక్క నొండ్లకును నావని సేయఁగరాదు నాదు చి
త్తకుతి పుంస్త్వ మేను దగఁ దాల్చక మానదు గుహ్యకోత్తమా.

క. అని తనవృత్తాంతం బ్బాతని కెఱిఁగించుటయు నతఁడుఁ దనదగు చిత్తం
బునఁ గరుణ వుట్టి యెంతటి, పని యిది యే నిత్తు సమయ పరిపాలనతోన్.

క. నాపురుషత్వము గైకొని, వే పోయి దశార్ణపతికి వెలయించిన మీ
యాపదలు దొలఁగి చనఁ బాడ,మూపుము పదినాళ్ళయంత సూనృత మొప్పన్.

క. అంతవునంతకు నీ దగు, కాంతారూపంబు నేను గైకొనియెద ని
శ్చింతమున మగుడఁ జను మని, యింతికిఁ బురుషత్వ మిచ్చె నెంతయు వేడ్కన్.

తే. ఇచ్చి తాను భామాకృతి నెలమిఁ దాల్చె, వీడుకొల్ప శిఖండియు వీటి కేఁగు
దెంచి నిజమందిరంబు సొత్తెంచి తల్లి,దండ్రులకు మ్రొక్కి నిలిచి ముదం బెలర్ప.

క. తన తెఱఁ గంతయు నెఱిఁగిం,చిన నద్భుతహర్షమగ్నచేతను లై త
జ్జననీజనకులు బహువిధ,వినుతులఁ గొనియాడి రంత వేకువ యయ్యెన్.

వ. తదనంతరంబ సూర్యోదయం బగుటయుఁ గాలోచితకరణీయంబులు నిర్వర్తించి పాంచాలవిభుండు సంబంధితో వలయుమాట లాడం దగువారలం బనిచి రావించి సంభ్రమంబు లేక వేగిరపడక నాగరికప్రకారంబున శిఖండి పురుషత్వంబు దేటపఱిచి యతనిమాట గెడ్పఱచి సపరివారంబుగా నద్దశార్ణపతికి విందుపెట్టి కట్నంబు లిచ్చి యతని యనునయాలాపంబులు గైకొని యనిచిపుచ్చిన నతండు తన్నుం దాన నిందించుకొనుచు నిజపురంబునకుం బోయె నట్టియెడ నయ్యక్షవరు మందిరంబు చక్కటికిం గ్రీడార్థంబు గిన్నరవిభుండు విమానారూఢుం డయి చని దాని యొప్పు గనుంగొని యగ్గించుచు నిల్చి యొక్కింత సేపునకుం జుట్లనున్న గుహ్యకులతో నిట్లనియె.

క. మన మిచట నిలిచి యుండఁగ, మనమున శంకింప కిట్లు మసలినవాఁ డీ
తని గర్వ మేల యిక్కడఁ, జనుదేరఁగ నిచ్చు నెట్లు సైఁపఁగ వచ్చున్.

వ. అని పలికి యలుక మొగంబున ముడివడ నున్నంతఁ గిన్నరు లాగుహ్యకు నరసి తద్వృత్తాంతం బంతయు నెఱిఁగించి దేవా సిగ్గుపెంపున రానేరకున్నవాఁడని విన్నవించిన.

ఆ. అయిన నేమి పిలువుఁ డని పిలిపించిన, వచ్చి మ్రొక్కుటయును వనిత యైన
యతనిఁ జూచి యింక నవుడాని కిట్టుల, యుండుఁ గాక యని విభుండు పలికె.

## స్థూలకర్ణునకుఁ గుబేరునివలన స్త్రీత్వము గలుగుట

వ. స్థూలకర్ణుండును దలరి దండప్రణామంబు సేసి యుండె నప్పుడు గొలిచియున్న దొరలు ధనదునకుం గృప వుట్ట నల్లని తెలిపిన నట్లేని వీఁడు శిఖండి యాయువు గలంతకాలంబును గాంతాకృతియై యుండి పదంపడి నిజరూపంబు దాల్చుం గాక యని యనుగ్రహించి యరిగిన.

తే. గుహ్యకుండు విషాదంబు నొంది యుండె, నచ్చటికిఁ గొన్నిదినముల కరుగుదెంచె
దల్లిదండ్రుల కెఱిఁగించి తగవు మెఱయ, సమయనిష్ఠ వాటించి పాంచాలసుతుఁడు.

క. వచ్చినఁ గనుఁగొని నీదెసఁ, బొచ్చెము లే దిట్ల మగిడి పొమ్మిది విధి నీ
కిచ్చినరూపని గుహ్యకుఁ, డచ్చుపడం బలికి యెల్ల నతనికిఁ జెప్పెన్.

వ. చెప్పి వీడుకొలిపిన శిఖండి యత్యంత ప్రమోదంబునం దండ్రికడకు వచ్చి యత్తెఱం గెఱింగించిన నాతండు ప్రీతుం డయి దేవగురుద్విజపూజనంబు లాచరించి ద్రోణాచార్యపాల సవిశేషంబుగా శిష్యభావంబు ప్రతిష్ఠించె.

క. అని చెప్పి నారదుఁడు ద్యానును సత్యవతీసుతుండును సం దమయిచ్చం
జనిరి శిఖండిచరిత్రము, జనకర్ణపరంపరం బ్రశస్తం బయ్యెన్.

వ. ఇవ్విధంబునఁ గాశీపతికన్యక సిద్ధమూర్తి యయి నెగడె నేను నంగనల నంగనాపూర్వుల నంగనాభిధానుల నంగనాకారులను వధియింపకుండ వ్రతంబు పూనినవాఁడం గావున నంగనాపూర్వుం డగు శిఖండి నాకు ఖండనంబునం

గోదండపాండిత్యంబు మెఱసినను జంపను నొంపనుఁ గడంగితినయేని వింతకంటెను దుర్యశంబు గలదె యెట్లయిన నగుదుంగాని భగ్నవ్రతుండ నగుట కోర్వనిది నా తెఱంగు

క. అని చెప్పిన దేవవ్రతు, వినుతవచనములు విభుండు విని తనచిత్తం
బున నొక్కింత వగచి యీ,తనికి మగతనంబుపూన్కి దగునని పలికెన్.

వ. తదనంతరంబ కొలువునం గలయ సమరవిషయంబు లయిన సల్లాపంబులు సెల్లుచుండఁ గొండొకసేపు వినుచుండి సుయోధనుండు సురనదీసూనున కిట్లనియె.

ఆ. పాండవులకుఁ గలుగుబలము లన్నియు నము, యింప నీకు దినము లెన్ని పట్టు
గురుఁడుఁ గృపుఁడు గురునికొడుకుఁ గర్ణుడు నెం,తెంతమానమున వధింతు రనఘ.

వ. అనిన విని గాంగేయుం డతని కిట్లనియె.

క. అనిఁ బాండవసేనలఁ జం,పను జెఱుపను నేము చాలుభంగుల నీ కి
ట్లనుమానము వాయఁగ నడు, గన తగుఁ గడు లెస్స యిందు గాక నరేంద్రా.

వ. ఏను నాచాలెడుకొలంది సెప్పెదఁ దక్కటివారుఁ దమతమ చాలుటలు దార చెప్పెద రది యెల్లను విదప యిందు గాని మున్ను నీ కొక్కటాన యిచ్చెద నాకర్ణింపుము.

క. మీఁటు గల రాజరథికుల, నాఁటికి వేవుర వధింతు నరుశరములు నో
నాఁటి పడవైచునంతకు, వేఁటాడెదఁ బ్రతిబలంబువీరుల నెల్లన్.

వ. అట్లుగా నాకయ్యంబు సేయు దివసంబులలోన

క. పదివేలఁ జంపఁగా నొ,పుదు నే నను నెత్తికోలు పుట్టిన యది నీ
పదునొకఁ డక్షౌహిణులను, బదురున నడపింతు నెదిరిసైన్యము గలఁతుర్.

వ. అని పలికి పెండియు.

క. నీ వడిగినపని యేర్పడఁ, గా విను మే నొక్కనెలఁ దెగం జేయుదు నా
నావిధదివ్యాస్త్రంబుల, లావున నప్పాండవులబలంబుల నెల్లన్.

వ అనవుడు గురుకృపాశ్వత్థామకర్ణులం గనుంగొని గాంధారీనందనుండు మీమీ చందంబు లెట్లనిన నాచార్యుండు మందస్మితాననుం డగుచు నిట్లనియె.

తే. ఏను ముదిసినవాఁడ మహీశ యెట్టు, లయిన నోపినభంగి నీయనుఁగుఁదాత
సాటి నన్నిదినంబులఁ జాలవచ్చు, నబ్బలంబుల నని సమయంగఁ జేయ.

క. అనినఁ గృపాచార్యుండీ, యినుమడిదివసములఁ దీర్ప నే నోపుదు నా
విని గురుతనూభవుఁడు పది, దినములఁ గడతేర్తు ననియె ధీరవిచారా.

వ. అందఱపలుకు లాకర్ణించి కర్ణుండు.

క. నానాస్త్రశస్త్రచయబడ, బానలముం గవియఁజేసి యత్యుగ్రత నే
నేనాళ్లన యప్పాండవ, సేనాసాగరము నివురఁ జేయుదు నధిపా.

వ. అని ప్రతిన సేసినఁ గలకల నవ్వి గాంగేయుండు.

చ. పలికిన నేమి యన్నియును బల్కనగున్ మనరాజునొద్ద మా
ర్పలికెడువారు లేరు విను పాండవమధ్యముగాండివంబు దీ
ప్తుల మిఱుమిట్లు గొన్న కనుదోయి గుణధ్వని వ్రయ్యలైన వీ
నుల నయినన్ బలేపలుకు నూల్కొన కుండుదు సూతనందనా.

వ. అనియె నివ్విధంబున నీకొరుకుకడం బుట్టిన విశేషంబులు ధర్మతనయుండు చారులవలన విని తమ్ముల రాఁ బనిచి వారలతో నిట్లనియె.

సీ. మనచారు లిప్పుడు సనుదెంచి రా వీట నుండి దుర్బుద్ధి సుయోధనుండు
గొలువున గాంగేయకుంభసంభవకృపాశ్వత్థామకర్ణులవలను సూచి
యనిఁ బాండవులబలం బంతయు సమయింపఁ జాలుదు రెంతేసికాలమాన
మున నన్నభీష్ముండు దన కొక్కనెల వట్టునని యాడె ద్రోణుండు నట్ల పలికెఁ

ఆ. కృపుఁడు రెట్టి సెప్పెఁ గృపికొడుకు పదుఁ, బదిదినముల ననియె బాహువీర్య
ఘనుఁడు గాన సూతతనయుఁ డేనాళ్లన, తీర్చ నేర్తునని ప్రతిజ్ఞ సేసె.

వ అని చెప్పి యర్జునుం గనుంగొని వారు దమతమ యోపినచదంబులు సెప్పిరి, నీ చేతం గౌరవబలంబు లెంత దడ
వునకుం దెగు నాకుం జెప్పుమనిన నతండిట్లనియె

తే. వారలంతకుఁ జాలనివారె నీబ, లముల సమయింపఁ జాలెదు లావు వెరవుఁ
గలర కాక యారాజుతోఁ బలికి బాస, దప్పవచ్చునె వారికి ధరణినాథ.

వ, అని దరహాసోల్లాస భాసిత వదనుండై.

మ. అనుమానం బది యేల నీమది మదీయస్ఫారబాహాబలం
బు నిరూపింపఁ దలంచి తేని విను మేపుం జేవయుం జూపి కృ
ష్ణుని తోడ్పాటున బేర్చి యేఁ గడఁగినం జూర్ణంబు గావింతు నొ
క్కొ నిమేషంబున దేవదానవులతోఁ గూడం ద్రిలోకంబునుఁ.

వ అది యెట్లంటేనిఁ గృత్రిమకిరాతుండైన పశుపతి మెచ్చి జగత్సంహార సమయంబునం దాను బ్రయోగించునట్టి పాశు
పత మహాస్త్రంబు నా కిచ్చె నది నాయందు సన్నిహితం బయియున్నయదిగావున శత్రు నిరాసం బయాసంబై యుండు
నప్పాశుపతంబు మహనీయ ప్రభావంబు భీష్ముండున్న రూపెఱుంగఁడు ద్రోణకృపాశ్వత్థామలు నెఱుంగరు కర్ణునకెఱుంగ
నెంత ద వ్వట్టి ఘోరసాధనంబున సమస్తంబును సమయించుట యుక్తంబు గాదు తక్కిన యాయుధంబులం బోరి
వైరులం బరిమార్చినం బౌరుషంబు దీపించు నని తలంచెద నప్పటికి వలయు విధం బయ్యెడు నది యట్లుండె నీవా
రక్కడివారికిం దక్కువవారె భీమసేనుండు గవ లభిమన్యుండు ద్రౌపదేయులు సాత్యకి విరాట ద్రుపదులు ధృష్టద్యు
మ్నుండు శిఖండి యుత్తమౌజుండు యుధామన్యుండు ఘటోత్కచుండు జెట్టాన జెట్టున్నవారు మఱియు ననేకులు వీరల
యట్టివార యందఱం జెప్ప నేల యేనుంగువోలె నీలావు నీ వెఱుంగవు దివిజులకు నజేయుండవు నీయొక్కనికిఁ
ద్రిభువనంబు నెదురె నీవు నిక్కం బలుగవు గాక నీ వలిగిన నెవ్వరెట్లయ్యెదరో యటు సూడుము నీసైన్యంబుల
నెవ్వరికి నేమి సేయ వచ్చు మనకు విజయానందంబు సులభంబ యని పలికెనని సంజయుండు ధృతరాష్ట్రున కెఱిం
గించెనని వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పుటయు.

చ. కమలభవాదిదైవతముఖస్ఫుటనిర్గళితప్రశస్తవా
గమృతరసప్రసారకలితాంచితసేకవిధిప్రకర్షనం
గమనముదీరితోల్లసనకందళితప్రహసద్దయాలతా
సుమహదుపాశ్రయప్రమదశోభితవిశ్వజగన్మధువ్రతా.

క. సమయబహుత్వారణ్య, భ్రమణపరిశ్రామ్యదంతరంగనితాంతో
త్తమసరళమార్గదర్శన, సమర్థపుణ్యాభిధానసత్కృదుచ్చరణా.

మాలిని. అవగమితరహస్యాష్టాంగసమ్యక్ప్రకారో
త్సవగురుకరుణావిస్తారగాఢప్రశాంతి
ప్రవణహృదయపద్మోద్భాసివిజ్ఞానసారా
వ్యవహితపరమానందానుభూత్యేకరూపా.

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి
ప్రణీతం బయిన శ్రీ మహాభారతంబున యుద్యోగపర్వంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము.



# అంతరిక్షయాత్రలో ప



మహా అంచుల రాకెట్టుచివర, కోనా కృతిగా ఉన్న ముఖప్రదేశంలో కాళ్లు ముడుచుకుని వెల్లకిలా పడుకున్నాడు మానవుడు. రాకెట్టును అంతరిక్షంలోకి విసిరేసే గడియకోసం ఎదురుచూస్తున్నాడు గుండెలు గుభేల్ మనేట్లు ధణేల్ మనే

అంతరిక్ష వైద్యపరిశోధనలు చేస్తున్న శాస్త్రజ్ఞుడు డా॥ సైమన్స్

శబ్దంతో రాకెట్ బయలుదేరింది మానవుడు గొలుసులతో తన్ను తను కట్టేసుకున్నాడు శరీరమంతా పొరలు పొరలుగా ఉన్న కవచంతో కప్పుకున్నాడు. అయినా రాకెట్ గర్జనకి, తీవ్రమైన కంపనకి అదిరదిరిపడుతున్నాడు. రాకెట్ ఆకాశంలోకి పోతోంది చుట్టూ భయంకరమైన శూన్యం "నతత్ర సూర్యోభాతి నచంద్రతారకం" అని కఠోపనిషత్తు చేసిన కఠోరనిర్వచనానికి ఉదాహరణమల్లే ఆ శూన్యంలో సూర్యుడు ప్రకాశించడు అక్కడ ఎత్తులోతు, పైన కింద, కుడి ఎడమ అనే మాటలకి అర్థంలేదు. రాకెట్‌లోని మానవుడు ఏమాత్రం ఏమరుపాటుగా ఉన్నా దారుణమైన విశ్వశక్తులు అతన్ని కబళించివేస్తాయి



చింపంజీని గంటకు 1337 మైళ్ళ వేగంతో పైకి పంపించి, చ. అడుగుకు 4000 పౌనుల ఒత్తిడికి గురిచేసి శాస్త్రజ్ఞులుపరిశోధనలు చేస్తున్నారు

రాకెట్ వేగంవల్ల, భూమి ఆకర్షణ శక్తి కంటే బలమైన గురుత్వాకర్షణ శక్తులు బయలుదేరతాయి ఈ శక్తులవల్ల మామూలుగా నూటయాభై పౌనుల బరువుంటే మానవుడి బరువు ముప్పాతికటన్ను దాకా పెరిగిపోతుంది రాకెట్ 25 వేల మైళ్ళ వేగంతో పోతూంటుంది కనక వాతావరణపు రాపిడి మూలంగా 1600 డిగ్రీల (ఫారన్‌హీట్) వేడి జనిస్తుంది వాతావరణం దాటి పైకి పోయాక మైనస్ 454 డిగ్రీల (ఫారన్‌హీట్) దాకా చల్లపడుతుంది మానవశరీరం ఒక పెద్దపెత్తురు బాంబులా బద్దలై పోకుండా అదిమిఉంచే వాతావరణపు ఒత్తిడి బొత్తిగా ఉండదు

మిణుకు మిణుకుమనకుండా నిశ్చలంగా



బొగ్గుపులుసు గాలిని ప్రాణవాయువుగా మార్చటానికి కృత్రిమఫొటో సింథసిస్ పద్ధతిని శాస్త్రజ్ఞులు పరిశోధిస్తున్నారు

ప్రకాశించే నక్షత్రాలు, తెల్లటి డాలులాగ వెలిగే సూర్యుడు, పొగమంచు ముసుగులోంచి ప్రకాశించే భూగోళం — ఇవి తప్ప ఇంకేమీ కంటికి కనబడని శూన్యాకాశంలో అన్ని వైపులనించి విశ్వకిరణాలు ఆకాశనౌకను ముట్టడిస్తాయి, నౌకలోంచి లోపలికిపోయి మానవుణ్ణి ముట్టడిస్తాయి. అతడు ఆముట్టడికి తట్టుకోగలడో లేదో ఎవరికి తెలుసు? ఎవరు చూసొచ్చారు?

ఇప్పుడతడు భారరహిత స్థితిలో ఉన్నాడు వే
వేలు కదిలిస్తే అది ఎటోలేచివచ్చి ముఖంమీద
కొచ్చు జాగ్రతగా అవయవాలు కదల్చాలి
కాల్చుకుండామంటే అగ్నిప్రమాదం రావచ్చు
రితనపు భయం పోగొట్టుకోడానికి పాటపా
మంటే నౌకలోపల ఒత్తిడి లేకపోవటం వ



భారరహిత స్థితిలో ఉన్న పిల్లి ఎలా

(విమానశాఖ)

## నప్పుడికి సంభవించే

మాట బయటికిరాదు. అయినా అతడు ఎలాగో ధైర్యం చేసి ఆధైర్యం పోగొట్టుకోవాలి. లేకపోతే ఈ విచిత్రవిపరీత పరిస్థితుల మూలంగా అతని మతి పటాలుతప్పి బోల్తా కొట్టవచ్చు. మతికూడా పోతే అతనిగతి దుర్గతే.

మరి ఈ సమస్యల సవాళ్ళను మానవుడు ఎన్నాళ్ళకి ఎదుర్కొ_గలుగుతాడు? ఎవరూ గట్టిగా చెప్పలేక పోతున్నారు. గాని రెండేళ్ళు పట్టవచ్చునని ఒక అంచనా. ర్యవారి మూడో స్పుత్నిక్ మానవుణ్ణికూడా మోయగినంత పెద్దదే. అయితే మానవుణ్ణికిందికి తీసుకురావడ లాగో కనిపెట్టనంత కాలమూ మానవుణ్ణి పైకిపంపించి గాళంతో చెలగాట మాడుకోవటంవల్ల లాభమేమీ లేదు. ఈ సమస్యను చీల్చి చెండాడవలసినపని రాకెటీర్లది, ఇంజనీర్లది, శరీర శాస్త్రజ్ఞులది. కాగా, ఆకాశనౌకలో



పవర్తిస్తుందో డా॥ సీగ్‌ఫ్రీడ్ గిరాతివాల్ పరిశోధిస్తున్నారు.

మానవుడి మానసిక దైహిక ఆరోగ్యాన్ని కాపాడవలసిన పని ఆకాశ వైద్యులది. మానవుడు భూలోకానికి అనుగుణంగా జన్మించాడు గాని ఆకాశంలో ఆడుకునేందుకు జన్మించలేదు. అతన్ని ఆకాశజీవితానికి అనుకూలుడుగా చెయ్యటం చాలా కష్టం. ఈ పని ప్రస్తుతం అమెరికాలో విమానశాఖ, నౌకాశాఖ సాగిస్తున్నాయి.

మామూలు విమాన వైద్యంలోంచి పుట్టిందే అయినా, ఆకాశ వైద్యం కొత్తగా చిత్రంగా ఉంటుంది. జర్మన్ శరీరశాస్త్రజ్ఞుడు డా॥ హ్యూబర్టస్ స్ట్రిగ్‌హోల్డు ఈ వైద్యానికి పితామహుడనదగినవాడు. 1947లో ఈయన అమెరికాలో స్థిరపడ్డాడు. రాకెట్ వేగంవల్ల జనించే గురుత్వాకర్షణ శక్తులను మానవుడు తట్టుకోగలడా అనేది ఆకాశవైద్యులు తేల్చవలసిన మొదటిసమస్య. "తట్టుకోగలడు" అని ఒకాయన సమాధానం ఇచ్చాడు. ఆయనపేరు జాన్ పాల్ స్టాప్. ఆయన విమానవైద్యుడు. తనమీద తానే కొన్ని ప్రయోగాలు జరుపుకుని, పరిశోధనలు చేసి ఆయనపై సమాధానం ఇచ్చాడు.

కొత్తతరానికి చెందిన ఆకాశ వైద్యులు ఇంకా కొత్త కొత్త పరిశోధనలు జరుపుతున్నారు. వీరిలో కొందరు సాక్షాత్తు వాతావరణపు అంచుల్ని తాకి వచ్చినవారున్నారు. ముఖ్యంగా విమానశాఖకు చెందిన లూటినెంట్ కర్నల్ డేవిడ్ గుడ్‌మన్ సైమన్స్ అందరికన్నా మరీ సాహసంగా, చాలా ఎత్తున చాలసేపు ఉండగలిగారు. ఈయన వయస్సు 35 సం॥. గత సంవత్సరం మినిసోటాలోని క్రాస్బీ నుంచి బెలూన్‌లో పైకెగిరి లక్షా రెండువేల అడుగుల ఎత్తున అయిదు గంటలసేపు ఉన్నారు. ఇప్పుడీయన కాలిఫోర్నియాలోని వాతావరణ పరిశోధన, అభివృద్ధి శాఖలో పనిచేస్తున్నారు. జంతువులను ఆకాశంలోకి పంపించి, వాటిలో శారీరకంగా ఏమేమి మార్పులు కలుగుతాయో పరిశీలించటం ఈయన పని. బహుశా మొదట ఎలుకల్ని, తరవాత కోతుల్ని, చింపంజీలని, ఆఖరున మానవుల్ని ఆకాశంలోకి పంపిస్తారు. మానవుల్ని తిరిగి భూమి మీదకు



లక్షా రెండువేల అడుగుల ఎత్తున 32 గంటలసేపు నిలిచిన బెలూన్. ఈ బెలూన్‌లో ఉన్న కర్నల్ సైమన్స్ అంతరిక్షంలో మానవునిలో కలిగే మార్పులను పరిశోధించారు.

తీసుకువచ్చే బాధ్యత చాలవరకూ డా॥ సైమన్స్‌దే.

ఈయన స్వయంగా వైమానికుడు కూడా కావటంవల్ల వైమానికులను ఎదుర్కొనే సమస్యలతో ఈయనకు బాగా పరిచయమున్నది. ఆకాశప్రయాణాలకు సంబంధించిన పరిశోధనలకు అవసరమైన ఎలక్ట్రానిక్ పరికరాలంటే ఆయనకు ఎంతో ఇష్టం. వాటినిచూసే ఆయన ఈ పనిలోకి దిగారు.

ఆకాశంలో వాతావరణపు అంచులవరకూ వీటూ రాకెట్లలో పంపించబడిన కోతులలో ఏమేమి మార్పులు కలిగాయో ఈయన మొదట్లో పరీక్షించారు. ఇది 1947 లో సంగతి. ఆ తరవాత జపానువెళ్లి విమాన వైద్యంలో శిక్షణ పొంది, విమానవైద్యుడుగా పనిచేశారు. 1952 లో అమెరికా తిరిగివచ్చి మళ్ళీ జంతువులపై విశ్వకిరణాల ప్రభావాన్ని పరిశీలించారు. వాతావరణపు పై పొరలలో జంతువుల్ని విశ్వకిరణాలకు గురిచేసినపుడు వాటిలో కలిగే మార్పులను పరిశీలించటానికి అనువైనంతసేపు రాకెట్లు అక్కడ ఉండలేవు కనుక డా॥ సైమన్స్ రాకెట్ పరిశోధనలను మానేసి బెలూన్లతో పనిచేయనారంభించారు. పైకి పంపించే రకరకాల ప్రాణులను ఉంచటానికి అన్ని వేపులా మూసివేయబడిన గదులను నిర్మించే పనిమీద ఈయన మూడేళ్ళపాటు పరిశోధనలు చేశారు. జంతువులను పైకి పంపించి విశ్వకిరణవర్షంలో ముంచితేల్చి తిరిగి సజీవంగా నేలకు దించేవారు.

గత సంవత్సరం ఆగస్టులో డా॥ సైమన్స్ తానే ఒక బెలూనులో పైకి ప్రయాణం చేశారు. బెలూన్ గదినిండా 25 వేరు వేరు పరిశోధనలకు పనికివచ్చే అసంఖ్యాక పరికరాలున్నాయి. కదలటానికి, మెదలటానికీ చోటు లేనంతగా గది క్రిక్కిరిసిపోయింది. విశ్వకిరణాల తీవ్రతను కొలిచే సాధనాలదగ్గిర్నుంచి, మూత్రంలోంచి బయటికిపోయే హార్మోనులను పరీక్షించే సాధనాలు, మానసిక స్థితిని నిరూపించే టేపురికార్డరు వరకూ చాలా పరికరాలు అందులో అమర్చారు. వీటిలో కొన్ని పరికరాలు సరిగా పనిచేయకపోవటంచేత ఇప్పుడు వీటిని మళ్లీ అభివృద్ధి చేస్తున్నారు.

అంతఎత్తున బెలూన్‌గదిలో గడిపిన సమయంలో సైమన్స్ తను కనబడని శత్రువుల మధ్య గడిపినట్లు అనుభూతిపొందాడు. అప్పుడొక ప్రమాదంకూడా జరిగింది. వాతావరణం లేనిచోట ప్రయాణం చేసేవారందరూ ఎదుర్కొనవలసి వచ్చే ప్రమాదమే అది. గాలిని వడబోసే యంత్రం పాడయింది. బొగ్గుపులుసుగాలి మామూలుకి నాలుగువంతుల దాకా పెరిగిపోయింది. దీంతో సైమన్స్ మనస్సు, శరీరమూ సరిగా పనిచేయటం మానేశాయి. సుశిక్షితుడైన వైద్యుడయినా, అతడు తను నిమిషానికి 44 సార్లు గాలి పీలుస్తున్నానని (మామూలుగా అతడు 17 సార్లు పీలుస్తాడు) నేలమీదికి వార్త పంపించాడు. అతనికందులో వింత ఏమీ కనిపించలేదు. కాని అదృష్టవశాత్తూ, కిందివారు చెప్పినట్లు చేసే శక్తి అతను కోల్పోలేదు. అందుచేత వెంటనే మరింత ప్రాణవాయువును గదిలో నింపుకుని స్తిమితపడ్డాడు. ఈ విధంగా ఆ గండం గడిచింది.

"ఈ గండం అనుభవించిన తర్వాతకూడా మీరు ఆకాశ ప్రయాణం చేసిన మొట్టమొదటి మానవుడని అనిపించుకుందామనుకుంటున్నారా?" అని ఇటీవల ఆయన్ని అడగ్గా "అందుకు నేను సమర్థుణ్ణి, ఈ అపాయాలన్నిటికీ తట్టుకోగలను అని నిర్ణయింపబడితే ఆకాశ ప్రయాణం చేయటానికి నేను ఎప్పుడూ, సిద్ధమే. అలా నిర్ణయించనిపక్షంలో మాత్రం నేను ముందుకురాను" అని సైమన్స్ సమాధానమిచ్చాడు. మానవుణ్ణి అంతరిక్షంలోకి పంపించే ప్రయత్నంలో ఆకాశ వైద్యులు ఎదుర్కొనవలసిన అనేక సమస్యలున్నాయి. ఈ సమస్యలన్నిటినీ పరిష్కరింపజేసే భారం డా॥ సైమన్స్‌దే. ఈ సమస్యల్లో మొదటిది:



రష్యన్లు ఎగరవేసిన మూడవ స్పుత్నిక్.

## దుస్తులు

ఆకాశ ప్రయాణికుడు పొరలు పొరలుగా నిర్మింపబడిన సూటు ధరించాలి. ఆకాశంలోకి పోయేటప్పుడు నెత్తురంతా తలలోకి, నేలమీదికి దిగేటప్పుడు కాళ్ళలోకి అతివేగంగా ప్రవహించకుండా ఈ సూటులో ఒక భాగం కాపాడుతుంది. మరొకపొర అతనికి చల్లదనం కలగజేస్తుంది. వాతావరణపు రాపిడికి జనించే వేడిలో అతడు మలమలమాడి పోకుండా ఇంకొక పొర రక్షిస్తుంది. అతడున్నగది బొక్కలు బొక్కలు పడిపోయినా అతని శరీరానికి అపాయమేమీ రాకుండా చుట్టూ వాతావరణపు ఒత్తిడి సమంగా ఉండేట్లు చేసే వేరొక పొర ఉంటుంది. ఒక వేళ అతడు దిగేటప్పుడు సముద్రంలో పడిపోయినా ఈ పొరే అతన్ని రక్షిస్తుంది. ఇక రెండో సమస్య

## వాతావరణం

18 వేల అడుగుల ఎత్తున ప్రతి చదరపు టంగుళానికీ $7\frac{1}{2}$ పౌనుల చొప్పున వాతావరణపు ఒత్తిడి ఉంటుంది. ప్రయాణికుడు తొడుక్కున్న సూటు మాదిరిగానే అతడు ప్రయాణంచేసే ఆకాశనౌకకి కూడా ఇదే ఒత్తిడి ఉండేట్లుచేస్తారు. నూటికి 21 వంతుల ప్రాణ వాయువుండే మామూలు గాలితో కాక, 40 వంతుల ప్రాణవాయువుండే గాలితో గదినింపుతారు. ఇందుచేత అతడు సముద్రపుమట్టాన ఉన్నట్టే ఉంటాడు. ఆకాశంలోకి పోయేటప్పుడు, కిందికి దిగేటప్పుడు అతని సూటు గాలితో బాగా ఉబ్బిపోతుంది. ఆకాశంలో ప్రయాణంచేసేటప్పుడు సూటును గాలిలేకుండా మామూలుగానే ఉంచుకోవచ్చును. కావలిస్తే ముఖాచ్ఛాదనం తీసేసి గదిలో గాలే పీల్చుకోవచ్చును. బొగ్గుపులుసు వాయువును, ఊపిరిలో, చెమటలో ఉండే అదనపు నీటి ఆవిరిని తొలగించేందుకు లిథియమ్ హైడ్రాక్సైడ్‌ను ఉపయోగిస్తారు. మూడో సమస్య

## ఆకర్షణ శక్తులు

వేగంలో హెచ్చుతగ్గులు లేకుండా సమా

(42-వ పేజీ చూడండి)




## 40

ఆ రాత్రి నయాన్నా భయాన్నా అడిగినా పుల్లయ్య పోలీసు స్టేషనులో "నా కేమీ తెలీదని" చెప్పాడు. చివరకు లాఠీదెబ్బలతో ఒళ్లంతా హూనం చేసినా యిలా చచ్చిపోతాను గానీ నే నేరుట్టూ ఇవ్వనని భీష్మించుకున్నాడు. విసిగెత్తిన పోలీసులు యీడ్చి యీడ్చి లాకప్‌లో వుంచారు. హూనమైన శరీరం బాధపెట్టుంటే పుల్లయ్యకు కళ్ళలో నీరుకూడా తిరిగిపోతోంది. అలా ఆ కొట్టులో ఇనప కటకటాల వెనుక కూలబడిపోయాడు. ఆ బాధలో ఏవేవో అనుకున్నాడు; గొణుక్కున్నాడు తనలో తనే తిట్టుకుంటున్నాడు; నెత్తి నెత్తీ కొట్టుకున్నాడు. అలా వేకువఝామునగానీ మాగన్నుగా నిద్దరపటలేదు. ఆ కొద్దిసేపైనా యేవేవో కలలు. అందులో పోలీసులు అగుపించారు! తెలివి వచ్చేసరికి ఒళ్ళంతా పచ్చిగా వుంది. కదలలేనంత నీరసం అనిపించింది. "మల్లు ఎంతగా యేడుస్తున్నాడో! నీలి ఎలాగ బతుకుతాది? ఏందారి!" అని వాపోయాడు.

నిల్చుంటే నిలవలేకపోయాడు. ఆకలి బ్రహ్మాండంగా వుంది; శరీరం అంతా దిగుటు పొడిచినట్లు యే కీలు కా కీలు విరిగిపోయినట్లు, యెక్కడికండ అక్కడ తెగినట్లు అనిపించింది!

ఆ రోజు పుల్లయ్యను సెంట్రల్ జైలుకి పంపించారు.

నీలికి ముందు రాత్రంతా యెంత ప్రయత్నించినా నిద్దర రాలేగు. జరిగిన వన్నీ జ్ఞప్తికి వస్తున్నాయి. ఏడ్చి ఏడ్చి పడున్న మల్లు నిద్రపోతున్నాడు. తలుచుకున్న కొద్దీ మొగుడు అప్పుడు ఆడిన అబద్ధాలను నిజాలుగా యెలా తీసుకోగలిగినానని అబ్బరపడింది "ఆడికి పని దొరకకపోతే నాను ఎక్కడైనా పాసిపనిసేసి పోషిద్దును. ఎగిలిపిట్టకి మసాల రాసిన మనిసైపోనాడు! మన రాత బాగులేనప్పుడు ఏ కూలిపని సేసినా తప్పేంవున్నాది? ఈయేళ ఒకడితల కొట్టే ఋణంవుండిపోతాదా? ఇక్కడ తీర్చకపోతే అక్కడ తీర్చడా? కానలేకపోనాను. యిలాగ గొంగలి పురుగులాగ అయిపోవాల!

ఆమె యిలా తల్చుకొంటూ కడుపు చెరువు చేసుకుంది. కాని ఆమెకు యీ దుఃఖంలోనూ, విచారంలోనూ మామ్మ జ్ఞప్తికి వచ్చింది ఆమె చనిపోతూ చెప్పిన మాటలు నెమరు వేసుకుంది. "అవును మామ్మ సెప్పింది నిజం! ఆడు అలాగైనాడని నాను యిలాగ యిసారించి వుంటే పిల్లలంగతేం అవుతాది? యేదిపోయినా బతకొచ్చు—దైర్నంపోతే యింకేంవున్నది?" అని మామ్మను తలచుకొని గుండె దిటంచేసుకుంది. నీలమ్మ తల్లికి మొక్కుకుంది

ప్రొద్దున్న యిరుగుపొరుగు వాళ్ళు ఆమెను ఒక వెలివేసిన మనిషిలా చూసారు. "దొంగోడి పెళ్ళం దొంగే అని" వ్యాఖ్యానించిందొక తల్లి. దీనికి తెలీకుండా యెపనాతాది. ఇలాంటోలకి అద్దెలకు అసపడి యివ్వడం యీతపరువుపోవడం" అని యింకో ముసలాడు ధ్రువమన్నాడు. "ఆడి పని అయిపోనాది; దీని సంగతి సూడండి—ముక్కూ ముఖం తెలియని వాళ్ళని యీదిలోన వుంచడం తప్పని" యింకో అమ్మ అట్టహాసం చేసింది. "ఒక్కడ్నుంచి యీ దంతటి మీదా పోలీసులు నిగా వుసారని" జేబుదొంగ నలుగురిలోను గోడబచేశాడు.

ఇవన్నీ విన్న నీలి మౌనంగా, శాంతంగా మనసులో నీలమ్మతల్లికి 'యివన్నీ పడే బలం యీతల్లీ' అని మొక్కుకుంది. యెవరేమన్నా ఆగొంతుక పెగలేదు. యెగుఱు మాటాడలేగు ఆమె ధైర్యాన్ని మల్లు అయ్యకోసం యేడుస్తూ కొంత సడలింపజేస్తున్నాడు.

పోలీసులు బలవంతాన తీసుకవెళ్ళి ఏమడిగినా యేడుపు తప్పించి ఇంకేమీ వాడివద్ద జవాబు రాలేదు. ఎన్ని విధాల ప్రయత్నించినా మల్లుని మాట్లాడించ లేకపోయారు. ఇంటికి తిరిగివచ్చి అయ్యని మరపించడానికి నీలి ఏమిచెప్పినా లాభం లేకపోయింది. ఏడుపు తగ్గాక మరుచటిరోజు తీసుకవస్తానని పోలీసులతో నీలి చెప్పి వాళ్లను పంపించింది.

అలా యేడ్చి యేడ్చి రాత్రి తొమ్మిదికి మల్లు నిద్దరపోయాడు. పిల్ల చాలాసేపటికి క్రితమే తినగానే నిద్దరపోయింది. నీలికి ఆకలి వేస్తున్నా తిండిమీద మనసు పోలేదు. అలా వాకిట కూర్చొని శూన్యంలోకి చూస్తోంది—ఇంతలో ఒక సాధువు "మాత కవలం తల్లీ" అంటూ ఇరుగు పొరుగు ఇళ్ళ

# ★ దగాపడిన తమ్ముడు ★

చూడకుండా ఆమెదగ్గరకే వచ్చాడు. నీలి లేచి వున్నదాంట్లో సగం తెచ్చి అతని దోసిట్లో వేయగానే అబాబు "చాలా కష్టంలో వున్నావమ్మా!" అన్నాడు.

"అవును బాబూ!"

"నాకు తెలుసును - నీ మొగుడు పోలీసుల చేతిలో వున్నాడు. నీగుండె రాపురాయి మీద నీటిబొట్టులా వున్నాది. నేను చెప్పినట్టు వింటేనా మీరంతా సుఖపడ్తారు. ఇది భగవంతుడి ఆజ్ఞ!" అన్నాడు.

ఆమె సవినయంగా నిల్చొని "చెప్పు బాబూ!" అన్నది.

సాధువు నేల కూర్చోగానే ఆమె అంత దూరంలో కూర్చుంది. సాధువు మెల్లగా "నీ మొగుణ్ణి కలిసినాను. పోలీసులు యేమడిగినా నాకు తెలీదను నీ కొడుకు నేరమేమీ మాటాడొదను. అలుకోటనీ తిటనీ యేమీ చెప్పకపోతే నీ మొగుడు రేపు యింతివేళకి యింటికి రాడా? వస్తాడు—వస్తాడు" అన్నాడు.

నీలి ఆసాధువువైపు ఒకసారి తేరిపార చూసి మళ్ళీ తలదించి సవినయంగా "బాబూ తమరు పెద్దలు. లోకం చూసారు. నానే లోకం సూడనేలేదు. మావూరు యీవూరే నాకళ్లతో చూసినాను. మీరిలాగ చెప్పమంటున్నారు కదా - పోలీసుకళ్ళు లోకం కళ్ళు మూసేస్తానుగాని దేవుడికళ్లు మూసేగలనా? నాయం నాయమే - అన్నాయం అన్నాయమే! అన్నాయం నాయం యెలాగ సేసీ మంటావు బాబూ? - ఈరోజు నామొగుడ్ని మొనగాడ్ని చేసి అన్నాయాన్ని నాయంసేసీ మంటావా? కొలానికి నామొగుడు ఆమొనగాడు పెంకులు పటుకోని అడుక్కోడా? మారాజు తండ్రి ఆపిస్తోలు నామొగోడుమీద పేలిస్తే ఈయాళకి అంతా సరి! అలాంటి బాబు మీదా నన్ను అబద్ధ మాడమంటున్నావు?"

ఈ మాటలతో ఆ సాధువు "కష్టపడి



పోతావు. నీకు చూసే వాడెవడూ లేడు. చిప్పపట్టుకుంటావు - ఆకలితో చచ్చిపోతావు. ఆఖరికి నీమొగుడుమాట కాదని అదికీ దొప్పటికీ దూరమైపోతావు. నీమొగుడే యిదన్నీ చెప్పమన్నాడు. నాపని నేను చేసినాను" కొత్త హెచ్చరిక స్వరంతో అనగానే నీలి ఓ క్షణం జవాబు చెప్పలేకపోయింది. మరుక్షణంలో ఆమెలోని అచంచలమైన విశ్వాసం జయించింది, నిమ్మళమైన స్వరంతో అన్నది. "బాబూ! నా మొగుడు యీవేళ చెప్పాడని అబద్ధం ఆడితే నిజం అయిపోతాదా! నిజం అనేది నిలకడమీద నా తెలుస్తాది? అలాగ నేకపోతే యీలోకం యిలాగ వుంటాదా? వర్షాలు పడ్తాయా? ఎండకాస్తాదా? సీకటి వస్తాదా? బాబూ నిన్ను నాన్ని మీలాంటి సాధులకి చెప్పిందాన్ని కాను. నానుకళ్ళలో నిప్పులు పోసుకోలేదు. కడుపులో పుట్టి యీలుకలాగ కొట్టుకోనూలేదు. అన్నిటికీ ఆ తండ్రే వున్నాడు. నాపని నాను సేసిస్తే. జరగవలసింది జరక్కమానదు" అంటూ ఆమె అక్కడనించి లేచిపోయింది.

సాధువు చంద్రయ్య చేసేదిలేక తనదారిని తను వెళ్ళిపోయేముందు "తొందర పడకు! బాగా ఆలోచించు. మొగుడు నీకు మరి నీకు దక్కడు. నివ్వు నాకు చెప్పినట్లు చెయ్యకపోతే అడిపిక తెగిపోతాది. అడుక్కుతినాలి!" ఆ రాత్రంతా నీలికి నిద్దర రాలేదు.

ఎన్నివిధాలగానో ఆలోచించుకుంటోంది. "బుద్ది వెంకన్న దొంగాడని వాడ్ని చూసి యేగిరపడే వోడే! మావంశం పౌరుషంగల వంశం - నాను పౌరుషం తోనే వస్తాను - అలా వచ్చిపోతానుగానీ దొంగతనం చెయ్యనే అన్నాడే! పత్రంలో దొంగల్ని ఒక్కడే సాహసం చెసినోటాడే- ఆ రోజురాత్రి తేషిని కాడ దొంగతనం యెందుకుసేసాడంటే బతుకుతానున్నాను మళ్లా పీక తెగినా అలాంటి పనిసేస్తానా అన్నాడే. తినడంతా పూరోను పోదుల వున్నాడు గాని ఒకడికి అన్నాయం. సెయ్య లేదు- అలాంటోడు దొంగతనం సేసినా డంటే నాను నమ్మలేను...అంతోదుకొడుకు, పుట్టిని నమ్ముకొని సెమటకార్చి బతికే వాడు దొంగతనానికి యెల్లాడని యెలాగ నమ్మతాను - కాదు- నా మొగుడెల్లలేదు. నా మొగుడికేమీ లేదు. ఆడెంత మంచోడు ఇంకో రెవరున్నారు? నానే తొందరపడి ఆ దొంగతనం యీ జేసే పాడను న్నాను—"

ఆ క్షణంలోనే యెవరో వస్తున్నట్లు అడుగులు చప్పుడయ్యింది. "అదిగో! నా మొగుడు దొంగ అయితేకదా! పోలీసులు వదిలేసినారు..." కాస్సేపు అలా యెదురు చూసింది. ఆ పాదాల చప్పుడు దూరంగా పోయింది. మరో కొద్దినిముషాలు పోయాక ఆ ముందురోజు రాత్రి జరిగిందంతా కళ్లకు కట్టింది. "ఏ లొసుగులేకపోతే పోలీసులు వస్తున్నారని దాగుడు మూతలు సేస్తా డెందుకు? మాటలకి అలాగ బేజారై పోతా డెందుకు? ఒంటిమీద దెబ్బ లెలాగుంటాయి- ఏ సాహసంలోపడి సెయ్యకపోతే పోలీసోలు వుత్తినే తీసుకెల్లిపోతారా? నవిరిలో తప్పంటే కదా తీసికెళ్ళినాడు - సేసాడు. సెయ్యకపోతే అబద్ధం ఆడమని ఆసాదు నేతకబురెందు కెట్టాడు?. సేసినాడు - నాను సెపే నా మొగుడికి యేం అయిపోతాదో! ఆడికంటే యీనోకోన నాకెవరున్నారు! ఆడికోసం యేమైనా సేసాను. ఆడుబతికేల ఆడే నాకు కావాల..." ఇలా కొంతసేపు లోలోపలే అనుకున్నది. తరవాత తన విశ్వాసానికి, యీ అభిమానానికి ఘర్షణ పడ్డది. "దేవుడ ధ్యానుకు అనుకుంది" ఏ అబద్ధాలాడో నా మొగుణ్ణి తెచ్చుకుంటాను. నా మొగుడు సేసినదానికి శిక్షపడకండా చేస్తే మాకు జరుగుబాటు అవుతాదా! నాకు మొగుడొతాడా! నిజం నిజమే - అబద్ధం అబద్ధమే! నాయం నిలుస్తాదిగానీ అన్నాయం నిలవదు నాకెందుకు యిలాగ అయిపోనాను! నాను నిజమే సెప్పతాను. దేముడు నేడా!... నామొగుడెవుడనీ - నా బతుకేమవనీ, నాపిల్ల లేమవనీ...నాను నిజమే సెప్పతాను...నాను ఆకలితో పోతున్నా నాకు యేడుపొస్తే సంతోసంమీద వస్తాది. దుఃఖంమీద రాదు! నాను అంతా నిజమే సెప్పతాను-" అని నిరాదించుకుంది.

ఆమరుసటిరోజు పోలీసులువచ్చి ఆమెను, మల్లును స్టేషనుకు తీసుకవెళ్లారు. మల్లు యెదరగా ఆరుగురు మనుషులను నిలబెట్టి ఆ రాత్రి పులయ్యతో యెవరు వచ్చారో పోల్చమని చెప్పారు. మల్లు కోపంగా నేను చెప్ప నన్నాడు. ఈ పోలీసులంతా కలిసి తన అయ్యను తీసుకెళ్ళారని వాడి బాధ. నీలి కొడుకును బ్రతిమాలింది. ఎన్నివిధాలుగానో నచ్చచెప్పితే యిందులో యెవరూ లేరని తేలింది. ఆ యినస్పెక్టరు యిప్పుడు తన తెలివితేటలను ఉపయోగించవలసి వచ్చింది. ఒక బాకో తను వూది మల్లు చేతికి యిచ్చాడు. ఏదీ నివ్వు వూదగలవా అన్నాడు. మల్లు అంతకంటె బాగా వూదాడు. బిస్కట్ నాలా నీవు తినగలవా అని అంటే అంతకంటే గబగబ పరుపుపరుపుమని నమిలేసాడు. తరువాత "మానావా! మీ అయ్య యేం పనిచేసాడో? మీ అయ్యదొంగ కాడు...

(55-వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

[16-7-58 మొదలు 22-7-58 వరకు]

## గ్రహస్థితి

| | | | |
|---|---|---|---|
| | కుజ | | రవి |
| | 16 తేదీని రవి కర్కాటకమున ప్రవేశించును. 20 తేదీని బుధుడు సింహములో ప్రవేశించును. పుష్యమి కార్తె మొదలు. 21 తేదిని గురుడు తులలో ప్రవేశించును. కావేరీ పుష్కరము. మిధున, కర్కాటక, సింహ, కన్యలలో చంద్రుడు. | | బు |
| | శ | రా | గు |

### * అశ్విని [చూ, చే, చో, లా] *

ఈ వారము మీకు యోగప్రదముగా వుంటుంది. గత వారము పూర్తికాకుండా వుండిపోయిన పనులు లాభదాయకముగా ముగుస్తాయి. కవితాగోష్ఠి, సంగీత సభలవంటి వినోదాలలో పాల్గొంటారు. దక్షిణదిక్కున వున్న దూరస్థులైన ఆత్మీయుల క్షేమము తెలియుటచే ఆందోళన తీరుతుంది నీటిపై ప్రయాణము చేయవలసియుంటుంది బంధువులతో శుభకార్యాలోచన, దధిక్షీర మధుర పదార్థములతో కూడిన సుభోజనము చేస్తారు. పంచదార, బెల్లము, ప్రత్తి, దూది, నూలు, బట్టలు, బియ్యము, వెండి వస్తువులకు మేలు కాలము. 16, 17 తేమలని కార్యక్రమము. 18 కుశలవార్త. 19 కార్యలాభము. 20 అస్థిమితము. 21, 22 విందు, వినోదము విద్యార్థులకు మంచికాలము.

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము మీకు యోగదాయకము. తలపెట్టిన పనులు ఫలిస్తాయి. అనుకున్నదానికన్నా ఆదాయము ఎక్కువగా వుంటుంది. పరోపకారము చేసి కీర్తిని గొంటారు. పుణ్యకార్యాలు చేసారు. ఉద్యోగస్థులకు యోగకాలము. వాహనయోగము కలుగుతుంది. బంగారము, నవరత్నములవంటి విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. 16, 17 తేమలని కార్యక్రమము. 18, 19 ధనలాభము, పరోపకారము, వాహనయోగము. 20 నిలకడలేనిస్థితి. 21, 22 కార్యలాభము, విందు, వినోదము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలు కాలము. విద్యార్థులు చురుకుగా చదువుకుంటారు.

### * కృత్తిక [అ, ఈ, ఉ, ఏ] *

ఈ వారము మీరు ఆశించినంత సహాయము కలుగదు. యత్నకార్యములు ఫలించక అనవసరముగా ధనవ్యయ మవుతుంది. కార్యభారము ఎక్కువగుటచే త్రిప్పట, అకాలభోజనమువల్ల అజీర్ణము, కళ్లమంటలు, తలపోటువంటి అనారోగ్య సూచనలు కనబడగానే ఔషధచికిత్సవల్ల మేలు. ఉద్యోగస్థులకు ఒత్తిడి ఎక్కువైనా అనుకూల స్థలమునకు బదిలీ కావచ్చును. వ్యాపారస్థులకు లాభము తక్కువ, ఖర్చులు ఎక్కువ విద్యార్థులకు ఆశాభంగము 16. 17 యత్నకార్యములకు విఘ్నములు, ధనవ్యయము. 18, 19 కార్యభారము, త్రిప్పట. 20 అనారోగ్య సూచనలు. 21, 22 క్రొత్తవారితో పరిచయము, ధనలాభము. కొంత కార్యానుకూలత. రాజకీయవాదులకు మేలు కాలము.

## బి. నరసింగరావు

### * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈ వారము తలపెట్టిన పనులు ధనలోపమువల్ల జరగవు. స్నేహితులనుకొని నమ్మినవారు సమయమునకు సహాయము చేయరు మీరింక ఈ పని అవదనే నిరాశ కలిగేక అనుకోకుండా కలుసుకున్న మిత్రుని సహాయమువల్ల కార్యలాభము కలుగుతుంది. ఉద్యోగస్థులకు వనపర్వతప్రాంతములకు బదిలీఅయే సూచనలున్నవి. రహస్యభేదనకు నియమింపబడుతారు. వర్తకులకు వారాంతమున లాభము 16, 17 కార్య యత్నములు. 20 ఆశాభంగము, త్రిప్పట శ్రమ 21, 22 అనుకోని మిత్రసహాయము, కార్యలాభము విదేశీయులతో పరిచయము. వింత వస్తుసంపాదన. ఇంట్లో వారిలో కొందరి అనారోగ్యముచే అశాంతి.

### * మృగశిర [వే, వో, కా, కి] *

ఈ వారము మీరు ఎవరి సహాయమును కోరి పనులు చేదామనుకున్నారో అతనివల్లనే మీకు ఆంటకములు కలుగుతవి. ధనాభావము ఎక్కువగా వుంటుంది. ఆధ్యాత్మికచింత కలవారగుటవల్ల ఈశ్వర కృపచే అన్ని కష్టములను గడిచి క్రమేణా కార్యసిద్ధి పొందుతారు. ఇంట్లో వారి ఆరోగ్యము ఆందోళన కలుగజేస్తుంది. ఉద్యోగస్థులకు ఒత్తిడి. వ్యాపారస్థులకు నిరాశ విద్యార్థులకు అనుకున్న స్థానములు దొరకవు. 16, 17 కార్యయత్నములకు ఆటంకములు, నిలకడలేని సితి. 18, 19 సాధుసాంగత్యము. 20 ధనాభావము, శ్రమ, ఆత్మీయుల ఆరోగ్యము చెడుటవల్ల కలవరము. 21, 22 నష్టద్రవ్యలాభము, కార్యసిద్ధి, ప్రయాణము.

### * ఆరుద్ర [కూ, ఘ, జ, ఛ] *

ఈ వారము అనుకున్నట్టుగా డబ్బు రాకపోగా, ఖర్చులు హెచ్చుగుటచే మనోవ్యధ, వృధాగా త్రిప్పట కలుగుతవి. అనుకున్న పనులు కాకపోవుటయు, ఇతరులకు చేయదలచుకున్న ఉపకారము చేయలేకపోవుట జరుగును. కోర్టు వ్యవహారములు అనుకూలముగా వుంటవి. ఇచ్చి పుచ్చుకోవడల్ల పేచీలు వచ్చి వివాదపడతారు. ఉద్యోగస్థులకు కార్యభారము ఎక్కువ క్రొత్త సమస్యలు కలుగుతవి. భార్య అనారోగ్యముచే ఆందోళన. 16, 17 ఏమి చేయుటకు తోచని అవస. 18, 19 కార్యభారము 20 నిందలు, విరోధము, ఆరోగ్యచింత. 21, 22 కార్యలాభము. విద్యార్థులకు ప్రతికూలము.

### * పునర్వసు [కే, కో, హా, హీ] *

ఈ వారము అన్ని కార్యములకు చిక్కులు కలుగుతవి ధనలేమిచే ఇబ్బంది. ఆత్మీయులకు సహాయానికి పూనుకొని చేయలేక మాటపడి మనోవ్యధ పొందుతారు. యంత్రములవల్లగాని వాహనములవల్లగాని కలిగే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయన శాస్త్రజ్ఞులకు, యంత్రములు నడుపు నిపుణులకు, గనుల యజమానులకు కష్టముతో కూడిన యోగము. ఉద్యోగస్థులకు చేయుచున్న ఉద్యోగము నుండి వేరొకదాని మార్పుగాని, లేక బదిలీగాని అగును. 16, 17 కార్యరంగములో ఆటంకములు. 18, 19 కార్యానుకూలము. 20 ప్రమాద సూచన. 21, 22 సోదర సహాయము, కార్యలాభము.

### * పుష్యమి [హూ, హే, హో, డా] *

ఈ వారము మీకు యోగప్రదము. గత వారము కలిగిన ఆటంకములు తొలగి, అవకుండా నిలిచిపోయిన పనులు మీ యుక్తి

 

# నక్షత్రఫలితాలు



వల్లను, అధికారుల ఆదరణవల్లను అనుకూలముగా సాధించుతారు. ఆదాయము వృద్ధి పొందుతుంది. కవులు కొత్తరచనలు ప్రారంభిస్తారు. విద్యార్థులకు నూతనోత్సాహము కలుగుతుంది. 16, 17 కార్యక్రమాలోచన. 18, 19 అనుకూల వాతావరణ. 20 చాంచల్యము. 21, 22 ధనలాభము, కార్యసాధన, క్షేమవార్త. కవులకు, శిల్పులకు, కళాకారులకు యోగకాలము. గణితశాస్త్ర జ్యోతిష శాస్త్ర ప్రసంగములు.

*** ఆశ్లేష [డి, డూ, డే, డో] ***

ఈ వారము ప్రభు సన్మానము, కీర్తి ధనలాభము కలుగుతవి. బిడ్డల యోగక్షేమము వల్ల ఆనందము పొందుతారు. విద్వద్గోష్ఠి, శాస్త్రగ్రంథములను చదువుటవల్లనూ విజ్ఞానము వృద్ధిపొందుతుంది. దావాలు మీ పరముగా తీర్పు అవుతవి ఉద్యోగస్తులకు ఆదాయము తోబాటు హోదాకూడా పెరుగుతుంది. వ్యాపారస్తులకు లాభయోగము. న్యాయస్థానపు టుద్యోగులకు, ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు మేలుకాలము. 18, 19 సన్మానము, కీర్తి, ధనలాభము. 21, 22 పండితగోష్ఠి, విజ్ఞానార్జన. పుత్రప్రాప్తి కలిగే సూచన.

*** మఖ [మా, మీ, మూ, మే] ***

ఈ వారము, మీ యత్నములలో జయము కలుగుతుంది. ధనాదాయము బాగుంటుంది. కోరు వ్యవహారములు మీ పరముగా తీర్పు అవుతవి. మాతృవర్గమువారి సహాయము కలుగుతుంది. ఉద్యోగసులకు అనుకూలము. ద్రవపదార్థ వస్తువులు, బెల్లము, పంచదార, నూలు, బట్టలు, వెండి, బియ్యము వర్తకులకు లాభయోగము. విద్యార్థులకు మంచికాలము. కవులకు, గాయకులకు, కళాకారులకు యోగకాలము. 16, 17 నిలకడలేని స్థితి. నీటిపై ప్రయాణము. 18, 19 ధనయోగము. 20 చాంచల్యము. 21, 22 కార్యసిద్ధి విందు వినోదము.

*** పూర్వఫల్గుణి (పుబ్బ) ***
**మో, టా, టీ, టూ**

ఈ వారము మీరు ఇష్టవస్తు లాభమును పొందుతారు. నూతన కార్య ప్రయత్నాలు చేస్తారు. సాంఘిక సేవచేసి కీర్తిని పొందుతారు. మీకు వాహనయోగము మీ భార్యకు అలంకార ప్రాప్తి కలుగుతవి. ఉద్యోగస్తులకు హోదా వృద్ధి అవుతుంది. విద్యార్థులకు అనుకూలము. నూలు, బట్టలు, బంగారము, నవరత్నములువంటి సరుకుల క్రయ విక్రయములలో వర్తకులు లాభము పొందుతారు. కవులకు, గాయకులకు, కళాకారులకు నటులకు యోగకాలము. 18, 19 ఇష్టవస్తు లాభము, ధనయోగము. 21, 22 పుణ్య కార్యాచరణ, కీర్తి.

*** ఉత్తరఫల్గుణి (ఉత్తర) ***
**[టే, టో, పా, పీ]**

ఈ వారము ఉద్యోగ ప్రయత్నములో అధికారులను కలుసుకొని కార్యసిద్ధిని పొందుతారు. పరాక్రమ కార్యములను చేసి ఘనత పొందుతారు. ప్రభుత్వ కార్యభారము ఎక్కువగుటవల్ల, త్రిప్పటచేతను శరీరములో వేడిఎక్కువై బద్ధకం, కడుపుమంట, తలపోటువంటి అనారోగ్య సూచనలు కనబడగానే ఔషధ చికిత్సను పొందుట మేలు చేస్తుంది. కోర్టు వ్యవహారములు వాయిదా పడుతవి. పితృవర్గమునుండి ధనలాభము కలుగుతుంది. 18, 19 అధికారులతో పరిచయము కార్యలాభము 20 అనారోగ్యము. 21, 22 ప్రయాణము, వింతమాటలు వినుట, పితృవర్గ సహాయము.

*** హస్త [పూ, ష, ణ, ఠ] ***

ఈ వారము మీకూ ధనవ్యయము ఎక్కువ. మీకుగాని మీ పిల్లలకుగాని కలిగే అనారోగ్యమునకు ఔషధ చికిత్స పొందడమే కాకుండా రాహువునకు శాంతి చేయించుట మేలు. రహస్యములను కనిపెట్టుటలో నిపుణులగుటవల్ల మీరు ప్రభుత్వము చే అంగుకు నియోగించబడుతారు ఉద్యోగసులకు అనవసర ప్రసంగములవల్ల అధికారులకు ఆగ్రహము కలిగి పర్వత ప్రదేశములకు బదిలీ చేసే సూచన లున్నది. వర్తకులకు క్రయ విక్రయములలో దగా కలుగుతుంది. దేశాటనము చేయుటలో అన్యదేశీయులను కలుసుకొని విచిత్రవస్తుసంపాదన చేస్తారు. విద్యార్థులకు ఆశాభంగము. 16, 17 కార్య ప్రయత్నములు, ఆటంకములు, ప్రయాణము. 18, $1_6$ కొంతవరకూ అనుకూల్యము 20 దగా, ధనలోపము. 21, 22 విదేశీయులపరిచయము, విచిత్రవస్తు సంపాదన.

***చిత్త [పే, పో, రా, రి]***

ఈ వారము గృహమందున్న అపూల అనారోగ్యము వల్ల మనోవ్యథ. బంధువుల రాకపోకలవల్ల, ధనాభావమువల్ల ఇబ్బంది. చేసే ప్రయత్నములకు ఆటంకములు. వాయవ్యదిక్కుకు ప్రయాణమువల్ల నష్టద్రవ్య లాభము, విచిత్ర వస్తువును చూచుట జరుగును. దావాలలో అనుకూ పరిష్కారము కలుగుతుంది. సాధు సాంగత్యమువల్ల ఆధ్యాత్మిక చింతచే శాంతిని పొందుతారు. ఈశ్వరాను గ్రహము వల్ల కార్యలాభము. 18, 19 ప్రయత్నములు ప్రయాణము 20 ఆటంకములు 21, 22 నష్ట ద్రవ్యలాభము.

**—ధరలు:—**

నూలు, వస్త్రములు : మందముగా వుండును,

నూనె దినుసులు: నిలబాటుగా వుండును.

చింతపండు, మిరప: సమస్థాయిలో వుండును.

పంచదార, బెల్లము: కొంచెము చురుకగును.

ఆహార ధాన్యములు : మందముగా వుండును.

పప్పుదినుసులు : నిలబాటుగా వుండును.

వెండి బంగారము: మందముగును.

ప్రస్యానుకూలముగా అంతటా వర్షించును

* * *

జన్మనక్షత్రము బట్టిగాని, జన్మనక్షత్రము తెలుగనివారు నామనక్షత్రము (వారి వారి పేర ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు మృగశిరయును, హృషీకేశుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

*** స్వాతి [రూ, రే, రో, తా] ***

ఈ వారము యత్న కార్యములు ఫలించక పోగా కార్యభారముతో పాటు ఖర్చులు కూడా ఎక్కువవుతవి. దావాలలో గెలుపు కలుగుతుంది. వ్యర్థముగా తిరుగుట, సజ్జనులతో విరోధము కలుగుతవి. ఉద్యోగస్తులకు బదిలీ అగుటగాని, శెలవు పెట్టి వృథాగా కాలము గడుపుటగాని జరుగుతుంది కొర్రలు రాగులు, సజ్జలువంటి అపరదినుసులు, ఉప్పు, నువ్వులు, నూనెదినుసుల వ్యాపారస్తులకు లాభయోగము. విద్యార్థులకు ఆశాభంగము. 16, 17 వృథాగా తగాదాలు. 18, 19 కార్య ప్రయత్నములు. 20 ఆశాభంగము, బదిలీలేక శెలవుపెట్టుట. 21, 22 కొంత వరకూ అనుకూలము.

*** విశాఖ [తీ, తూ, తే, తో]***

మీరు పట్టుదలగలవారు కనుక కార్యాచరణలో కలిగే ఆటంకములను ధైర్యముతో ఎదుర్కొని కార్యసిద్ధిని పొందుతారు. స్థిరాస్తులవ్యవహారములో ప్రయాణము చేయవలసి వస్తుంది. ధనలోపమువల్ల అప్పు చేస్తారు

యంత్రములవల్ల గాని, వాడిపనిముట్లవల్ల గాని అజాగ్రత్తములకు దెబ్బలుతగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును యంత్రములు నడుపు నిపుణులకు, ఎరువుల వ్యాపారస్తులకూ, రసాయనిక శాస్త్రజ్ఞులకూ, గనుల యజమానులకు కష్టముతో కూడిన లాభ యోగము ఇంజనీరింగుశాఖ ఉద్యోగస్తులకు మేలుకాలము విద్యార్థులకు మంచిరోజులు కావు 16, 17 కార్యప్రయత్నము, ఆటంకములు, నిందలు, విరోధము 18, 19 సోదర సహాయము 20 ప్రమాదసూచన 21, 22 కార్యలాభము.

***అనూరాధ [నా, నీ, నూ, నే]***

గతవారము కలిగిన కష్టములు గడిచి నష్టమును పూడదీసుకుంటారు యుక్తిగా మాట్లాడుటవల్ల పెద్దల దయను సంపాదించి కీర్తి గౌరవము పొందుతారు కుటుంబములో సుఖ సంతోషములు నిండివుంటాయి ఉద్యోగస్తులకు అధికారుల ఆదరణ లభిస్తుంది వ్యాపారస్తులకు లాభము కవులకు సన్మానముకలుగుతుంది గణిత, జ్యోతిష విద్యాగోష్ఠిలో పాల్గొంటారు విద్యార్థులకు నూతనోత్సాహము కలుగుతుంది కవులకు, చిత్రకారులకు నటీనటులకూ యోగకాలము వారమంతా యోగము కలుగుతుంది

***జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]***

ఈ వారము మీకు భాగ్యవృద్ధి అవుతుంది యత్న కార్యములు ఫలిస్తాయి కావలసిన మనుష్య సహాయము, ధన సహాయము ఏమీ శ్రమపడకుండానే లభిస్తాయి కోర్టు వ్యవహారములలో జయము పుత్రవిషయములవల్ల సంతోషము ఉద్యోగస్తులకూ వున్నచోటగాని యితరత్రాగాని అభివృద్ధి కలిగే మార్పులు వస్తవి విద్యార్థులు ఉత్సాహముతో కొత్త సంగతులు నేర్చుకుంటారు పండితగోష్ఠివల్ల విజ్ఞానము ఎక్కువవుతుంది పండితులకు, ఉపాధ్యాయులకు, న్యాయస్థానములలో ఉద్యోగస్తులకు మేలుకాలము 20 న చెవిపోటు, మనోవ్యధ తప్పించి తక్కిన రోజులు యోగప్రదముగా వుంటవి.

*** మూల [యే, యో, బా, బీ] ***

ఈ వారము మీకు యోగప్రదముగా వుంటుంది. గతవారము పూర్తికావుండా నిలిచిపోయిన పనులు ఈ వారము లాభకరముగా ముగుస్తాయి నీటిపైని ప్రయాణము చేయవలసి వస్తుంది ఉద్యోగస్తులకు అధికారుల ఆదరణ లభిస్తుంది. కవితాగోష్ఠి, గానసభలవంటి వినోదాల్లో బంధుమిత్రులతో పాల్గొని మృష్టాన్న భోజనము చేస్తారు ఇంట్లో వారి ఆరోగ్యము బాగుపడుతుంది. పంచదార, బెల్లము, ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, బియ్యము వర్తకులకు లాభము కవులకు, గాయకులకు, కళాకారులకు యోగము 16, 17 నిలకడలేని స్థితి. 20 అధిక ఖర్చులు, చాంచల్యము. 21, 22 ధనలాభము మొదలైన శుభయోగములు

***పూర్వాషాఢ [బూ, ధ, భా, డా]***

ఈ వారము ఉద్యోగములో ప్రమోషను వచ్చే సూచనలున్నవి ఆదాయము ఎక్కువవుతుంది తలపెట్టినపనులు లాభదాయకముగా వుంటవి పరోపకారముచేసి కీర్తి పొందుతారు దావాలు మీ పరముగా తీర్పు అవుతవి వర్తకులకు అనుకున్నకంటేఎక్కువ లాభము కలుగుతుంది దూరప్రయాణము చేయవలసివుంటుంది నూతన గ్రంథరచనకు కవులు ప్రారంభిస్తారు విద్యార్థులకు మేలు కాలము కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము 20 కలతలు, అస్థిమితము 21, 22 ప్రమోషను, విందు, వినోదము

***ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]***

ఈ వారము డబ్బుకు ఇబ్బందిగా వుంటుంది రాజకీయములలో తిరగవలసివస్తుంది. పిత్రువర్గమునుండి సహాయముకలిగేలోపున యత్నకార్యములకు ఆటంకములు, త్రిప్పట, శరీరములో ఉష్ణాధిక్యతచే అనారోగ్యము కలుగుతవి, వెంటనే శ్రద్ధవహించి ఔషధ చికిత్స పొందడము మేలు అపర దినుసులు, గోధుమవంటి ఆహారధాన్యములు, అటవిక సరుకుల వర్తకులకు లాభయోగము 20 త్రిప్పట, ఆటంకములు, అనారోగ్యము 21,22 పిత్రువర్గసహాయము, కార్యలాభము.

***శ్రవణము [జూ, జే, జో, ఘా]***

ఈ వారము ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడిచే పర్వతప్రాంతములకుగాని, అరణ్యప్రదేశములకూగాని బదిలీ అవుటగాని శెలవు పెట్టి వ్యర్థముగా కాలము గడుపుటగాని జరుగుతవి మొదట్లో యేమిచేసిందికితోచక వ్యాపారస్తులకు ఆందోళనగావున్నా వారాంతమునకు కార్యలాభము కలుగుతుంది. రహస్యభేదనకు ప్రభుత్వముచే నియోగితులవుతారు ఇంట్లోవున్నవారికి కలిగిన అనారోగ్యము ఆందోళన కలిగిస్తుంది. 16, 17 నిశ్చయములేని కార్యక్రమము. 20 బదిలీ లేక శెలవు పెట్టుట, ఆరోగ్యచింత 21, 22 మిత్రసహాయము, కార్యలాభము

*** ధనిష్ఠ [గా, గీ, గూ గే] ***

గతవారమువలె ఈ వారముకూడా మీకు యోగప్రదముగా వుండదు ఏపనిచేసిందికి మనస్సునకు ఆందోళనగా వుంటుంది ఈశ్వర కృపవల్ల వారాంతమునకు మీ ప్రయత్నములు సఫలమవుతాయి ఇంట్లోవారి శరీర పీడవల్ల కలవరపాటు కలుగుతుంది వర్తకులకు లాభము తక్కువగుటేకాక దగాపడతారు. ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడి. విద్యార్థులకు బద్ధకముచే చదువు సాగదు 16, 17 నిస్సహాయస్థితి 18, 19 ప్రయాణము. 20 ఆటంకములు, చాంచల్యము. 21, 22 సాధుసాంగత్యము, దివ్యజ్ఞానవృద్ధి, శాంతి, కార్యలాభము

*** శతభిషం [గో, సా, సీ, సూ] ***

ఈ వారమంతా కార్యభారముతో నలిగిపోతారు. కష్టపడినను ఫలములేక వృధాగా వివాదములకు లోనౌతారు దావాలు మీ పరము తీర్పు అవుతవి ఇచ్చిపుచ్చుకోనే టప్పుడుదుష్టస్త్రీలతో పేచీలువచ్చిమనోవ్యధ కలుగుతుంది భార్యఆరోగ్యము సరిగా వుండనందున ఆందోళన 16, 17 కార్యభారము, త్రిప్పట 18, 19 దావాలలో జయము. 20 అనారోగ్య చింత 21, 22 ధనలాభము, కార్యసిద్ధి మినుములు, నువ్వులు, నూనెదినుసుల వర్తకులకు వారమంతా లాభము

***పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]***

ఈ వారము డబ్బు ఇబ్బంది ఎక్కువగుటచే అప్పు చేయవలసి వస్తుంది యత్న కార్యములకు ఆటంకములు కలిగినా పట్టుదలతో ప్రయత్నించి తుదకు కార్యలాభమును పొందుతారు యంత్రములవల్లగాని, అగ్నివల్లగాని కలిగే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును లోహపు సామానుల వర్తకులకు, గనుల యజమానులకు కష్టముతో కూడిన లాభము ఇంజనీరింగు, పోలీసు శాఖలలో ఉద్యోగులకు మేలుకాలము. 16, 17 కార్యక్రమాలోచన, ఆటంకములు 18, 19 అప్పు చేయుట, కార్యలాభము 20 ప్రమాదము. 21, 22 సోదర సహాయము, ధనలాభము

*** ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా] ***

ఈ వారము మీకు యోగప్రదము శుభసంతోష వార్తలు వినుట, యత్న కార్యములు ఫలించుట, నూతనులతో పరిచయము, ధనలాభము వంటి యోగములు కలుగుతవి, గణితశాస్త్ర జ్యోతిష విద్యాగోష్ఠి చేస్తారు. డాక్టర్లకూ, కవులకు, శిల్పులకు, నటీనటులకు యోగకాలము, 18, 19 కార్యలాభము, శుభవార్త. 20 ప్రయాణము 21, 22 ధనలాభము, పండితగోష్ఠి

*** రేవతి [దే, దో, చా, చీ] ***

ఈ వారము అనుకున్నట్లుగా కార్యలాభమును పొందుతారు. ధనలాభము యెక్కువగ ఉండుటచేతను భాగ్యవృద్ధి అవుతుంది ఇంట్లో ఉన్నవారి అనారోగ్యము తొలగిపోతుంది పిల్లల యోగక్షేమ అభివృద్ధికరమైన ఏర్పాట్లు చేస్తారు. ఉద్యోగులకు ప్రమోషను, వర్తకులకు లాభముకలుగుతుంది. న్యాయవాదులకు, పండితులకు, ఉపాధ్యాయులకు, న్యాయస్థాన ఉద్యోగులకు మేలు కాలము 18, 19 కార్యలాభము 20 ప్రయాణము 21, 22 ధనలాభము పండితగోష్ఠి, ఉద్యోగస్తులకు ప్రమోషను విద్యార్థులు నూతన సంగతులు నేర్చుకుంటారు





# "సంస్కారం అంటే..."

**కె. కృష్ణవేణి (మద్రాసు)**

"ప్రొద్దస్తమానమూ పుస్తకాలు ముందేసుకూచుంటే ఎలా నే? కాస్త పనీ పాటా నేర్చుకోవద్దూ! నీ ఈడువాళ్లు ఎంతెంత సంసారాలు చక్కదిద్దుకొంటున్నారు? నేను నీకంటే ఎక్కువే చదువుకున్నాను. అంతమాత్రంచేత ఏ పనీ మట్టుకో వదలిలేదు!" అంటోంది ఆడంబరము లేకుండా ఆత్మాభిమానమూ భర్తతో అన్యోన్యంగా మెలగటం నేర్చుకున్న మంగమ్మ.

"నీది అత్తగారి సాధింపులా వుంది. ఎప్పుడో అత్తవారింటికెళ్లి అన్నిటికీ తలొగ్గటం ఒక ఎత్తా? నీదగ్గర యిన్నీ పడడం ఒక ఎత్తాను" సమాధానము చెప్పింది చదువుకున్న కూతురు సరళ.

"పనీ పాటా నేర్చుకున్నవాళ్లెప్పుడూ పాడయిపోరు. వచ్చిన ప్రతివిద్యా ఓ కాలాన ఉపయోగిస్తుంది. ఒళ్లువంచటంచేతగానివాళ్లు ఒట్టి పిరికివాళ్లు. చదువురానివాళ్లు సంస్కారములేక మాట్లాడితే సర్దుకుపోవచ్చుగాని, అన్నీ తెలిసి అతితెలివికిపోయేవాళ్లనేం చేస్తాం గనక?" అంది మంగమ్మ.

"తెల్లవారిందా! తల్లీకూతుళ్లు పోరుకు? ఎవరి కర్మాన వాళ్ళు పోతారు. పొద్దస్తమానమూ సాధిస్తే నేర్చుకుంటారా! వాళ్లకై వాళ్లి బుర్రలో పుట్టాలిగాని" అన్నారు అప్పుడే లోపలికొచ్చిన సుబ్బారావుగారు.

"సగం-అది చెప్పినమాట వినకుండా చేస్తున్నారు మీరు! ఏ పనీ వంట పట్టకపోతే ఎలాగండీ!" అంది కలిగిన కోపాన్ని కాస్త సర్దుకుంటూ మంగమ్మ.

"అయితే అస్తమానా పోట్లాడుకుంటూ ఉండండి, మాకేం మధ్య!" అని అక్కణ్ణించి వెళ్ళిపోయారు సుబ్బారావుగారు కోపంతో.

* * *

సుబ్బారావుగారి కుటుంబంలో అందరూ ఆడా మొగా-బాగా చదువూ, సంస్కారమూ ఉన్నవాళ్ళే. సుబ్బారావుగారి తల్లి సుభద్రమ్మగారు స్కూలు టీచరు ఉద్యోగముచేసి మానేసింది. ఆయన చెల్లెళ్లు అంతో యింతో చదువుకున్నవాళ్లే. అయితే అందరికీ సకాలంలో వివాహాలుచేసి పంపించారు. అత్తవారిళ్ళకు అందరూ ఉద్యోగము చేస్తున్నారా అంటే అది వాళ్ళ సౌకర్యాసౌకర్యాలమీద ఆధారపడిఉంది. మంగమ్మ కూడా మాటవరసకి, బి. ఏ. పాసయింది. కాపురానికొచ్చిన కొత్తల్లో కాలక్షేపం కోసం, అత్తగారు, మామగారు భర్తా వొప్పుదలమీద ఊళ్ళో మహిళాసభలో ఉద్యోగం చేసింది. తరువాత పిల్లా జెల్లా బయలేరాక మానుకున్నా-ఆసభతో ఆవిడకున్న సంబంధం వొదిలిపెట్టలేదు. చేతనయినంత సేవ చేస్తూనే ఉన్నది. అంతమాత్రంచేత కుటుంబ వ్యవహారాలు కుంటుబడడంగాని కుటుంబంలో యితరుల కిబ్బందిగాని ఏమీ కలగలేదు, ఆవిడ కలిగించనూలేదు.

చదువుకున్న స్త్రీలు సంసారాలు చక్కదిద్దుకోలేరని కొందరూ, చదువురానివారు, సంసారాలు కొన్ని సందర్భాల్లో దుఃఖమయం చేస్తారని మరికొందరు, అంటూవుండడం ఈమధ్య మరీజాస్తీ అయిపోయింది. అందుకు తగ్గట్టు అరంపరంలేని ఇతివృత్తాలు సృష్టించి, వాళ్ళ వాదాన్ని బలపర్చుకోడానికి చేస్తున్న ప్రయత్నమూ కనిపిస్తూనే ఉంది. అది ఎంత మాత్రమూ విశ్వసించతగ్గ విషయంకాదు.

చదువున్నా, లేకపోయినా, మంచి సంస్కారం వున్న వాళ్ళను అనేక మందిని మనం చూస్తున్నాం. అలాగే, చదువుకున్న వాళ్ళలోని కుసంస్కారాన్నీ చూస్తున్నాం. మరి చదువులేని వాళ్ళతో వుండాల్సిన ఈ కుసంస్కారం చదువుకున్న వాళ్ళకెలా వచ్చింది? ఇది పైరీతిగా వాదించే వాళ్ల కుసంస్కారమే అయి ఉండాలి!

సంస్కారమన్నది చదువుకుంటేనే వచ్చేదికాదు. అది జన్మతః వచ్చే గొప్ప లక్షణాల్లో ఒకటి! అది అందరికీ అలవడదు. ఆ మాటను మరుగు పర్చడానికే పైవాదం లేవదిస్తారు. చదువుకున్న మంగమ్మ సంసార విషయాల్లో చక్కదిద్దుకోని దేముంది? అదే ఆమె కూతురు చదువుండీ నేర్చుకున్నది కనిపించదు. ఆమె ఎంత నెత్తిన నోరు పెట్టుకుని బోధించినా, సరళ ఏమీ వినడంలేదు. తీరా కాపురానికి వెళ్ళిన తర్వాత అప్పుడు అన్నివిధాలా ఇబ్బంది పడుతుంది. అదే కన్నతల్లి చెప్పితే వినక ఈ పిల్ల అత్తగారు అదలిస్తేగాని చెయ్యదు. అదే తల్లి, ప్రేమతో చెప్పినప్పుడు విని నేర్చుకుంటే ఈ బాధుండదు గదా?

అలా గట్టిగా చెప్పి చేయించిన అత్తగారు, ఏ పూతనగానో శూర్పణఖగానో కనిపిస్తుంది. దాంతో అత్తాకోడళ్ళ మధ్య అంతులేని వైషమ్యాలు పెరగమొదలెడతాయి.

* * *

"ఏమే అగిన్నిమీద మూత అలాతీసి పారేస్తే ఎలా? ఏమన్నా రాలవూ?" అని ఏ అమ్మో, ఏ అక్కో అంటే ఒకలాగూ, అదే ఏ అత్తగారో, ఆడబడుచో అంటే ఇంకోలాగూ అర్థం చేసుకుని అత్తగారు, ఆడబడుచులు అస్తమానం ఏదంకో సాధిస్తూనే వుంటారు. "ఈ దిక్కుమాలిన సంసారం నే చేయలేనమ్మా!" అనుకునే ఆడవాళ్లూ కనిపిస్తారు.

అంతేగాక, ప్రతి చిన్న విషయం దగ్గర్నుంచి, పెద్ద విషయందాకా సహృద

యంతో ఆలోచిస్తే-కుటుంబంలోని ఎవరు గాని దుమంగా ప్రవర్తించరన్నది గోచరిస్తుంది అలాంటి సందర్భాల్లో భార్యను, భర్త సర్దుకుపొమ్మన్నా, తల్లినీ, చెల్లెళ్ళనూ భర్త వెనకేసుకు వస్తున్నాడని భార్య, ఏ తల్లితోనో, తోబుట్టువులతోనో చెప్పిన అతను, భార్యను వెనకేసు కొస్తున్నాడన్న నిందకు పాత్రుడౌతున్నాడు

ఇలాంటి సందర్భాల్లో చదువుకున్న స్త్రీలూ ఉన్నారు, చదువురాని వారూ ఉన్నారు అయితే చదువుకున్నవారు తమ సంస్కారాన్ని సద్వినియోగం చేసి భిన్న ప్రకృతుల కలయిక అయిన కుటుంబాల్లో వచ్చే ఒడుదుడుకుల్ని సర్దుకుని సాక్షిగా కాలం గడవడానికెంత వరకు తోడ్పడుతున్నారు అన్నదే ప్రశ్న

చదువురాని భార్య చాకలిపద్దు దగ్గర్నుంచీ భర్తమీద ఆధారపడ్డమే గాకుండా, అవసరమైనవీ, అవసరంలేనివీ అన్న తారతమ్యం లేకుండా కాయితాల్ని (యిందులో ప్రోనోట్లు, సర్టిఫికెట్లు వగైరాలున్నాయి) కాల్చేసినట్లు చిత్రిస్తూ ఆ మధ్య కొన్ని కథలు బయల్దేరాయి నిజంగా, యే మాత్రం అక్షర జ్ఞానం లేకపోయినా సమర్థంగా వ్యాపారాలు సైతం చేస్తున్న ఎందరో వృద్ధ స్త్రీలు, మధ్య వయస్కులైన వాళ్ళను చూస్తున్నాం - వాళ్ళు అలా అవ్యక్తంగా ప్రవర్తిస్తే ఎన్నిరోజులు ఆ వ్యాపారాలు చెయ్యగలుగుతారు?

చదువుకున్న వాళ్ళలోనే "నాలుగు మూళ్ళు పదిహేను" అని లెక్కకట్టేవాళ్ళు ఎందరో ప్రతినిత్యమూ ప్రత్యక్షమవుతూ వుంటారు కాగా, అంత నిరక్షరకుక్షులైన వాళ్ళకు ప్రతివస్తువుయొక్క నామరూపాలూ, సంఖ్యలూ బాగా జ్ఞాపకం వుంటాయి కారణం గుర్తురాసుకో లేరుకనుక. వ్రాసుకో గలిగేవాళ్ళు వ్రాసిన కాగితం తీసిచూస్తే గాని, చాకలివాడికి ఎన్నిబట్టలు యేవేవి వేసింది చెప్పలేరు

చాకలివాళ్ళల్లో ఎందరు - స్త్రీలుగాని, పురుషులుగాని - చదువుకున్నవాళ్ళున్నారు? వాళ్ళెంత గుర్తుపెట్టుకుని మనగుడ్డల్ని ఉతికి తెచ్చిసారు? అలానే చాకలిపద్దు రాయలేని యిల్లాలు యింటిగుడ్డలు గుర్తుపట్టి తీసుకో గలదు. ఇక అయినకాడికి, పనికొచ్చేవీ, పనికిరానివీ, అన్నదిలేకుండా చదువురాని యే యిల్లాలూ, కాగితాల్ని కాల్చెయ్యదు! కారణం, యేది కాల్చేస్తే ఏం ముప్పు వస్తుందో - తనకు చదవడము తెలీదు గనక - అని అన్నిటినీ చేతనయినంత మటుకు జాగ్రత్తచేస్తుంది అంతేగాని, యింటినిండా పరుచుకొని వున్నాయని పాడుచెయ్యదు!

ఇది చాలా అసందర్భమయిన వూహ! స్త్రీలకు విద్యావిజ్ఞానా లవసరమనండిగాని, ఇలాంటి అవకతవకపనులు చేసారన్న అప్రథ వాళ్ళకంటగట్టడం అపరాధమే అవుతుంది.

ఇక జన్మతః తెలివితక్కువగా ప్రవర్తించే వాళ్ళు, రెండుజాతుల్లోనూ వున్నారు. అలాంటప్పుడు, చదువూ, సంస్కారమూ అడ్డొచ్చిన సందర్భం ఒక్కటైనా ఉంటుందేమో చూడండి! ఆ ప్రకృతులలా జీవించవలసినదే!

భర్త వెర్రిబాగులవాడయి-బాహ్య ప్రపంచంలో చెలామణీ కాలేకపోయినా, సంసారాన్ని చక్కదిద్దుకుంటూ, పిల్లల్ని జాగ్రత్తగా పెంచి పెద్దవాళ్లనుచేసి, విద్యాబుద్ధులు గరపించిన చదువురాని స్త్రీలు మన దేశంలో లెక్కకు మిక్కిలిగా ఉన్నారు. చదువంటూ వాళ్లకు రాకపోయినా, ఆ లోటు భర్తీచేసుకుని జీవితాలను సుఖమయం చేసుకున్నారు అదే చదువొచ్చినవాళ్లు— ఎందరో తలక్రిందులుగా ప్రవర్తించినవాళ్లూ వున్నారు, వాళ్లకా విద్యావిజ్ఞానాలు అడ్డురాలేదు అలాగే సమర్థంగా చేసుకుపోయే వాళ్లూ చదువుకున్న అంగనలలో అరుదు కాదు!

* * *

అదే చదువొచ్చిన మంగమ్మ కుటుంబాన్నెంత జాగ్రత్తగా, ఆనందంగా పోషించు కొచ్చింది? .. అలాంటిఆమె కూతురు చదువుకున్న సరళ ఎంత సుఖమయం చేయ గలిగింది?!

మొదట్నుంచీ తల్లి చెప్పినమాట వినకే తాను పెద్ద, చదువుకున్నాననే గర్వంతో మెలగడంచేత, కాపరానికి వెళ్ళాక అందరితో మాటలుపడుతూ, దీర్ఘరోగిగా సంసారాన్ని సాగించిందిగాని సుఖమయం చేసుకోలేకపోయింది! ఆవిడ ఇకఅంతే, తనతప్పును, ఇతర్లు చెప్పిన మంచిని, మంచిగా అర్థం చేసుకోలేని వాళ్ళు తాత్కాలికంగానే కాదు, జీవితాంతమూ సుఖపడలేరు

అదె మాపక్కింటి పార్వతమ్మను చూస్తే ముచ్చటేస్తుంది. ఇంట్లో నలుగురు తోటికోడళ్లూ, మరుదలతో తలలో నాలుకలా ప్రవర్తిస్తుంది. ఆ యింట్లో అందరూ ఆమెను గౌరవిస్తారు. ఆమె అందర్నీ గౌరవిసుంది అయితే ఆమె ఏం చదివింది? ఏమీలేదు. రూపలావణ్యాలను చూచేఆమె భర్త ఆవిడను చేసుకున్నాడు గాని, ఆమె విద్యావైదుష్యాలను చూచి గాదు. అంత మాత్రంచేత ఆ కుటుంబం నిత్యదుఃఖంతో కాలం గడుపుతోందా? ..లేదు నవ్యచైతన్యంతో 'నిత్యకల్యాణం - పచ్చతోరణం' గానే వుంది ఆమె, ఆమె బిడ్డలనూ, తోడికోడళ్ళ బిడలనూ తన బిడలలాగే చూచుకుంటుంది ఈలాంటి సదుణం చదువుకున్న యెందరికుంది? ఎందరికి లేకుండాపోయింది!

అందువల్ల 'సంస్కారం' అన్నది ప్రతి వ్యక్తిలోనూ ఉంది. కాని, కొందరి సంస్కారం దుష్టశక్తుల బలంవల్ల కుసంస్కారంగానూ, కొందరిసంస్కారం నిజమయిన సంస్కారంగానూ ప్రకాశిస్తుంది!

అంతేగాని, దానికి అక్షరాస్యతా, నిరక్షరాస్యతా అన్నవి మాత్రం మూల కారణాలుగావు. అది వారి వారి జన్మకాల విశేషమని అంటే కూడా తప్పులేదేమో! సంస్కారం అన్నది తెచ్చిపెట్టుకుంటేనూ, పుస్తకాలు చదివితేనూ వచ్చేదికాదు. అది మానవులకు వరప్రసాదంలాంటిది! అలా అని చదువు, కూడదని మాత్రం కాదు. అలాంటి సంస్కారం అలవడిన గానీ, నారీలోకం నరలోకంలో నిజంగా గణన కెక్కలేదు!



# మన సమాజంలో భర్తృవిహీనల దుస్థితి

## ★ విషాదగాథ - వింటేబాధ ★

విషాద గాథ వింటారా? విని కన్నీరు కారు స్తారా? లేక, వేడినిట్టూర్పు విడుస్తారా? నా ఘోష వింటారా? మా కోపు విడిపిస్తారా? లేక సంఘంచేత కరకర కోయిస్తారా? సాను భూతివాక్యమయినా పలుకుతారా? లేక మాకేం అని ఊరుకుంటారా? భయం లేదని అభయమిస్తారా? కరుణిస్తారా? కుమిలికుమిలి కృశించిపొండి అని సెలవిస్తారా? మీరు ఏమైనా అనండి—ఇది నా గాథ! ఇది నా విషాదగాథ! నాదే కాదు, నావంటి అభాగి నుల గాథ! ముందు నా గాథ కరుణతో ఆకర్ణించండి

అవి నా బాల్యపు రోజులు. బహుశా అయిదేళ్ళ అమ్మాయిగా వున్నానేమో. కమ్మగా కాలము గడుపుతున్న రోజులవి ఒకనాటి ఉదయాన నాకు కొత్త బట్టలు తొడిగి పసుపు గంధాలు పూసి, మేళతాళాలతో నాకు ఏమేమో చేశారు నా తలిదండ్రులు సంతోషసాగరానమునిగివున్నారు. పెళ్లిపందిట్లో నన్ను కూర్చోబెట్టారు నాకు అంతా అయోమయంగా తోచింది. లౌకిక జ్ఞానంలేని చిన్నదాన్ని కదా మరి. నా ప్రక్కనే 10, 12 సంవత్సరాల అబ్బాయి కూడా వున్నాడు పెళ్లిపందిరి పెద్దలతో, పిన్నలతో క్రిక్కిరిసిపోయింది సన్నాయి వాయిద్యాలు, భూసురోత్తముల మంత్రపఠనాలు, పెళ్లిపెద్దల హడావిడులు, పిన్నల ఏడ్పులు పెళ్లి మంటపాన్ని గందరగోళం చేస్తున్నాయి. ఇంతలో నా ప్రక్కనున్న అబ్బాయి నా మెళ్లో ఒక పసుపు దారము కట్టాడు. అది మంగళసూత్రమని గ్రహించే శక్తి నాలో లేదు. ఆ సూత్రం జీవితాంతం వరకూ బంధించి వేసేదని గ్రహించే శక్తి నాలో లేదు. 'ఇక నీవు దాసివి; నా దాసివి' అని ఆ సూత్రము నన్ను హేళనచేస్తూ మెరిసింది ఆరోజు గడచినది. ఆ నాడు జరిగింది నా పెళ్ళి అని నాకు తెలియదు. చిన్నదాన్ని. ఎక్కడివారు అక్కడికి వెళ్లిపోయారు.

నా తలిగారింటిలో ఒక సంవత్సరము ఉత్సాహంగా గడిపాను. అలనాడు- అంటే సంవత్సరము క్రిందట పెద్దల సముఖాన, బ్రాహ్మణోత్తముల మంత్ర పఠనంతో పెళ్లి మంటపంలో మంగళ వాయిద్యాల మధ్య మంగళసూత్రం కట్టిన అతను మోటారు ప్రమాదంలో మరణించాడన్న పిడుగు వార్త నా తలిదండ్రుల చెవిన పడినది. ఆ వార్త వారిని దుఃఖసాగరాన ముంచివేసింది నా కంతా అయోమయము మనిపించినది మా అమ్మ నన్ను కౌగలించుకొని భోరున ఏడ్చింది. ఏమీ తోచక అమ్మతో కారణము చేశాను అమ్మ ఇంకా బిగరగా ఏడ్చింది. మా చుట్టుప్రక్క వారు వచ్చి సముదాయించారు కాని అమ్మ దుఃఖము ఆగలేదు.

మేమందరము ఆ పిల్లవాని ఇంటికి పోయాము-పిలవాడు అని గాక, 'నా భర్త' అనమంటుంది లోకం సరే అలానే అంటా. అతడు అగ్నిసాక్షిగా పెండ్లి ఆడాడు కాబట్టి నేను అతడి భార్యనే. అతడు నా భర్తే-నా భర్త ఇంటిలో అంతా గందరగోళముగా వుంది నాకుమాత్రం ఏమీ తెలియడము లేదు. ఆ తరువాత నా భర్తను శ్మశానానికి గొనిపోయారు.

ఆ రోజు గడచిపోయినది.

---

రాధ
(హైదరాబాదు)

---

ఆనాటినుండి మా అమ్మ ముఖాన, ఆనందము అసలే లేదు ఎప్పుడూ ఏడుస్తూనే వుండేది పెద్దలునానోసటవుండేబొట్టు తుడిచి వేశారు గలగలమనే గాజులు పగులగొట్టారు చప్పుడు కాని బంగారుగాజులు తొడిగించారు "ఇక నీ జీవితమే నిశ్శబ్దం" అన్నట్లు ఆగాజులు హేళన చేయసాగాయి. మెట్టెలు తీసివేశారు. ఆరేళ్ల పసిదాన్ని, ఆ తంతు ఏమిటో నాకేమి అర్థమవుతుంది చెప్పండి మీరే ఈవిధంగా నాజీవితం అధోగతిపాలైపోయింది.

"తరుణము, తరంగములు ఒకరికోసం వేచివుండవు గదా!" అట్లే రోజులు గడిచిపోతున్నాయి. నేను ఏడవతరగతి ప్యాసయ్యాను. మా నాన్న ఇంకా చదివిస్తానన్నాడు కాని, మా ఇంట్లోవున్న మా నాయనమ్మ ఒప్పుకోలేదు 'ఎందుకురా దాని కింక చదువు? ఎంత చదివినా మన ఇంట్లోనే ఉంటుందిగదా? ఎ అయ్యను మురిపిస్తుందిరా అది చదివి? వృథాగా డబ్బు పాడుచేస్తున్నావు' అంది. ప్రక్క గదిలోనే ఉండి వారి సంభాషణలు యానత్తూ విన్నాను. అప్పుడు తెలిసింది నాకు—గాజులు పెట్టుకోనని కారణము; నొసట తిలకం పెట్టుకోనని కారణము, నేను విధవను అని తెలిసింది నాకు. అప్పుడు నా వయస్సు 12 సంవత్సరములు అయి వుండవచ్చును నా తండ్రి ప్రయత్నంవల్ల, పట్టుదల వల్ల 10-వ తరగతివరకు రాగల్గాను. ఆ బడిలో చదువులో, వ్యాసరచనలో— అన్నింటిలో నాదే పైచేయి. కాని ఏమి లాభం? నా జీవితం అంతా అంధకార బంధురమైందని గ్రహించాను

పదవతరగతిలో ఫస్టుక్లాసులో ప్యాసయ్యానని మా నాన్న పేపరులో చూపించాడు. నా ఆనందానికి, అంతులేదు; కాని మా అమ్మ దుఃఖానికి మేర లేదు, ఇప్పుడు ముంచేదో చెడు ఏదో తెలుసుకునే శక్తి నాలో వున్నది అమ్మను సముదాయించాను, అమ్మా ఏడవకు నాపూర్వజన్మలో చేసిన దాన్ని అనుభవిస్తాను అన్నాను నా వెంగ పెట్టుకొని మా అమ్మ చాల చిక్కిపోయింది. నాటినుంచి మా ఇల్లు దుఃఖానికి పుట్టినిల్లు అయింది.

మా నాయనమ్మ నన్ను బయటికి వెళ్ల వద్దంటుంది. కాని బయటికి వెళ్లకుండా ఉండడానికి మనసొప్పదు; కారణం ఇంట్లో ఎప్పుడూ ఒకశోకము! పదహారేళ్ల నవయవ్వనురాలను అయ్యాను. కాని ఏమిలాభము? సంఘానికి కట్టుబడాలి. సంఘానికి లోబడాలి సంఘానికి దాసురాలను కావాలి.

అవుతాను; అవుతాను; దాసురాలను అవుతాను; లోబడతాను, అనుభవిస్తాను ఈ సంఘానికి నా నూతన యవ్వనాన్ని బలి పెడతాను. ఈ సంఘం యొక్క ఆకలిబాధ తీరుస్తాను.

నాకన్నీరుతో వీరి హృదయాలను చల్లారుస్తాను దుఃఖముచేత కుళ్ళి కుళ్ళి కుమిలిపోతాను. ఆహుతి అవుతాను. నా జీవితాన్ని ధార పోస్తాను. కాని వినండి. నా వంటి అభాగినులకు మరల పసుపు కుంకమలు పెట్టుకొనే భాగ్యము కల్పించుమని ఈ సంఘాన్ని ప్రార్థిస్తున్నాను అందుకు ఈ నాటినుంచే నేను ప్రయత్నిస్తాను. స్త్రీకి పసుపు కుంకుమలు అందము నిస్తాయని, కళా కాంతులు ఇస్తాయని మన కందరికీ తెలిసినదే కాని ఆ కళను మేము నోచుకోలేదు! ఆకళ మాకు అబ్బదా?

గుండె రాయిచేసుకొని బ్రతుకు వెలసిందేనా? ఆడది తలదువ్వుకొని, పూలు పెట్టుకుని, ఇంత బొట్టు పెట్టుకుంటే ముఖాన లక్ష్మి తాండవిస్తుందిఅంటారు ముఖానే కాదు ఇంటా నే లక్ష్మి తాండవిస్తుంది. మేము అటువంటి భాగ్యానికి నోచుకోలేని అభాగినులము. మాకు ఈజన్మలో వెలుగు కలుగదా?

మొన్న మొన్న నే అంటే నేను 10 వ తరగతి ప్యాసు అయిన తరువాత, మా నాయనమ్మ బలవంతాన నా పుట్టింటినుండి నా మెట్టినింటికి పోయాను అక్కడ అందరు నన్ను చూసి, మూతి ముడుచుకొన్న వారేగాని నాతో మాట్లాడేవారు ఎవరు లేరు! నాకు దుఃఖము, పొంగి, పొంగి, ప్రవాహమువలె వచ్చింది. ఇంతలో ప్రక్కగదినుండి ఈ మాటలు విన్నాను. 'ఈ తల్లి నా గడపలో కాలుపెట్టిందో లేదో నాకన్న కొడుకును కడుపున పెట్టుకుంది అంది మా అత్త! మీరే యోచించండి, నేనేనా కారకురాలను? అనవసరంగా నా అత్త నన్ను ఆడిపోసింది నానా దుర్భాషలాడింది. అక్కడ ఉండలేక నా తల్లివద్దకు వచ్చేశాను ఇంటిలో మా నాయనమ్మ గొణుగుడు సరేసరి!

ఏనాడు ఈ సంఘము బాగుపడుతుందో, ఏనాడు మాకు మరల పసుపు కుంకుములు పెట్టుకొనే భాగ్యము వస్తుందో! మేము అభాగినులము అదృష్టహీనులము మంగళసూత్రానికి నోచుకో మగువలము! మా వంటి అభాగినులను అపరాధులుగ పరిగణిస్తారు! ఇదేనా మానవధర్మం?

మొన్న మా ఇంటికి ఒక ఆచారి వచ్చాడు అతనికి "సాహిత్యము" పెట్టవుంది అమ్మ సరేనని నేను బియ్యము, ఉప్పు, పప్పు మొదలగునవి పెట్టబోయాను అతడు ఆగ్రహించి, కళ్ళు ఎఱ్ఱచేశాడు కెవ్వన కేక వేశాను రివ్వన, అమ్మ, నాయనమ్మ అక్కడికి వచ్చారు అప్పుడు ఆ ఆచారి మా అమ్మను ఉద్దేశించి ఇదేనా మీ ధర్మం, విధవచేత "సాహిత్యం" ఇప్పిస్తారా అని గద్దించగా అమ్మ అతని కాళ్ళపై పడిక్షమించండి స్వామీ అని ప్రార్థించింది నాకు పట్టరానికోపము వచ్చింది "పేదవాడి కోపము పెదవుకు చేటు అన్నట్లు" ఏమీ అనలేకపోయాను "గడ్డం మీసం పలు మోసం" అనుకొన్నాను

పూర్వాచారాలు, మాపై జరిపే మోపే అత్యాచారాలు మాసిపోవాలి. దురాచారాలు దూరముకావాలి కనీసం బాల వితంతువులకైనా పునర్వివాహము కలిగే అవకాశాలు కలుగాలి "ఇల్లాలు కిలకిలమంటే ఇల్లు కళకళ లాడుతుంది అంటారు" అలానే దేశములోని స్త్రీలు కిలకిలమంటే దేశము కళకళలాడుతుంది అనే సత్యాన్ని ఋజువుచేయాలి








## మెప్పుకోసమా?

జూలై 2వ తేదీ వారపత్రికలో శ్రీమతి టి. ప్రభావతిగారు వ్రాసిన "నేనూ బి. ఏ చదివాను ?" అన్న వ్యాసం చదివాను కాని వారి అభిప్రాయం చాలా వింతగా కనుపిస్తుంది. ఒకరి మెప్పుకోరకుగాని వేరొకందుకు చదువు అనవసరం అని స్పష్టమవుతుంది వారి వ్యాసంలో. చదువుకున్నందుకు సార్థకత ఒకరి మెప్పువల్ల రాదని, మనం చదువుట ఒకరి మెప్పుకోరకు గాదని వారు గమనించినట్టయితే ఆ వ్యాసం వ్రాయకుందురేమో ?

కొమరగిరి ప్రభాకరరావు (సూర్యాపేట)

* * *

## స్త్రీవిద్యకు గరిష్ఠ పరిమితి!

శ్రీమతి టి. ప్రభావతిగారితో నేను పూర్తిగా ఏకీభవిస్తాను. వారు వ్రాసిన వ్యాసం చాలా బాగుంది. ఈ రోజులలో ఆడవాళ్ళకు అంతంత చదువులు అనవసరం. కేవలం ఉద్యోగమే చేయాలి ఉద్యోగం మీదే ఆధారపడాలి అనే వారికి తప్ప (ఆడవాళ్ళలో) మిగతవాళ్ళకు అంత చదువు అక్కరలేదు. భర్తలకు ఉత్తరం వ్రాసి నాలుగు కాకలిపట్టలు వేసేటంత చదువు అనగా మూడవ ఫారం వరకు చాలు. ఇప్పటి స్టాండర్డ్ నుపట్టి

గంటి వేంకట్రావు (రాజమండ్రి)

* * *

## విచారకరం

ఇది చాలా శోచనీయం. మహిళల నిత్యకృత్యాలలోనూ, పిల్లల పెంపకంలోనూ విద్యయొక్క ఆవశ్యకత ఏమిటో విద్యావతి అయిన మహిళకు కూడా తెలియకపోవటం మరీ విచారకరం.

మన స్త్రీలలో చదువుకున్న వారు తక్కువగా వున్నందువల్ల కొత్తవారు ఆడవారిని "ఏమి చదువుకున్నార"ని ప్రశ్నించటం ఎక్కువగా జరగని మాట వాస్తవమే అయినను, అంతటితో నిస్పృహ చెందవలసిన అవసరం ఏమీ లేదు. చదువుకున్న వ్యక్తులైతే ప్రశ్నోత్తరాలు లేకుండానే ఎదుటివారు చదువుకున్నవారైనదీ, లేనిదీ తెలుసుకోగలరు, సాధారణంగా.

కొంతమంది విద్యాధికులైన స్త్రీలు ఆర్థికంగా భర్తకు ఏమీ సహాయం చేయలేకపోవచ్చును. కానీ "కార్యేషు మంత్రి" అని పేర్కొనబడిన అన్ని రంగాలలోనూ స్త్రీయొక్క విద్యాగంధం ఎక్కువగా రాణింపుకి వస్తుంది. పోతే, చదువుకున్న భార్యనుచూచి దుఃఖపడటం, భర్త సంకుచిత బుద్ధిని వెల్లడిస్తుంది అంతే.

ఒకవేళ విద్యావంతులు బాహ్యంగా ఎంత దుష్ప్రవర్తనతో సంచరించినా, మానసికంగా విద్య దానియొక్క విశిష్టతను అది నిరూపించుకుంటుంది. దీని ఫలితమే పశ్చాత్తాపము. ఇదే విద్యలోని ప్రత్యేకత. అంతే విద్యాహీనులు పశ్చాత్తాప పడరని కాదు. కాని విద్య ఇందుకు యెక్కువ దోహదాన్నిస్తుంది.

వేదాంతం రాధాకృష్ణమాచార్యులు
(మాచర్ల)

* * *

## అదీ లాభం?

"నేనూ చదివాను బి. ఎ," అనే వ్యాసం వనితలకు యే విధంగా వుపయోగపడుతుందో తెలియకుండా వుంది.

అయితే రచయిత్రి, రైళ్ళో వాళ్ళు యెలాగా అడగలేదుగదా, పోనీ వనితలకయినా తను బి. ఏ. చదివినటు తెలపాలనీ యీ వ్యాసం వ్రాశారేమో? ఇకమీదట నయినా యిలాంటి అనవసరపు వ్యాసాలను వ్రాయడం మానుకొని వనితల కుపయోగపడే మంచి వ్యాసాలు వ్రాస్తారని ఆశిద్దాం.

—[illegible]]

* * *

## చదువు చదువుకోసమే

"ప్రభావతి అక్కయ్యా నీవు ఇంటరు పాసయి బి. ఏ. లో చేరావు. నీ చదువును గురించి ఎవ్వరూ అడగలేదని విచారించవద్దు. చదువు చదువుకోసమే గాని ఇతరులు తెలుసుకొనుటకు కాదు. ఇందువలన స్త్రీ చదువు 75% సార్థకతలేదని నీతో ఏకీభవించలేకపోతున్నాను. చదువు కుటుంబ నిర్వహణకు దేశసేవకొరకు ఉపయోగించవలెను."

సి. ఉత్తరగారు వ్రాసిన "రకరకాల బాధలు" అను వ్యాసం చాలాబాగా వర్ణించి వ్రాశారు. వారికి నా ధన్యవాదాలు.

—గోగినేని ఝాన్సీ, విజయవాడ]

* * *

## క్లిష్ట సమస్య

మొన్న తుని డీసిల్ లో నేను కాకినాడ వెడుతున్నా. నా ప్రక్కనే ఒక 19, 20 సం॥ ఆమె కూర్చుంది. ఆమె వాలకం చూస్తే చాల చదువుకొన్నదిలాగ కనబడింది. చేతికి వాచి, హై హీల్ జోళ్ళు, వదులుగా ఒక అడుగు వదిలి అల్లిన జడ చూపులకు మాత్రం కాలేజీ స్టూడెంటులా ఉంది. నేను ఊరుకోక ఏం చదువుతున్నారండీ అన్నా. నాలుగో క్లాసు చదివానండి అని సన్నగా అంటూ తలవంచుకొందా కలకండి కాకినాడ వచ్చేవరకూ ఆమె తలపైకెత్తి చూడకుండా సిగ్గుతో కృంగిపోయింది కాబోలు. అంతవరకు మాట్లాడిన ఆమె ఎవ్వరితోను మాట్లాడకుండా మౌనంగా ఉండిపోయింది. నామనసు చివుక్కుమంది చాల బాధపడ్డా. అలా అడిగినందుకు వెంటనే క్షమించండి అన్నా. అబ్బే పరవాలేదు అంది.

డిగ్రీ తీసుకున్న వాళ్ళు ఏం చదివారో అడగలేదని బాధపడతారు. మనం డిగ్రీలు తీసుకొన్నామంటే సక్రమ కార్యాల్లో మన జ్ఞానాన్ని ఉపయోగించాలి. భర్తకి అర్ధాంగిగా, అత్తకి కోడలుగా, అటు పుట్టింటికి, ఇటు అత్తింటికి కీర్తి ప్రతిష్ఠలు తెచ్చుకొని అందర్నీ సంతోషపెడితే అప్పుడు మన డిగ్రీలు సార్థకం అవుతాయని నా భావం. ఈదృష్టితో, ప్రభావతిగారి అభిప్రాయాన్ని పూర్తిగా వ్యతిరేకిస్తున్నాను.

—ఆర్. మీరారాణి]

* * *

## ప్రామాణికమైన రామాయణం

జూలై 2వ తేదీన వనితావాణి శీర్షికలో "విచిత్ర రామాయణంలో" అనే వుత్తరం చదివాను. శ్రీమతి జె. వర్ధనమ్మగారి "ఇది ఏమి న్యాయం?" అనే వుత్తరాన్ని అత్తే

శర్మ, డా. కళానిధి శర్మగారు ఆ లేఖను వ్రాశారు. రామాయణమును అనేకులు, అనేక రకములుగా వ్రాసియున్నారు. కాని మనము తప్పొప్పులు చూచుటకై ప్రమాణముగా తీసుకొనవలసినది వాల్మీకి రామాయణమే. వాల్మీకిరామాయణమునందు మండోదరి విభీషణుని వివాహమాడినట్లు లేదు. రామభక్తాగ్రేసరులని పేరొందిన కబీర్, తులసీదాస్, కంబర్ మొదలగువారి రచనలయందే యనేక భేదములగుపడుచున్నవి. "విచిత్ర రామాయణము" అను పేరులోనే ఈ గ్రంథమునకు వాల్మీకిరామాయణమునకు సంబంధం లేదని తెలియుచున్నది. అందువలన నిట్టి భేదాభిప్రాయములువచ్చి చర్చలకు దిగినప్పుడు వాల్మీకి రామాయణమునే యాధారముగా తీసుకొనుట మంచిదని నా యభిప్రాయము. ఆర్యద్వేషులగు కొన్ని దక్షిణదేశ రాజకీయవాదులు రాముని నిందితునిగా జేసి యొక రామాయణము వ్రాసినయెడల దాని నెట్లు మనమాధారముగా తీసుకొనెదము? కావున రాముని చరిత్రమును వివిధ దృక్పథములలో వర్ణము చేసుకొనుటకు నిటువంటి రామాయణములు చదువవచ్చునేగాని ప్రామాణికముగా తీసుకొనవలెనన్న వాల్మీకిరామాయణమే.

—అల్లాడి రమా, మద్రాసు]

* * *

మండోదరి రావణుని మరణానంతరము విభీషణుని భార్య అయినట్లు రామాయణములో ఎక్కడా లేదని చెప్పగలను. ఈ విషయంలో జె. పి. వర్ధనమ్మగారితో నేను ఏకీభవిస్తున్నాను. విద్యగారు బహుశా తార వాలి మరణానంతరము సుగ్రీవుని భార్య అయినదని వ్రాయుటకుబదులుగా పరధ్యానములో అట్లు వ్రాసివుంటారు. ఇట్టి తప్పు విషయములు పెద్దగ్రంథములకు సంబంధించి వ్రాసే పిల్లలు, పెద్దలుకూడ నిజమనుకొని పురాణాల్ని మార్చిపారేస్తారు. కనుక కొంచెం చూసుకుని వ్రాయవలసిందనిమనవి.

—సి. ఉమాదేవి, విజయవాడ.]

* * *

## మంచిది కాదు

శ్రీమతి ఇందిరగారు జూన్ 26-వ తేదీ పత్రికలో వ్రాసిన 'విశాలహృదయాలు' అన్న వ్యాసం చదివాను. అందులో ఏమాత్రం నిజము లేదు. పక్షపాతంతో ఇలాటి వ్యాసాలు 'వనితాలోకం'లో వ్రాయడం మంచిదికాదు. వారు సెలవిచ్చిన అన్ని ఉదాహరణలలోను నిజం కనబడనే కనబడదు. —ఎం. శ్యామల(గార్గేయపురం).

* * *

## సరికొత్త పాతకోణం

జూన్ 18వ తేదీ ఆంధ్ర వారపత్రికలోని "మన సమాజంలో భర్తృహీనుల దుస్థితి" అనేవ్యాసం చదివినాను అందులో పుంతకల్ పరిమళగారికి సనాతనులమీద ఉండే భావం వ్యక్తమైందే గాని వేరేమి లేదు. సనాతనులు పెట్టిన ప్రతి కట్టుబాటు శాస్త్రసమ్మతముగాను, ఆధ్యాత్మికచింతనముతోను పెటినదేగాని, స్వార్థపరత్వంతో పెట్టినవి కావు

ఇంతకీ సమాజంలో వితంతువివాహము ప్రోత్సహించడమనేది సబబయినది కాదు. సానుభూతి చూపించే పిటకథలు చాలా ఉంటాయి ఈ ఒక్క సమస్యమీదే మనసు కరిగించే ప్రవచనాలెందుకు? మామూలు అవివాహితులకే వివాహాలయ్యేటప్పటికి తాడు తెగి తప్పాల మాతపడుతున్నది. ఇప్పటికే జనాభా ఎక్కువైంది వితంతువులవల్ల కలిగే జనాభాకూడా కలిపే పక్షములో భారతదేశము ఇంకో వలసరాజ్యము చూసుకోవలసి వస్తుంది సుఖము లేకపోయినా బతకవచ్చు, కాని తిండి లేకపోతే బ్రతకలేము. మీ మనోవికాసాన్ని ఆహారోత్పత్తి మీద ప్రసరింపజేయండి ఏదో సంఘానికి భయపడి అయినా బాహాటంగా వితంతువులు వివాహము చేసుకోడములేదు. ఆహార కొరతతోను, మిక్కుటమైన జనాభాతోను, ఆర్థికమాంద్యంతోను కొట్టుమిట్టాడుతున్న భారతదేశంలో కుటుంబనియంత్రణ అమలు పరచాలి అంటూ పెద్ద పెద్దలు బహిరంగ సభలలో నిర్భయంగా ప్రవచిస్తున్నారు. మరి మీరేమంటారు దానికి?

తోలేటి కామేశ్వరరావు,
(గుంతకల్లు)

* * *

క్రొత్తపల్లి రాజ్యలక్ష్మిగారు వ్రాసిన "మంగళసూత్రం ఎందుకు తీసివెయ్యాలి" అను వ్యాసాన్ని పూర్తిగా చదివాను భర్తృవిహీనలస్థితి మనదేశములోనే యింత ఘోరముగా నున్నది.

మరియు మనదేశములో ఒకరు ముందుకు వచ్చి ధైర్యముచేసి మంచికి చెపుతుంటె వెనుక పదిమంది ఎగతాళి చేస్తూండడమను ఒక పెద్ద జబ్బు పాశ్చాత్యదేశములలో యిది మచ్చునకైనా కనబడదు. మనము మంచి చేయలేకపోయిననూ, చేయువారిని ప్రోత్సాహపరచే బదులుగా, నిరుత్సాహపరచుట మంచిది కాదేమో!

ఏది ఎట్లున్నను రాజ్యలక్ష్మిగారు యిట్లే మరికొన్ని వ్యాసములను వ్రాసి తోటి వనితలకు కనువిప్పు కలుగజేస్తారని ఆశిస్తున్నాను. వారికి హృదయపూర్వక అభివందనములు యీ పత్రికద్వారా తెలియపరచుచున్నాను.

వై. బి. కె. రావు,
(ఇండియన్ నేవి, బొంబాయి)

* * *

## ప్రశ్న, జవాబు

"మంగళసూత్రం ఎందుకు తీసివేయాలి" అను వ్యాసమును చదివిన వెంటనే తిరుగు వ్యాసము వ్రాయాలని మనస్సు ప్రేరేపించింది! కాని దాని క్రిందనే శ్రీ వందిగామ సూర్యనారాయణగారు వ్రాసిన "సనాతనాచారాలు మంచివే" అనే వ్యాసము చదవటంవల్ల మనస్సు కుదుట పడ్డది. అందులో ఆయన, విధవ స్త్రీలు ఏవిధంగా వుండాలో కూడా విపులంగా వ్రాసినాడు అందుచే నేను విపులంగా వ్రాయక శ్రీ సూర్యనారాయణగారిని అభివందిస్తూ విరమిస్తున్నాను

డా॥ వేమవరపు సీతారామయ్య.
(కప్రాల, నల్లగొండ)

★



# మానసిక, శారీరక పరిణామాలు

(30 వ పేజీ తరువాయి)

వంగా ఉన్నంతసేపూ మానవశరీరంఎంత వేగాన్నయినా ఓర్చుకోగలదు వేగాన్ని ఉన్నట్లుండి హెచ్చించినా తగ్గించినా, పోయే దిక్కును హఠాత్తుగా మార్చినా తట్టుకోలేదు ఈమార్పులను కొలవటానికి 'జి' అనే కొలమానం ఉపయోగిస్తారు 'జి' అనేది గ్రావిటీ (గురుత్వాకర్షణశక్తి)వల్ల వచ్చే వేగం మార్పులకు సంకేతపదం. సముద్రపు మట్టాన ఉన్నప్పుడు భూమ్యాకర్షణ శక్తి కలగజేసే వేగం మార్పులను 'జి' సూచిస్తుంది. ఏరకపు ఆసరా లేకుండా, మామూలుగా కూర్చుని ఉన్నప్పుడు శరీరం 3½ జి కంటే ఎక్కువ వేగం మార్పును 15 సెకండ్లకంటే ఎక్కువసేపు భరించలేదు సగం కూర్చుని, సగం పడుకుని ఉన్నప్పుడు, స్పేస్ సూటులేకపోయినా, 6 జిని 4½ నిమిషాలసేపు సహించగలదు 12 జిని 6 సెకండ్లసేపే తట్టుకోగలదు కాని అతివేగంతో పైకిపోయేటప్పుడు, క్రిందికి దిగేటప్పుడు జి శక్తులు విపరీతంగా అధికమవుతాయి వేగం ఎక్కువ కావటమే కాకుండా, వేగంలో మార్పులు క్షణక్షణానికి ఎక్కువఅవుతాయి ఇది చాలా గడుసమస్య 4½ సెకండ్లకు ఒక జి చొప్పున పెరుగుతుంటే 54 సెకండ్లసేపు 12 జీలను మాత్రమే మానవుడు సహించగలడు అయితే జి మార్పును సహించగలిగే శక్తిని మానవుడు అతిత్వరలోనే సంపాదించుకోగలుగుతాడని పరిశోధనలవల్ల తేలింది. మూడు అంచీల రాకెట్టులో మొదటిభాగం విడిపోగానే చాలా సెకండ్లసేపు అతడు అధికవేగాన ప్రయాణం చేస్తాడు అయితే ఆ వేగంలో మార్పు ఉండదు రెండోభాగం విడిపోయిన తర్వాత కూడా అతడు వేగం మార్పును అలవాటు చేసుకోగలుగుతాడు అలాగే మూడోభాగం విడిపోయినప్పుడు కూడాను నేలమీదికి తిరిగి వచ్చేటప్పుడు వేగం మార్పులు క్రమంగా తగుతూ వస్తాయి గనక జి శక్తుల ప్రమాదం మరింత ఎక్కువవుతుంది వాతావరణపు చివరి అంచులలో ఎంత పల్చటి పొరను తాకినా, 18 వేలమైళ్ళ వేగంతో తాకవలసి వస్తుందిగనక, పెద్ద నిప్పు కొలిమిలోంచి గంటకు 60 మైళ్ళవేగంతో కార్లోపోతూ కొండను ఢీకొట్టినట్లుగా ఉంటుంది వేగం తగ్గించటానికి, ప్రయాణికుడు నాలుగు డిగ్రీల వంపు తిరగాల్సి ఉంటుంది వేగం తగ్గగానే మళ్లీ సూటిగాపోతూ నౌకను దల్లబరుచుకోవలసి ఉంటుంది ఈ పద్ధతిని డజను సార్లకుపైగా మళ్లీ మళ్లీ ఆచరించాల్సి ఉంటుంది ప్రతిసారి వచ్చే దెబ్బ తెలుస్తూ ఉంటుంది మూడు వేల మైళ్ళకు వేగాన్ని తగ్గించుకున్నాక బ్రేకులు ఉపయోగించుకోవటం మొదలుపెట్టవచ్చు అప్పుడు స్టెయిన్‌లెస్ స్టీల్ పారచూట్‌ను తెరవవచ్చు. దీనివల్ల కలిగేదెబ్బ అన్నిటి కంటే ప్రమాదమైనది నాలుగో సమస్య

## భారరహితస్థితి

ఈస్థితి మతి పోగొడుతుంది మహా చిత్రంగా ఉంటుంది ఏదో అయిపోతున్నామనిపిస్తుందిగాని ఏమవుతోందీ తెలియదు దీన్ని సున్నా'జీ'స్థితి అనవచ్చు భూమి వాతావరణం దాటిపోయి ప్రయాణంచేస్తున్నప్పుడు మానవునికి ఈసితి సంభవిస్తుంది తిన్నగా తను కట్టి వేసుకుని ఉంచుకుంటే తప్ప లేకపోతే కొద్దిగా కదిలినా ఎగిరి పడతాడు చెయ్యికదిలిస్తే వళ్ళంతా ఎగిరిపోవచ్చు ఇలాంటి భారరహితసితిలో ఎవ్వరూ ఉండనంతసేపు ఉన్న మేజర్ హార్బర్ స్టాలింగ్స్ అనే ఆయన ఈస్థితి అపాయకరం కాదనీ, పైపెచ్చు సహాయకరం అనీ చెప్పారు ఎనిమిదిగంటలసేపు మామూలు సితిలో నిద్రపోయిన దానికన్నా, నాలుగు గంటలసేపు భారరహితసితిలో నిద్రపోతే ఎక్కువవిశ్రాంతి లభిస్తుందని ఆయన అభిప్రాయం

కాని మేజర్ స్టాలింగ్స్‌తో ప్రయాణం చేసిన 115 మంది వలంటీర్లలోను మూడోవంతుమందికి వికారలక్షణాలు, డోకులు మొదలైనవి సంభవించాయి. మరోకాయన ఇంకోక చిత్రం వెల్లడించాడు భారరహితస్థితిలో ఉన్నవాడికి వస్తువులు నిజంగా ఉన్నచోటకాకుండా కొంచెం ఎత్తున ఉన్నట్లు కనపడతాయి రక్తప్రసారము, ఉచ్ఛ్వాసనిశ్వాసాలు కూడా ఈ స్థితిలో దెబ్బతినవచ్చునని మరికొందరి అభిప్రాయం

పైకిపోతున్నప్పుడు ఆకాశనౌక కవచంలో వేగంవలన పుట్టే అత్యుష్ణం త్వరలో తగ్గిపోతుంది కాని కిందకివచ్చేటప్పుడు ఈ ఉష్ణతీవ్రత పెద్దసమస్యగా వెంటాడుతుంది. భూమిచుట్టూ వలయాభ్రమణం చేస్తున్నప్పుడు నౌక గోడల్ని ఇన్సులేట్ చేయటంవలన, ప్రయాణికుడు తొడుక్కునే కవచంవలన ఈ సమస్యను పరిష్కరించవచ్చు చంద్రుడివైపుగాని, ఇంకా అవతలకుగాని ప్రయాణం చేసేటప్పుడు నౌకకు ఒకవైపు అత్యుష్ణమూ, మరోకవైపు అతిశైత్యమూ ఏర్పడతాయి. అందుచేత నౌకను నెమ్మదిగా గుండ్రంగా తిప్పుతూ ఉండటం అవసరం కావచ్చు ఇంకో సమస్య

## ఆహారం

ఆకాశనౌకలో మానవుడు ఏంతింటాడు, ఎలాతింటాడు? బలవర్ధకమైన లేహ్యాలను ప్లాసిక్ ట్యూబులలో పెట్టి తీసుకుపోవాలి. ఈ ట్యూబులను పళ్ళతో నొక్కి పట్టి లేహ్యాన్ని లోపలికి పీల్చుకోవాలి. భూమ్యాకర్షణశక్తి, రాపిడి ఏమీ లేకుండా కూర్చునే కదలకుండా ఉన్నప్పటికీ మానవునికి రోజుకు 3000 లేక 3400 కెలోరీల ఆహారం అవసరమని ఒక అంచనా

మంచినీళ్లు తాగటం పెద్ద సమస్య స్టాలింగ్స్‌తో పాటు ప్రయాణంచేసినవారు ప్లాస్టిక్ కప్పులోంచి నీళ్లుతాగబోతే బట్టలన్నీ తడవటమో, ముక్కులోకి పోవటమో తప్ప నోట్లోకిమటుకు నీళ్లుపోలేదు అందుచేత ఎలాస్టిక్ పాత్రలతో నీళ్లు పీల్చుకొనే ఏర్పాట్లు చేసుకోవాలి

## విసర్జన

భారరహితస్థితిలో కూడా మలమూత్రవిసర్జనం మామూలుగానే జరిగిపోతుంది "ప్లి" పైప్ అనే గొట్టాలలో మూత్రవిసర్జనం చెయ్యాలి మలవిసర్జనం కష్టమైనపనే ఒకరోజు ప్రయాణానికైతే, అంతగా వ్యర్థపదార్థం ఉండని భోజనం చెయ్యమని ప్రయాణికులను హెచ్చరిస్తారు చంద్రలోకయాత్రకైతే సూటుకు అడుగుభాగాన అమర్చటానికి వీలుగా గాలిచొరని ప్లాసిక్ సంచులను ఏర్పాటుచేస్తారు వాటిలో మలవిసర్జనచేస్తే దాన్ని తేలిగ్గా అవతలకు నెట్టివేయవచ్చు

కాని ఇంకా దీర్ఘకాలయాత్రల్లో (నెలలు, సంవత్సరాలపట్టే యాత్రల్లో) ఆహార, పానీయ, విసర్జన సమస్యలు దారుణంగా తయారవుతాయి ముందు ఆకాశనౌకను సాధ్యమైనంత తేలికగా ఉంచుకోవాలి అందుచేత ఉన్నవాటనే మళ్ళీ మళ్ళీ వాడుకునేందుకు వీలుచేసుకోవాలి బొగ్గుపులుసుగాలిని విడగొట్టి ప్రాణవాయువును తయారుచేసుకోవటంలాంటి పనులే కాక, శరీరంలోంచిపోయే పదార్థాలనుకూడా శుభ్రపరచి మళ్ళీ వాడుకోవాలని కొందరు సూచిస్తున్నారు మూత్రాన్ని పరిశుభ్రం చేసి మంచినీరుగా వాడుకోవటం, ఇంకా ఇతర అశుభ్ర పదార్థాలను ఆహారంగా పరిశుభ్రపరచటం సాధ్యమేనని, ఈవిధంగా ఎంతకాలమైన ఆహారం కొరతలేకుండా

గడపవచ్చునని కొందరి అభిప్రాయం విటమిన్లు, లవణాలు, ప్రోటీన్లు కలిపిన పంచదార నీటిని వాడవచ్చునని ఒక శాస్త్రజ్ఞుని సిద్ధాంతం.

## విశ్వకిరణాలు

ఆకాశంలో తుపానులాగా రేగుతూఉండే అణుకణాలు మానవశరీరంలో కొన్ని మార్పులు, ముఖ్యంగా జననేంద్రియాలలో మార్పులు కలగజేస్తాయి భూమికి 600 మైళ్ళ ఎత్తున అణుకణాల తుపానులు సంభవిస్తాయని అమెరికావారి మొదటి ఉపగ్రహం వలన తేలింది ఈ తుపానులు ఆధ్రువంనించి ఈ ధ్రువందాకా ఒకేవిధంగా చెలరేగుతూ ఉండేటట్లయితే ఆకాశ ప్రయాణికుడు మంటల్లోంచి దూసుకుపోయినట్లు వాటిలోంచి దూసుకుపోవలసిందే

## ఏకాంతం

ఒంటరితనం మరొక పెద్ద సమస్య. దీన్ని గూర్చి జరిపిన పరిశోధనలవలన అనేక విషయాలు బయటపడ్డాయి చాలాసేపు చీకట్లోనో, మసకవెలుతురులోనో నిశ్శబ్దంగా పనిచేసే మనిషికి ఉన్నవి లేనట్లు, లేనివి ఉన్నట్లు కనబడతాయి పనిముట్లు కరిగిపోయి కారిపోతున్నట్లు కనిపిస్తాయి భయంకరమైన ఖగ్గమృగం ఎదురుగా నుంచున్నట్లో, ఏదో యంత్రానికి అడ్డంగా ఎవరో మరుగుజ్జు నుంచున్నట్లో కనిపిస్తుంది. అందుచేత మనస్తత్వ శాస్త్రజ్ఞులు ఆకాశ ప్రయాణికులకుగాను కొన్ని సూత్రాలు తయారుచేశారు. ప్రయాణికుడు ఎప్పుడుపడితే అప్పుడు భూమిమీది వారితో మాటాడటానికి వీలైన యంత్రాలుండాలి "నేనెక్కడున్నాను? ఎలా ఉన్నాను?" అని అడిగితే నేలమీది వాళ్లు అతనికి సమాధానంచెప్పి ధైర్యం కలిగించాలి గ్రామఫోను రికార్డులు, వీలైతే టెలివిజను ఉండాలి టెలివిజను తెరలో తానెక్కడున్నదీ కనబడాలి

## ఆఖరున మనిషి

ఇన్ని ఇబ్బందు లుండగా ఆకాశంలో ప్రయాణం చెయ్యాలనే ప్రమాదభరితమైన ఆకర్షణ మానవుని కెందుకు కలగాలి? శారీరకంగా, మానసికంగా మానవుడు అపాయాలను తట్టుకోవటం కష్టమైనా, ఎలక్ట్రానిక్ బ్రెయిన్‌కన్నా మానవుడే తక్కువ స్థలము ఆక్రమిస్తాడు, తక్కువ బరువు తూగుతాడు మరికొందరు ఛలోక్తిగా అనేదాన్నిబట్టి "మానవుడు తనంతటతను ఆలోచించి సరిగా లెక్కలు కట్టగలిగిన చక్కని సజీవయంత్రం ఇలాంటి యంత్రాల్ని ఎన్ని కావలిసే అన్ని ఎవరుపడితే వారు సుఖంగా తయారు చెయ్యవచ్చు" మినుకు మినుకుమనని నక్షత్రాలను స్పష్టంగా, చాలసేపు చూసిన మొట్టమొదటి మానవుడు డా॥ సైమన్స్ ఆకాశప్రయాణం మానవుడు సాధించితీరవలసిన పని అని అభిప్రాయపడ్డారు.

అయితే మానవుణ్ణి మళ్ళీ కిందికి తీసుకు రావటం సాధ్యమని ఆకాశ వైద్య పరిశోధనలు చేస్తున్న కర్నల్ సాక్ సిద్ధాంతీకరించేదాకా అమెరికానుంచి ఏ మానవుడు ఆకాశ ప్రయాణం చెయ్యనారంభించడు ఆకాశ నౌక సముద్రంలో పడిపోతే విమానబలమూ నౌకాబలమూ దాన్ని కనుక్కోగలవా అనేది మొదట తేల్చవలసిన సమస్య తరవాత బాగా ఎత్తుకు ఎగరేసిన రాకెట్‌లోనుంచి ఒక ఆకాశనౌకను గంటకు మూడు నాలుగువేల మైళ్ళ వేగంతో క్రిందికి సురక్షితంగా దించగలగాలి తరవాత భూప్రదక్షిణంచేస్తున్న ఉపగ్రహాన్ని దించగలగాలి ఆ తరవాత పెద్దపెద్ద జంతువులను పైకిపంపించి కిందికి తీసుకురావాలి చింపంజీలతో (మానవునికి దగ్గిరచుట్టాలు) కూడుపార్లు ఈ మాదిరి పరిశోధనలు జయప్రదంగా జరిపిన తరవాత, అవి సురక్షితంగా నేలకు వచ్చిన పక్షంలో అప్పుడు మానవుణ్ని పైకి పంపించటానికి ఎలాంటి అభ్యంతరమూ ఉండదు. ★

—['లైఫ్' నుంచి]

# పరమానందయ్య శిష్యులు

పరమానందయ్య శిష్యులు
గురువునాజ్ఞ మీరలేక -
ప్రక్కనున్న గ్రామమునకు
పయనమైరి పనిగలిగి.

పిల్లతనమువల్ల వారు
అల్లరిగా అరచుకొనుచు,
కొట్టుకొనుచు, తిట్టుకొనుచు,
కోతిపనులు జేయుచూ,

దారివెంట నడచుచుండ,
వారికెదురు వచ్చుచున్న
పల్లెటూరి పిల్లయొకతె
ఫక్కుమనుచు నవ్వెను.

అందమైన చిన్నదాని
మందహాసమహిమచేత
తెలివిలేని ఆ శిష్యులు
తగవులాడుకొన జొచ్చిరి.

"నన్నుజూచి నవ్విన" దని
"నన్నుజూచి నవ్విన" దని
తగవులాడుకొనిరి తుదకు
తలలు పగులగొట్టుకొనిరి.

దారివెంట వచ్చుచున్న
దాసరి రామయ్యవచ్చి
"తెలివిలేని యువకులార!
తగవులాడుకొన దగదు

ఆమెనె ఈ ప్రశ్నడిగిన,
తగవు చిక్కు తీరిపోవు"
అని చెప్పగ "సరే" అనుచు
అందరునూ గుంపుగా

కలసి ఆమె నడిగి రిట్లు:
"అన్నదమ్ములయిన మేము
తన్నుకొని చచ్చినాము,
నీ వెవ్వరివైపు జూచి

నవ్వినావొ చెప్పు" మనగ
"ఎవరో ఒక తెలివిలేని
కుంకవైపు జూచి నేను
నవ్వినాను" అని చెప్పెను.

సిగ్గుపడిన శిష్యులంత
మొగమువంచి ఎత్తలేక
గురువుపనికి సున్నచుట్టి
గురుకులమును జేరుకొనిరి. ★

కందికట్టు అయ్యన్న

# పేరయ్య శెట్టి

పూర్వం ఒక వూళ్ళో పేరయ్య అనే శెట్టి ఉంటుండేవాడు. అతడు చాలా నిరుపేద; అందువలన అతడంటే అంతా చిన్నచూపు చూచేవాళ్ళు. అందుకని పేరయ్య వూరు బయట ఒక పూరిపాక వేసుకొన్నాడు. ఉండటానికి యిల్లు వుంటే, తింటానికి తిండి వుండాలిగా? అందుకని, పునుగులుచేసి చుట్టు ప్రక్కలనున్న వూళ్ళకిపోయి అమ్ముకొంస్తూ జీవిస్తూ వుండేవాడు. ప్రతి రోజు, తొలికోడి కూయగానే లేచి, పిండిరుబ్బి, పునుగులు చేసి అమ్మడానికి బయలుదేరే సరికి, తెల్లవారుతూ వుండేది. ఒకరోజు పేరయ్య మామూలు ప్రకారం పునుగులు తయారుచేశాడు. కానీ; ఆరోజు బడలికగా వుంది. అందులో యింకా బాగా తెల్లవారలా. కాసేపు అలా విశ్రమించాడు. బళ్ళున తెల్లవారిపోయింది. లేచి చూచేసరికి పునుగుల జంగిడీ కాస్తా మాయమయింది. పేరయ్య గుండె 'గుభేల్' మంది. అంత చలిలో సైతం వంటినిండా చెమట్లు గమ్మాయి. పాపం! చాలా, బీదవాడు. ఎలాగో రోజూ నాలుగు డబ్బులు సంపాదించి; మూడుదాచి, ఒకవంతు ఖర్చు చేసుకుంటున్నాడు. ఇంతకూ 'పునుగుల జంగిడీ ఏమయినట్లు? ఎవరు ఎత్తుకెళ్లి వుంటారు? అన్న ప్రశ్నలే శెట్టికితోచాయి. "ఎవరో నన్నుచూసి సహించలేనివాళ్లు, నాబేరం చూచి కళ్ళల్లో నిప్పులు పోసుకున్నారు," అని, - తనలో తానే తిట్టుకొని, చివరకు వూరుకున్నాడు. ఆ మరునాడు దొంగను ఎలాగైనా పట్టుకొని పదిమందిలో పెట్టి, "నష్టపరిహారం" పది రెట్లు గుంజాలనుకున్నాడు. మరునాడు తెల్లవారుఝామునే లేచి, మామూలు ప్రకారం పునుగులు చేసి గంపలోపెట్టి మళ్లా కాసేపు పడుకున్నాడు. ఈసారి దొంగనిద్రే. దొంగనుపట్టి తీరాలని అతని తాపత్రయం. అంతలో తలుపు 'కిర్రు'మని తెరుచుకుంది. శెట్టివళ్లు "జల్లు" మంది. ప్రాణాలు బిగపెట్టి, సగం కళ్ళు తెరచి దుప్పటి సందునుంచి చూస్తూనే వున్నాడు. లోపలకు దొంగ ప్రవేశిస్తున్నాడు. పేరయ్య గుండె ఆగినంత పని అయింది. కథ అడ్డం తిరిగింది. తను యింతసేపూ దొంగవస్తాడు, వాడిని పట్టుకొని, నలుగురిచేత చితక తన్నిద్దాం అని అనుకున్నదంతా పటాపంచలయింది. అసలు పేరయ్య "దొంగా మనిషే" అని; అనుకున్నాడేగానీ, "దొంగకోతి" అని అనుకున్నాడా? తలుపు తెరుచుకొచ్చిన "దొంగ కోతి" పునుగుల బుట్ట ఎత్తుకొని వెళ్ళిపోయింది. పేరయ్య వణికే గుండెను కుదుటపరచుకొని, నిమ్మళంగా పొయ్యిలో మండే కట్టెను తీసుకొని కోతి వెనకాలే పడ్డాడు...వీలు చిక్కితే కోతిని, కసితీరా బాదుదామని. కోతి గంప తీసుకొని ఆ మసక చీకటిలో ప్రక్కనున్న కొండలదారి పట్టింది. ఎంత దూరం వచ్చాం? అసలు యిది ఎంత దూరం వెళుతుందో ... గంప తీసుకొని ఎక్కడకు వెళుతుందో చూద్దాం! అనుకొని పేరయ్య దాని వెనకనే ధైర్యంగా వెళుతున్నాడు. కోతి నడచి...నడచి...చివరకు ఓ పెద్దకొండ దగ్గరకు వెళ్లింది. ఆ కొండచుట్టూ పెద్ద పెద్ద చెట్లు... పుట్టలు భయంగొల్పుతూవున్నాయి. అడ్డం వస్తున్న తీగల సందు నుంచి కోతి, వంగిపోతూ...గెంతుతూ, ఆ కొండ సొరంగంలో జొరపడ్డది. కొండ గుహలోకి కోతి వెనకనే శెట్టి పోదామనుకున్నాడే గానీ... లేదా కాళ్లు వణుకుపుట్టాయి. సొరంగం బయటనిలబడి లోపలకు తొంగి చూస్తున్నాడు. ఇంతలో సూర్యోదయ మయింది. వెలుగు గుహల్లోకి ప్రసరించి లోపల వున్నవన్నీ శెట్టికి స్ఫుటంగా కనుపిస్తున్నాయి. కోతి బుట్ట పట్టుకొని పది అడుగులు లోపలకు వెల్లిందో, లేదో? "బిల-బిలా" "కిచకిచా"అనుకుంటూ. మందలుగా కోతులు దానిచుట్టూకూడాయి. గంప దించి కోతి తలకొకటి పంచిపెట్టింది.

# పేరయ్యశెట్టి

సూర్యకిరణాలకు సారంగంలో కోతుల కాళ్లక్రింద ఏవో రాళ్లు మెరుపుల్లా మెరుస్తునాయి... అవి ఏమిటో? అనుకున్నాడు శెట్టి... "రత్నాలేఅయివుంటాయి. రత్నాలు దేదీప్యమానంగా ప్రకాశిస్తాయి" అని చిన్నతనంలో చదివిన చదువు జ్ఞప్తికొచ్చింది. అలాటి రత్నాలు నాకేగానీ వుంటేనా! కోటీశ్వరుణ్ణి అయిపోనూ... రేపీ పాటికి వూళ్ళో పెద్ద షావుకారని పేరుగన్న సుబ్బిశెట్టి తనకు, తన కూతుర్ని యిస్తానని బ్రతిమలాడడూ? లోపలకు వెళ్లి వాటిని ఏరుకుందామనుకున్నాడు. కానీ; కోతులు తిరిగి తన్ను బయటకు రానిస్తాయా? ఏదో వుపాయం ఆలోచించి వాటిని తనింటికి రాబట్టుకోవాలి. ఏదో మనస్సులో ఆలోచించుకొని "చిటికలు" వేసుకుంటూ యింటికి తిరిగి వచ్చాడు పేరయ్యశెట్టి...

ఇంటికి వచ్చిన దగ్గర్నుంచీ సారంగంలోవున్న కోతులు... మెరపులు మెరసే రత్నాలు కళ్ళ ముందు నాట్యం చేస్తున్నాయి... కళ్లుమూస్తే చాలు ఆ రత్నాలన్నీ తనింటికి ప్రవాహంలా పొరలుతూ వచ్చినట్లు వుంది. తను పల్లకీలోకూర్చుని వుండగా సుబ్బిసెట్టి వినయక్రతో విన రుతున్నట్లు వూహాలు, వూహించుకున్నాడు. ఎలాగో పొద్దుగూకింది... చీకటిపడింది... తొలికోడి కూసింది... పేరయ్యలేచి పునుగులు తయారు చేసి గంపలో పెట్టాడు. ఇంటిచూరులోవున్న పెనకత్తి తీసుకొని తలుపు ప్రక్కగా నిలుచుని... కోతి కోసం ఎదురు చూస్తున్నాడు... కాసేపటికి తలుపు కిర్రుమంది. కోతి లోపలకు వచ్చింది. శెట్టి గభాలున కోతి తోకను చేత్తోపట్టుకున్నాడు. "కోతి కిచ కిచా" అంది భయంతో. శెట్టి కత్తి చూపిస్తూ... "తోక కుతికలోకి కోస్తా జాగ్రాత్తా" అని బెదరించాడు. కోతి దీనంగా కళ్ళవెంట నీరు గారుస్తూ... "ఇలాటిపని జన్మలో చేయను. నీకు పుణ్యముంటుంది. తోక మాత్రం కోయబోకు... తోక లేనికోతి బ్రతుకు చుక్కానిలేని పడవతోసరి" అని, దీనంగా శెట్టిని బ్రతిమలాడింది కోతి. "అమ్మ దొంగా! నీవు చేసిన పని యిదా? నేను కష్టపడి పునుగులుచేసి అమ్ముకుందామంటే నీ పొట్టన పెట్టుకుంటావ్? ఇప్పుడు నాకు నష్టపరిహారం యిస్తేగానీ వదలను..." అన్నాడు శెట్టి. "బాబ్బాబు" నీకు దణ్ణం పెడుతా. నీ నష్టం తీర్చడానికి నాదగ్గ రేముంది చెప్పు "పోనీ ఏదన్నా చేతనయిన సాయం చేయమంటే చేస్తా" నందికోతి. 'ముమ్మాటికీ చేస్తావుగదూ"? ఓ! "తప్పకుండా" అన్నట్లు తలాడించింది కోతి... "మరి... మరి... అలాగైతే... మీరున్న.... సారంగం.... కొండ సారంగం అందులో వున్నాయే... జిగేలున మెరుస్తున్నాయి. అవి తెచ్చి పెట్టు" అన్నాడు లాలనగా శెట్టి... "ఓస్ అవా? కావాలసినన్ని ఉన్నాయి ... తెచ్చిపెట్టమంటావా?" అంది కోతి ... శెట్టి సంతోషానికి హద్దులేదు.

"నీవు రోజూ వాటిని నాకు తెచ్చిపెట్టు ... నేను రోజూ నేతి పునుగులుచేసి ... నీకు యిస్తాను సరా?" సరే నంది కోతి ... శెట్టి తోక వదలాడు ... కోతి సెలవు తీసుకుంది... కోతి అన్న ప్రకారం ...మళ్ళా తెల్లవారు ఝామున గంపతోరత్నాలుతీసుకొనివచ్చింది. ...శెట్టి కాసేపు వాటిని 'పరికించి చూచాడు ... అవి నిజంగా రత్నాలే! శెట్టి సంతోషానికి అంతు లేదు...పునుగులు గంప కోతినెత్తికెత్తాడు..."రేపు గూడా తీసుకరా.. రేపు...జిలేబీ..జిలేబీ" నరేనని కోతి వెళ్లిపోయింది.

ఇంకేముంది పేరయ్య అనుకొన్నట్లు సుబ్బిశెట్టి అల్లుడయ్యాడు. ఇప్పుడు పేరయ్య కోటీశ్వరులలో శతకోటీశ్వరుడు.★

L. R. SWAMI,

# ★ శ్రీవారితో సినిమాకు ★

(23 వ పేజీ తరువాయి)

ఏమేడ్పిస్తున్నాడోనని "సరే చూసివస్తానుండండి" అంటూ లేచాను.

ఇద్దరూ అంతలోకి దర్శనమిచ్చారు. పిల్లవాడి నోట్లో ఒక చాకలెట్టూ చేతిలో మరొకటి. దానిని బట్టి గ్రహించుకున్నా బయట ఏదో వాడు గోలచేసి ఉంటాడు అని.

హిందీ సినిమా అంటే ఎంతో శ్రద్ధాసక్తులతో చూసే దానిని అందుకు పూర్తి వ్యతిరేకంగా ఉన్నాను ఈ రోజు. కారణం సినిమాకన్న ఈ సంఘటనదే పసందుగానూ, సర్దాగానూ ఉండటమేమో!

"మీ వదిన మంచిదేనా?" ఆమె అలాగే ఫీలవుతున్నది కాబోలు లోకాభిరామాయణంలోకి దిగింది.

"పోలుద్దామన్నా మాలో అలాంటివారు మరెవ్వరూ లేరండి. ఎంత వినయం ఎంత అణకువ?! "వేషధారణ చేసిన తర్వాత పాత్రకు న్యాయం చేకూర్చటం ధర్మంగా!

"అహ! చదువుకుందా ఏమయినా?"

"ఇంటర్మీడియటు చదివింది కాని పరీక్షకు కూర్చోలేదు."

"ఆహా! కాలేజీ చదువులు చదివికూడా వినయంగానూ అణకువగానూ ఉంటుందంటే మెచ్చుకోదగ్గ విషయమే. అంతే నమ్మాయ్. కొందరు ఎంత చదువులు చదువుకున్నా సంసారపక్షంగా ఉంటారు. కొందరేమో పొట్టపొడిచినా అక్షరం ముక్కలేకపోయినా సానులాగా తయారవుతారు. మాపినమామగారి కూతురి ఆడబిడ్డ కూతురుంది. అమ్మో! దాని సొగసులూ, దాని వేషాలూ చెప్పలేమనుకో— రోజూ ఏదో సినిమా చూడాల్సిందేగదా. మరీ సినిమాలు చూస్తుందాయను, తనుకూడా అచ్చంగా ఆ సినిమా తారల్లాగానే తయారవుతుంది. దాన్నెవరు చేసుకుంటాడో గాని—వాడ్ని ముప్పతిప్పలు పెట్టి మూడు చెఱువులు నీళ్ళు తాగిస్తుందనుకో. రెండు జడలూ, స్లిప్పర్లూ, లిప్ స్టిక్ ...అదీ..."

"నన్ను చూసి మీరేమనుకుంటున్నారు. నేనూ రెండు జడలూ వేసుకుంటాను. స్లిప్పర్లు తొడుక్కుంటాను. సంసారం చేసే దానిలాగా లేనా?"

"అంతమాట అంటావా నిన్ను" కొందరుంటారని చెప్పినిగా. రెండుకాదు నాలుగు జడలు వేసుకున్నా—అణకువగా నేఉంటారు. పెద్దలంటే భక్తి గౌరవాలుంటాయి. అన్నట్లు నువ్వేం చదువుకున్నావమ్మాయి?"

"ఆ! నా చదువుకేముందిలెండి. నానా కాలం చదువు. మా అమ్మ ఆడపిల్లలకు చదువు అంటే ససేమిరా ఒప్పుకోదు. ఏదో థర్డ్ ఫారమ్ దాకా చదువుకొన్నాను. అంతే!"

"నే చెప్పలా! అట్టే నీకు కాలేజీ చదువులేమీ లేవు కాబట్టే యీ వినయం, యీ వందనమున్నూ. నీ విషయమేమీ గొప్ప కాదు. మీ వదిన సంగతే మెచ్చుకోతగ్గది. ఆ అమ్మాయిని నేను చూడాలమ్మాయి. నాకు బలే వచ్చింది. ఎన్నో నెలన్నావు ఇప్పుడూ?"

నాకు నవ్వు వస్తున్నది.

"అలా నవ్వుతావేమమ్మాయ్! అయిందానికీ కానిదానికీ. ఆడపిల్లకంత వెకలితనం పనికిరాదు. కొంచెం అణిగి ఉండాలి"

ఆమెకు కోపం వచ్చిందని తెల్సుకున్నాను.

"నాకన్న మా వదిన వచ్చిందంటే నవ్వు వచ్చిందిలెండి ఎన్నో నెలనికదూ అడిగారు నాకు తెలియదండి సరిగా."

"నీది మరీ సోద్యమమ్మాయి. మీ వదినకెన్నో నెలో నీకు తెలీకుదూ. మీ అన్నయ్యకు అన్నంవండి పెట్టటానికి వచ్చిన దానివి ఎన్నాళ్లుండవలసి వస్తుంది అని ఆలోచించుకొని రాలేదూ మరి?"

"మా అన్నయ్యకన్నంవండి పెట్టటానికి వచ్చానని మీ కెవరు చెప్పారు?"

"అన్నంవండి పెటటానికి కాకపోతే మరి దేనికి వచ్చినట్లు! రెండు జడలు వేసుకుని, స్లిప్పర్లు తొడుక్కుని, ఒళ్ళు కనపడే చీర కట్టుకుని, మెడంతా కనపడే జాకెట్టు తొడుక్కుని సినిమాలు చూడటానికే వచ్చింది?"

ఇందాకటినుంచి యీ అన్నా చెల్లెంద్ర నాటక మనవసరంగా ఆడుతున్నామేమోనని బాధపడుతున్నాను నేను. కాని ఇప్పుడదెంతో అవసరమని తెలుసున్నది— నేనే గనుక గుమాస్తా భాస్కరం భార్యనని ఆమె తెల్సుకుండా రేపటినుంచి మా వారు పడే బాధ ఆ పరమాత్ముడికే తెలియాలి!

ఆఫీసరుగారింటికి తఱుచూ పోయి వస్తూండాల్సిన పనులుంటాయి మా వారికి. పోయినప్పుడల్లా సూటీ పోటీ మాటలంటూ ఉంటుందీమె. "మీ ఆవిడెక్కడ? రెండు జడలూ, స్లిప్పర్లూ ... అసలు మొదటమ్మాయిని చూసినప్పుడు మీ ఆవిడనుకోలేదు భాస్కరం...ఏ సినిమా స్టారో అనుకున్నాను.. నీవు వేళ కాఫీసుకు రాగలుగుతున్నావా?—ఆ అమ్మాయి నీకు వేళకన్నం వండి పెట్టుందా—అని నా అనుమానం..." ఇలా, ఇలా.

అమ్మగారి తరహా ఇలా ఉంది; ఇక అయ్యగారి తత్త్వమెలా ఉంటుందో— మరి!

ఇదంతా మావారూ గ్రహించుకునే నాటకం బూటకం కాకుండా పాత్రను యథాశక్తిన పోషిస్తున్నారు.

"ఏమండీ! మమ్మల్నేమయినా సినిమా చూడనిచ్చేది ఉందా లేదా! అంతగా మీరు చూడదలుచుకోనకపోతే బయటకి పోయి మాటాడుతూ వచ్చానుగా" వెనక నుంచి ఒకామె మెత్తగా మందలించింది. దాంతో మా ఇద్దరి నోళ్ళకూ తాళాలు పడ్డాయి.

సినిమా అయిపోయింది. జనం వత్తిడిగా ఉంటేను పక్కకు తొలిగి నిల్చున్నాం—రద్దీ తగ్గిన తర్వాత పోవచ్చునులే అని.

జనం పల్చపడుతున్నారు. ఆ జనంలో మా పింతల్లి కొడుకు మూర్తి కన్పించాడు నాకు. వాడ్ని చూసేసరికి నాగుండె వేగంగా స్పందించ సాగింది. ఎక్కడ మమ్మల్ని చూస్తాడో అని భయం భయంగా ఉంది. చూశాడా వదలడు; కలుపుగోలుతనం పాలు వాడిలో మహాజాస్తి మమ్మల్ని చూడకుండా వాడిదారిన వాడుపోతే దేముడికి నాలుగు కొబ్బరికాయలు కొట్టానని మనసులో మొక్కుకుంటూనే ఉన్నాను— వాడు మావార్ని పలకరించాడు.

"ఒక్కడివే వచ్చావేం బావా! అక్కయ్యను తీసుకురాలా?"

కొంచెం ఇవతలగా నిల్చున్న నన్ను స్థూలకాయురాలు 'మాస్క్' చేసింది. ఆమె స్థూలకాయం ఉపయోగపడినందుకు ఆమెను అభినందించారు మనసులోనే.

"రాలేగు."

"ఏం?" వాడు ఊరుకుండే ఘటంకాదు.

విత్తర చూపులు చూస్తూ నిల్చుండిపోయారాయన.

"మొగవాడివి సిగుపడతావేమోయ్! పురిటికని నిన్నే పుట్టింటికి పంపించాడోయ్" ఆఫీసరు తన తెలివి బయటపెట్టాడు.

"వాట్? అక్కయ్యను నిన్న ఊరికి పంపించావా? రాలేదే! ఎవరికిచ్చి పంపించావు? నేను వచ్చింది ఇంతకుముందుగానే. అయిదుగంటల బండికి... అప్పటిదాకా రాలేదే!"

ఆఫీసరు మావారి తెల్లమొహం పక్కెగాదిగా చూస్తారు; మావారు భావశూన్యంగా ఎటో చూస్తారు.

"మీ ఊరు కాదోయ్...మాఊరు పంపించాను. రేపో ఎల్లుండో మీ ఊరు వస్తుంది" తెలివిగా తప్పించుకున్నారు మావారు

"అట్లా చెప్పు...సరే! వస్తాను బావా! బయట రోడ్డుమీద స్నేహితులున్నారు" అంటూ వాడు వెళ్ళిపోయాడు.

గుండెలు కుదుటపడ్డయ్. ఇక అక్కడ

# ★ శ్రీవారితో సినిమాకు ★

ఉంటే పరువు ఉండేట్లు లేదు అనుకుని "పదండి...పోదాం" అన్నాను.

అందరం కదిలి నాలుగడుగులు వేశామో లేదో—

"ఏమోయ్! ప్రభాకర్రావ్? ఎప్పుడు వచ్చావ్?" ఆఫీసరు ఎదురుపడ్డ యువకుడ్ని పలకరించాడు.

ప్రభాకరావ్! గుండెల్లో రైళ్ళు పరిగెత్త సాగినయ్.

ఎవరీ ప్రభాకర్రావు?

కొంపతీసి ఇందాకటినుంచీ వాళ్ళనే ఫిజిక్స్ లెక్చరరు ప్రభాకర్రావు కాదుగదా! మా తమ్ముడు మా రిపరువు నిలబెట్టాడనుకుంటే మళ్ళీ ఈయనొకడు తయారయాడే;

ఒక్క అబద్ధ మాడినందుకు- కాదు, వాళ్ళ అపోహను కాదననందుకు- ఎన్ని పరీక్షలకు గురికావలసి వస్తున్నది? చివరకి యీ నాటకం మా పరువు మర్యాదలను రచ్చకీడుస్తుందా?

"ఇవాళే పొద్దున వస్తున్నానండి. మా స్నేహితు డింటికివచ్చాను. రేపు మీ ఇంటికి రావాలనుకుంటున్నాను."

అతనిపక్క ఒక యువతికూడా ఉంది. బహుశా అతనిభార్య అయిఉంటుంది.

"మీ చెల్లెలా ఆ అమ్మాయి?"

నేననుకున్నంతా అయింది! ఈ ఆఫీసరు మమ్మల్ని పరువుగా ఇంటికి పోనీయదల్చుకోలేదు. నేను భయంభయంగా మా వారివంక చూశాను. ఆయన ఆకాశంలోని చుక్కలు లెక్క పెడ్తున్నట్లున్నారు.

ప్రభాకర్రావు సన్నగా అర్థయుక్తంగా నవ్వాడు.

ఆఫీసరుభార్య నా వంక చూసి ఒకటే ముసిముసి నవ్వులు.

"మీరు మా పెళ్ళికి రాలేదుగా-ఉత్తరం వ్రాసినా!" అన్నాడు ప్రభాకర్రావు. పక్కనున్నామె భార్య అని అర్థం చేసుకోమన్నట్లు ఆఫీసరు పెద్దవాడు, పాతకాలపు వాడు కాబట్టి అతను ఒకరినొకరికి పరిచయం చేయటానికి సందేహించాడని నేను గ్రహించాను, అదీ ఒకందుకు మేలే!

"ఏమిటోనోయ్! ఎండలు ముదిరినయ్ - అప్పటికే" అని ఆఫీసరంటే,

"పిల్లా జెల్లా నేసుకుని ప్రయాణమునే సరికి భయపడ్డా మబ్బాయ్" అని అందుకుంది ఆఫీసరు భార్య.

"పెళ్ళికి రాకపోతేమటుకేం? ఇవ్వాళ

మీ ఇద్దరినీ చూశాము గా!" అన్నాడు ఆఫీసరు. నన్నూ, ప్రభాకరరావునూ మార్చి మార్చి చూస్తూ.

"ఈడూ - జోడూ అయిన సంబంధం. అమ్మాయి మాణిక్యమనుకో" అన్నది ఆఫీసరుభార్య నా తల నిమురుతూ.

నా మనసు మనసులో లేదు,

మా వారి కీ సంభాషణ కర్ణకఠోరంగా ఉందని వారి వాలకం చూస్తేనే తెలుస్తున్నది.

"ఎందుకమ్మాయ్ రాధా! అంత సిగ్గుపడతావ్? ఇక్కడ పరాయివాళ్ళెవరున్నారు?" అంటూ ఆమె నా తల పైకెత్తింది

"సరే! నీది మరీ బాగుంది. నలుగురిలో సిగ్గుపడక చిందులేయమంటావా?"

ఆఫీసరు తనకు తోచింది అన్నాడు.

"ఏమ్మాయ్! నీ పేరేమిటి?" అని ప్రశ్నించింది ఆఫీసరుభార్య-ప్రభాకరరావు ప్రక్కనున్న యువతిని.

"మంజుల"

"ఏ ఊరిచ్చారు?" మంజుల ప్రభాకర రావు మొహంలోకి చూసింది.

ప్రభాకరరావు "మా ఇద్దర్ని గురించి ఇంత చెప్పి ఏ ఊరని అడుగుతారేమిటో?" అన్నట్లు ఆఫీసరు భార్యవంక చూశారు; రామాయణమంతా విని 'రామునికి సీతేమికావాలి' అని ప్రశ్నిస్తే ఎవరయినా ఆశ్చర్యపోరా? నవ్వరా?!

ఆమె తనేమయినా తప్పుగా అడిగానా - అని ఆలోచించసాగింది.

"ఏమిటోయ్ భాస్కరం! అలా ఆకాశం వంక చూస్తావేం? మీ బావమఱదిని పలకరించవేం?...ఆఫీసరు మావారి భుజం మీద తడ్తూ ప్రశ్నించారు

ప్రభాకరరావు చుట్టూ చూశాడు — మావారి బావమఱదికోసం.

కుడితిగుండంలో చిక్కుకున్న గడ్డిపోచ లాగా ఉంది నా పరిస్థితి

మూలిగే నక్కమీద తాటికాయ పడ్డట్లు మా మూర్తి కిళ్ళీ నములుతూ, సిగరెట్టు తాగుతూ మళ్ళీ లోపలికివచ్చాడు మమ్మల్ని చూసి సిగరెట్టు గబుక్కున క్రిందపారేసి ఏమీ ఎఱుగనట్లు మా దగ్గఱికి వచ్చాడు.

"అక్కయ్యా! నువ్విక్కడే ఉన్నావే. బావ ఊరికి పంపించానంటావే — ఇందాక కన్పించి, ఈ అబద్ధాలు ఎప్పుడు నేర్చుకున్నావ్ బావా!"

బావ మొహంలో నెత్తురు చుక్క లేదు. నా పరిస్థితీ డిటో.

"అమ్మాయి రాధా! అయితే నువ్వు భాస్కరం చెల్లెలివి కాదూ. భార్యవా?" ఆఫీసరుభార్య, చూపుడు వేలు ముక్కుమీద వేసుకుని, బొటనవ్రేలుతో గడ్డంక్రింద నొక్కుకుంటూ ఆశ్చర్యపడసాగింది.

ప్రభాకరరావూ, మంజులా, మూర్తీ— నాటకంమధ్యలో ప్రవేశించటంతో పాత్రలర్థంకాక నిశ్చేష్టులయ్యారు.

ఆఫీసరూ, ఆయనభార్యా — నన్నూ, మావారినీ మార్చి మార్చి కళ్ళింతవి చేసుకుని ఆశ్చర్యంగా, అనుమానంగా చూడసాగారు.

ఇక యీ నాటకం సాగనీయటం సమంజసం కాదనుకుని—

"చెల్లెల్ని నేను మీకు చెప్పానా? మావారు చెప్పారా? మీరే అపోహపడ్డారే గాని..." అన్నాను నేను ధైర్యం తెచ్చుకుని.

ప్రభాకరరావూ, మంజులా సగమర్థమయినట్లు నవ్వీనవ్వకుండా ఉన్నారు.

"నువ్వనేది నాకర్థమవటంలేదక్కయ్యా!" మూర్తి మధ్యలో అందుకున్నాడు.

"నువ్వొకడివి-మాకు దొరికావు. ఇంటికి పద"

"సెకండ్ షో చూసుకు వస్తానులే"

"రేపు మీ ఇంటికి వస్తాములెండి" అని ప్రభాకరరావూ, మంజులా లోపలికి వెళ్ళారు. మేమందరం రోడ్డుమీదకు వచ్చాం. పిల్లలప్పటికే రిక్షాలెక్కి కూర్చున్నారు. మేమిద్దరం మరోక రిక్షా మాట్లాడుకుని వెనక్కి తిరిగిచూడకుండా ఇంటిదారి పట్టాము.





డాక్యుమెంటరీ చిత్రాలను ప్రజల అభిమానానికి పాత్రం చేయడానికి ఫిలింస్ డివిజన్ ఆరంభించిన పథకం ఫలప్రదాయకం అవుతోందని చెప్పవచ్చును

బొంబాయిలో వీటకై ప్రత్యేకం ఒక థియేటరు కేటాయించి రోజూ ఇవే ఆడుతున్నారు వీటిని చూడవచ్చేవారిసంఖ్య రోజురోజుకూ పెరుగుతోంది

అయితే ఈ ప్రేక్షకులలో ఎక్కువమంది బడిపిల్లలు అని కొందరు నిరాశావాదులు అన్నారు కాదు, పెద్దవాళ్ళు కూడా సకుటుంబ బంధుమిత్ర సపరివారం వచ్చి చూస్తున్నారనీ, చూసి బాగున్నాయని పక్కింటివాళ్లకి చెబుతున్నారనీ ఆశావాదులు వెల్లడించారు మొత్తానికి ఎలా చూచినా, వీటిని ప్రత్యేకం చూచే అవకాశం అనేది కలిగిన మీదట, డాక్యుమెంటరీల మీద ప్రజలకు గౌరవాభిమానాలు ఉన్న విషయం విదితం అవుతున్నది ఇతర కేంద్రాలలో కూడా ఈ పథకం ఆరంభించి, తగుప్రచారం చేస్తే, అచిరకాలంలోనే ప్రజలను ఆకర్షించడంలో ఈ చిత్రాలకు గల శక్తిసామర్థ్యాలు అసందిగ్ధంగా రుజువు కాగలవు డాక్యుమెంటరీలు ప్రేక్షకులకు చిరాకు కలిగిస్తాయనీ, కాలయాపనకు, చోటా దండుగ అనీ ఫిలిం వణిజులు చేసే వాదాలు నిరాధారాలని కూడా తేలిపోతుంది

ఫిలిం డివిజన్‌వారు, నిర్మాణ కార్యక్రమాన్ని విస్తరించి, పలువురు ప్రయివేటు నిర్మాతలను డాక్యుమెంటరీలు తీయడానికి నియోగిస్తున్న ఈ సమయంలో, విషయ నిర్ణయం, చిత్రణ, మొదలైనవాటిలో ఇప్పటివరకూవున్న ప్రమాణాలు పడిపోకుండా జాగ్రత్తపడడం అవసరం ఇటీవల ఒకటిరెండు డాక్యుమెంటరీలు చూచినమీదట ఈ భావం కలగడానికి ఆస్కారం ఏర్పడింది ప్రజానీకానికి సంగతిసందర్భాలు తెలియచెప్పడం అవసరమే అయినా, వాళ్ళని మరీ నిష్ప్రయోజకులుగా జమకట్టి, నీతిపాఠాలు చెప్పబోవడం బాగుండదు అలాగే, పారిశుద్ధ్యం విషయంలో జాగ్రత్త అవసరమని హెచ్చరించడానికి, మరీ జుగుప్స కలిగేవిధంగా చిత్రణ సాగించడం భావ్యంకాదు

తయారయే ప్రతి డాక్యుమెంటరీ అపురూప కళాఖండం అయితీరాలనీ, దాంతోపాటు, దేశాన్ని మరమ్మత్తుచేసి వీలైతే ఓ అరంగుళం ఉద్ధరించేయాలని ఎవరూ అనరు అయినా, పదిమంది చూచి ఆనందించవలసినవాటిని తయారుచేసినపుడు ఇటు ప్రయోజనంతోపాటు, అటు ఉన్నంతలో వీలైనంతవరకూ అందచందాలూ సంగతి కూడా దృష్టిలో ఉంచుకోవడం మంచిది

ఓ క్షణమాత్రం నిజం ఈ దశలో డాక్యుమెంటరీ చిత్రాలకు ఏయితర దేశానికీ తీసిపోని ప్రజాదరణ లభించగలదనడం నేటికి కాకపోతే, రేపటికైనా తథ్యం. ★

## సాధన

బి ఆర్ (ఏక్ హీరాస్తా, నయాదౌర్) చోప్రా కొత్త చిత్రం 'సాధన' నిర్మాణం పూర్తి కావచ్చింది ఆగస్టులో విడుదల కాగలదని తెలుస్తోంది

ఒక పతిత స్త్రీ కష్టసుఖాలను చెప్పడం ద్వారా, సమకాలిక సాంఘిక దురాచారాలను, వ్యక్తుల దౌర్బల్య ప్రవృత్తులను చిత్రిస్తూ ముఖరాంశర్మ దీనికి కథ వ్రాశారు ముఖ్యపాత్రను వైజయంతిమాల నిర్వహిస్తోంది ఇతర నటులు సునీల్ దత్, లీలా చిట్నిస్, రాధాకిషన్ మనోమోహన్ కృష్ణ

పాటలు సహీర్ లూధియాన్వి వ్రాస్తున్నారు సంగీతదర్శకుడు ఎన్ దత్త ★



సంగీతావారి 'ఇంటిగుట్టు'లో ఆర్. నాగేశ్వరరావు, పుష్పవల్లి



బి. ఎన్. రెడ్డి, గౌరవార్థం వాహినీ ప్రొడక్షన్స్ ఉద్యోగులు విందుచేశారు. రెడ్డిగారిని అభినందిస్తూన్న శ్రీ ఎన్. టి. రామారావు, శ్రీ బి. ఎన్., వారి సోదరుడు శ్రీ బి. నాగిరెడ్డి.

# 'చలనచిత్ర పరిశ్రమకు సత్కారం'

"ఇది చలనచిత్ర పరిశ్రమకే సత్కారం" అని, చలనచిత్ర పరిశ్రమకు చెందిన వివిధ శాఖలలో ప్రముఖులంతా గతవారం హర్షం వెలిబుచ్చారు.

అది: ఆంధ్ర ప్రదేశ్ ఎగువ శాసనసభలో సభ్యుడుగా, ప్రసిద్ధ చలనచిత్ర దర్శకుడు, శ్రీ బి ఎన్. రెడ్డిని ప్రభుత్వం నియమించడం.

జూలై 7 న రెడ్డిగారు హైదరాబాద్ వెళ్ళి ప్రమాణ స్వీకారం చేశారు.

ఆయన సభ్యులుగా నియుక్తులైన వార్త, వార్తా పత్రికలలో రాగానే, దేశం నలుమూలలనుండి, ఆయనను వ్యక్తిగతంగా ఎరిగి ఉన్న వారేకాక, ఆయన చిత్రాల ద్వారా ఉత్తమ శ్రేణి కళాకారుడుగా ఎరిగిన వారుకూడా అనేకులు ఉత్తరాల ద్వారా, టెలిగ్రాములద్వారా, టెలిఫోనుల ద్వారా అభినందనలతో ముంచెత్తి వేశారు. చలనచిత్ర పరిశ్రమ పేరిట ఆయనను ఎన్నిక చేయడం ఎంతో సముచితంగా ఉందని, ఈ గౌరవానికి రెడ్డిగారు అన్ని విధాలా అర్హులు అని పేర్కొన్నారు.

వాహినీ ప్రొడక్షన్స్ ఉద్యోగులంతా కూడ బలుక్కుని. రచయిత డి. వి. నరసరాజు నిర్వాహకుడుగా రెడ్డిగారి గౌరవార్థం ఆయనకు ముందు చెప్పకుండా మొట్టమొదటి విందు చేశారు.

"ఊళ్ళోనూ, దేశంలోనూ చిన్నా పెద్దా అందరూ ఆయన్ని ఎలాగా అభినందిస్తారు. అవి జరిగేలోగా, ఆయనదగ్గర పనిచేస్తూ, ఆయన సహృదయాన్ని ఎరిగి, సహచరులుగావుంటున్న మేము మానంతోషం వెల్లడి చేసుకోవడానికి ఇది ఏర్పాటుచేశాం" అని ఆనాటి సన్మానపత్రం చదువుతూ నరసరాజుగారు అన్నారు. ఆయన అన్నట్టు మూడవనాడే, తెలుగు నటీనటులంతా కలసి విజయాగార్డెన్స్‌లో సభ చేసి అభినందించారు.

వాహినీబృందం విందు, ఆనాటి వక్తలలో ఒకరన్నట్టు కౌటుంబిక గోష్ఠిగా జరిగింది. కంపెనీ ఉద్యోగులు కాక, వారి కొత్త చిత్రంలో పనిచేస్తున్న ఎన్. టి. రామారావు, రాజసులోచన (సభకు, స్టుడియో నుండి సరాసరి వేషంతోనే ఈ యిద్దరూ వచ్చారు) వచ్చి అభినందించారు. కొటూరి వెంకటేశ్వరరావుగారు ఉందరి నాగేంద్రరావుగారు ఆశీర్వదించారు. గోష్ఠికి విజయా నాగిరెడ్డిగారు అధ్యక్షులు. "బి. ఎన్. మా అన్నగారు. వారిని గురించి నేనేం మాట్లాడినా... నాకు చాలా గర్వంగా, సంతోషంగా ఉందనిమాత్రం చెప్పగలను" అన్నారు నాగిరెడ్డి.

* * *

విజయా గార్డెన్స్‌లో విందుకు చలనచిత్ర పరిశ్రమ శాఖోపశాఖలకు చెందిన పెద్దలందరూ వచ్చారు. వారేకాక, రచయితలూ, పత్రికా రచయితలూ, పలువురు వచ్చి శుభాభినందలు చెప్పారు. ఆతిథ్యం ఇచ్చిన నటుల సంఘంలో నాగయ్య స్వాగతంచెప్పి, రెడ్డిగారికి జోహార్లు అర్పించారు. ఎన్. టి. రామారావు సన్మానపత్రం చదివి తమగౌరవాభిమానాలు తెలియ చేశారు. ఎస్. వి. రంగారావు స్వాగత పత్రాన్ని రజతపేటికలో ఉంచి సమర్పించారు. సావిత్రి రెడ్డిగారి లలాటాన తిలకరేఖ దిద్దింది. అంజలీదేవి, జి. వరలక్ష్మి పుష్ప గుచ్ఛాలు సమర్పించారు. నాగేశ్వరరావు శాలువలు కప్పి సత్కరించారు. రేలంగి వెంకటరామయ్య వందన సమర్పణ చేశారు.

"రెడ్డిగారు చలనచిత్ర కళకే పేరుప్రతిష్ఠలు చేకూర్చారు. వారు మా ఆదర్శ ప్రతినిధులని సగర్వంగా చెప్పుకుంటున్నాము" అన్నారు రామారావు. "అన్నివిధాలా తే



## ★ ఫిలింఫాన్స్ బహుమతులు ★

మద్రాసు చలన చిత్రాభిమానుల సంఘం, 1957 లో విడుదలైన ఉత్తమ చిత్రాలకు, వాటిలో పాల్గొన్న కళాకారులకు గతవారం విజయా గార్డెన్స్‌లో సత్కారం చేసింది. మద్రాసు గవర్నరు శ్రీ విష్ణురాం మేధీ బహుమతులు పంచిపెట్టారు. ఉత్తమ తెలుగునటుడుగా శ్రీ యన్.టి. రామారావు బహుమతిని అందుకుంటున్నారు.

గౌరవానికి అర్హులు" అన్నారు రంగారావు. "సజ్జనుడు. సన్మిత్రుడు, ఉత్తమశ్రేణి దర్శకుడు" అన్నారు అధ్యక్షులు శార్ల వెంకటేశ్వరరావు. "బి ఎన్ ను ఎన్నిక చేసినందుకు ఆంధ్రప్రభుత్వానికి నా అభినందనలు" అన్నారు ఖాసా సుబ్బారావు. "రెడ్డిగారు చలనచిత్రసీమలో అందరికీ పూజనీయులు. కళాపిపాసి...రాజకీయరంగంలో ప్రజలకు ప్రాతినిధ్యం వహించేవారు, మామూలుగా తెలిసో తెలియకో తాము నమ్మిన లక్ష్యాలకే కృషిచేసారు. తమ అభిప్రాయాలతో పాటు 'తమవారి' భావాలనూ సమన్వయించుకుని, వాటిని మన్నించి వ్యవహరించగల విశాల హృదయం, సంస్కారం రెడ్డిగారిలో ఉన్నాయి అందువల్ల వారు అతిసమర్థంగా మన అందరి శ్రేయస్సుకు దోహదంచేసే విధంగా ఈ కొత్త బాధ్యతను నిర్వహించగలరని నా నమ్మకం" అన్నారు నాగేశ్వరరావు.

రెడ్డిగారు సన్మాననాకు, సముచిత రీతిన సమాధానం చెప్పారు.

"చలనచిత్ర పరిశ్రమ శ్రేయోభివృద్ధికి కాయశక్తులా పాటుపడతాను"అని అన్నారు.

ఆంధ్రలో ఊరూరా ఒక నాటకశాల నెలకొల్ప చేయడానికి కృషిచేయ సంకల్పించినట్లు కూడా ఆయన వెల్లడించారు ★

## వార్తలు

అన్నపూర్ణా పిక్చర్స్ వారి కొత్త చిత్రం ఆదుర్తి సుబ్బారావుదర్శకత్వాన తెలుగు తమిళ భాషలలో చురుకుగా తయారవుతోంది. గత వారం, విజయా స్టుడియోలో అల్పాహారవిందు సెట్ వేసి,కొన్ని సన్నివేశాలను చిత్రించారు. వీటిలో సావిత్రి, రాజసులోచన, సూర్యకాంతం, సుందరీబాయి (తమిళానికి), నాగేశ్వరరావు, రంగారావు, రేలంగి, తంగవేలు (తమిళానికి), రమణమూర్తి, బాలాజీ (తమిళం), ఇంకో యాభై అరవై మంది చిన్న నటులూ పాల్గొన్నారు.

ఈ చిత్రానికి మాటలు ఆత్రేయ, పాటలు శ్రీశ్రీ, ఆత్రేయ, కొసరాజు వ్రాశారు. సంగీతదర్శకుడు వేణు ఛాయాగ్రహణ దర్శకుడు సెల్వరాజ్. నిర్మాత మధుసూదనరావు.

* * *

సాహిణీవారి 'బండరాముడు' కూడా రెండుభాషలలో తయారవుతోంది. రామారావు, సావిత్రి, రేలంగి, రాజనాల, సూర్యకాంతం నటిస్తున్నారు. రచయిత ఆత్రేయ. సంగీతం దక్షిణామూర్తి. దర్శకుడు పి. పుల్లయ్యగారు. నిర్మాతలు డి బి. నారాయణ, డి భావనారాయణ.

* * *

తిరుమలా పిక్చర్స్‌వారు 'సమాజం' అనే చిత్రం నిర్మిస్తున్నారు. జగయ్య, రాజసులోచన, గిరిజ, నాగయ్య, సి ఎస్. ఆర్, గుమ్మడి, రేలంగి, ఆర్. నాగేశ్వరరావు, పేకేటి మొదలగువారు నటిస్తున్నారు. రచయిత సముద్రాల రామానుజం. సంగీతం అశ్వత్థామ. దర్శకత్వం అడాల నారాయణరావు. నిర్మాత వై. ధనరాజ్.

* * *

అనుపమ ఫిలింస్ వారి కొత్త చిత్రం 'అత్తా ఒక యింటి కోడలే' తిలక్ దర్శకత్వాన చురుకుగా తయారవుతోంది. ఇటీవల ఈ చిత్రం బృందం ఆంధ్ర దేశంవచ్చి తెనాలి పరిసరాలలో ఔట్ డోర్ దృశ్యాలు తీశారు. జగయ్య గిరిజ, రమణారెడ్డి, హేమలత, చదలవాడ కుటుంబరావు పాల్గొంటున్నారు. రచయిత పినిశెట్టి, సంగీతం పెండ్యాల. ★



తెలుగు తమిళ చిత్రసీమలలో ఉత్తమ నటి శ్రీమతి సావిత్రి.

# సోవియట్ చలన చిత్ర కళ

రష్యాలో పందొమ్మిదో శతాబ్దం అంత్య దశలో 'లమియేర్' చిత్రాలు రావడంతో రష్యన్ చలనచిత్ర పరిశ్రమ ప్రారంభమయింది. చలనచిత్ర నిర్మాణ కేంద్రాలలో 'మాస్కో దృశ్యాలు; క్రెమ్లిన్', 'యల్. యన్. టాల్‌స్టాయ్ ఎనభయ్యోజయంతి' వంటి సరళమైన డాక్యుమెంటరీ చిత్రాలు, "రష్యాలో నెపోలియన్" వంటి దరిత్రాత్మక ఘటాల రీల్స్, నాటకీయ సన్నివేశాల చిత్రాలు, అద్భుత సాహసచిత్రాలతో ఈ ఉద్యమం ప్రారంభమయింది. పుష్కిన్, తుర్గనెవ్, టాల్‌స్టాయ్‌ల ఉత్తమగ్రంథాలను ఆ తొలిరోజులనాటి చిత్రనిర్మాతలు ప్రొతజనోవ్, గార్డిన్‌లు సినిమాలుగా తీసి ప్రదర్శించడంతో, ఈ నూతనకళారంగంలో అపారమైన అవకాశాలు కనిపించి, రష్యన్ ప్రజల దృష్టిని ఆకర్షించింది.

ఈ అవకాశాలను ముఖ్యంగా సోవియట్‌ల అధికారకాలంలోనే కనిపెట్టి, క్రియలో సాధించడం జరిగింది. రష్యన్ విప్లవనాయకుడు వ్లాదిమిర్ లెనిన్ సినిమాకళ పట్ల శ్రద్ధ కనపరిచారు. 'కళలన్నిటిలోకీ మనకి సినిమా అతిప్రధానమైనది' అని ఆయన అన్నారు. ప్రజాసామాన్యాన్ని ఆకర్షించగల అద్వితీయసాధనం అని సినిమాను గురించి ఆయన అభిప్రాయం. ఒక సినిమాని లక్షలాది ప్రజలు ఒకేసారి చూడవచ్చు. ప్రభుత్వము ప్రత్యేక శ్రద్ధచూపి ప్రోత్సాహం ఇవ్వడంతో, సోవియట్ చలనచిత్ర పరిశ్రమ గొప్పవిజయాలు సాధించి, ప్రపంచం మన్ననలు పొందగలిగింది.



ఉత్తమ తమిళచిత్రం "ఎంగళ్ వీట్టు మహాలక్ష్మి" చిత్రనిర్మాత శ్రీ అక్కినేని నాగేశ్వరరావు

1925 లో యస్. ఐజెన్‌స్టయిన్ నిర్మించిన చిత్రం "ది అర్మర్డ్ క్రూయిజర్ పొత్యంకిన్", వస్యవోలోద్ పుదోవ్కిన్ నిర్మించినచిత్రం "మదర్", సోవియట్ యూనియన్‌లోనూ, ఇతర దేశాలలోనూ కూడా ప్రేక్షకుల ప్రశంసలు పొందాయి. ఈ చిత్రాలపట్ల ప్రపంచమంతటా గాఢమైన గౌరవాభిమానాలు ఏర్పడ్డాయి. సినిమా ద్వారా ప్రగాఢ ఆవేశంకల ఉత్కృష్ట కళాఖండాలను సృష్టించడానికి ఎంతగా అవకాశంఉందో మొట్టమొదటిసారిగా ఈ చిత్రాలు నిరూపించాయి "పొత్యంకిన్"లో ఐజెన్‌స్టయిన్ చూపిన నవ్యరీతులు, మాక్సిం గోర్కీ ప్రఖ్యాత నవల ఆధారంగా పుదోవ్కిన్ నిర్మించిన "మదర్", సోవియట్ సినిమా కళ అభివృద్ధికి ఎంతో తోడ్పడ్డాయి.

ఆరోజుల్లో ప్రజల్ని ఉర్రూతలూగించిన చిత్రాలలో, ఉత్తమ నటుడు ఇగోర్ ఇల్యిన్‌స్కీ నటించిన సుఖాంత చిత్రాలున్నాయి. ఇవి ఈ శతాబ్దం మూడో దశాబ్దంలోనూ నాలుగోదశాబ్దంలోనూవచ్చాయి. మూకసినిమాలకి నోరు వచ్చి రాగానే, చిత్రాలన్నిటినీ పలుభాషల్లో మాట్లాడించే పద్ధతి – డబ్బింగ్ – మొదలు పెట్టేశారు. మాస్కోలోనో, తాష్కెంట్‌లోనో తయారైన చిత్రాన్ని ఇతర రిపబ్లిక్‌ల భాషలన్నిటిలోనూ రికార్డ్ చేసేవారు. అంటే తజకిస్తాన్, మోల్దావియా, జార్జియా, ఎస్తోనియాలలోకూడా ప్రజలు వీటినిచూసి విని ఆనందించడానికి వీలు కలిగించారు.

## ప్రసిద్ధ చిత్రాలు

తొలి సోవియట్ టాకీలుకూడా పూర్వపు మూక చిత్రాల నాటి సంప్రదాయాలను నిలబెట్టాయి. వాసిల్యెవ్ సోదరులు తయారుచేసిన చిత్రం "చాపాయెవ్", జార్జి, హైపిజ్‌లు నిర్మించిన చిత్రాలు "డిప్యూటీ ఆఫ్ ది బాల్టిక్" "ప్రభుత్వ సభ్యుడు", ది జిగాన్ నిర్మించిన "వియ్ ఆఫ్ క్రాన్‌స్టాడ్," దొవ్‌జెంకో నిర్మించిన "ష్చోర్స్", కొజింత్‌జెవ్, త్రాబర్గ్‌లు నిర్మించిన గోర్కీ చిత్రత్రయం "మాగ్జిం యువజీవితం" "మాగ్జిం పునరాగమనం", "వైబార్ జిల్లా", ఆపైన నిర్మాత రోమ్ నటుడు ష్చుకిన్ తయారుచేసిన లెనిన్ చిత్రాలూ ("అక్టోబర్‌లో లెనిన్", "1918 లో లెనిన్") ఇవన్నీ సినిమారంగంలో ఉత్కృష్ట కళాఖండాలుగా గణనకు వచ్చాయి ఈ చిత్రాలన్నిటిలోనూ ఉత్కృష్ట విప్లవతత్వం కనపడుతుంది. వాటి సందేశం అతి గంభీరం. ఇవి మహత్తర కళాసృష్టికి నిదర్శనాలు.

మాతృదేశ సంరక్షణకోసం మహాయుద్ధం సాగిన గడ్డురోజులలో యుద్ధరంగంలో



ఉత్తమ హాస్యనటుడు శ్రీ రేలంగి వెంకట్రామయ్య



విసన్నస్సైన అసన 'ఇవానద బరబుల' చిత్రంలో ఒక సన్నివేశం.

నిలిచి పోరాడేవారికీ, వెనుకశ్రేణిలో ఉండి కర్తవ్యం నిర్వర్తిస్తున్నవారికీ ప్రోత్సాహం ఇవ్వడానికి సోవియట్ సినిమా తోడ్పడింది. యుద్ధకాలంలో ఫాసిస్టు మూకల విధ్వంసక చర్యలను అమానుష కృత్యాలను తెగనాడి సోవియట్ సైనికుల ధైర్య సాహసాలను ప్రస్తుతించి భిన్న గణాల మధ్య సమత్వభావాన్ని వ్యాపింపచెయ్యడానికి సోవియట్ చిత్రాలు ఎంతో తోడ్పడాయి; జాతి వివక్షత, జాతి దురాక్రమణ తత్వాలను బహిరంగ పరిచాయి.

## యుద్ధానంతరకాలంలో

యుద్ధానంతరం సోవియెట్ సినిమా పరిశ్రమ అంతగా ఫలించిందికాదు. ఏడాది తరవాత ఏడాదిగా చిత్ర నిర్మాణం తగుతూ వచ్చింది. తీసేవేవో మంచివి తీస్తే చాలు తక్కువైనా ఫరవాలేదు, అనే తత్వం క్రమంగా బలపడింది. కాని క్రియలో ఈ తత్వం విచారకరమైన ఫలితాలకు దారి తీసింది. కాలం గడిచినకొద్దీ చిత్ర నిర్మాణం సన్నగిల్లినమాట నిజమే, కాని అవి మొదటి చిత్రాలకంటె మంచివని చెప్పడానికిలేదు, పైగా చిత్రనిర్మాణం సన్నగిలడంతో, ప్రసిద్ధులు, వృద్ధులు అనుభవజ్ఞులైన పూర్వ నిర్మాతలకు అది గుత్తిగా పరిణమించింది.

ఈ పరిస్థితులు ఇలాగే ఆట్టేకాలం కొనసాగవని అందరూ అనుకున్నదే; కేవో మావో పరిస్థితులు మారకపోవని అందరికీ తెలుసు.

ఆరోజు చివరికి రానే వచ్చింది 1952 లో 18 చిత్రాలు మాత్రమే తయారయితే, 1956 లో 90 పూర్తి చిత్రాలు తయారైనాయి ఈనాడు కొత్త చిత్రాలలో సగానికి పైగా, దేశమంతటిలోకీ పెద్దదైన "మాస్ ఫిల్మ్" స్టూడియోలో యువ నిర్మాతలు తయారు చేసినవే ఉన్నాయి. సినిమా పరిశ్రమలో ముఖ్య ఘట్టాలు, సోవియట్ సినిమా కళలో ప్రధాన విజయాలు యువతరంవారు సాధించినవే. సునిత విమర్శకులూ, విచక్షణ పరులైన ప్రేక్షకుల ఆదరం పొందిన చిత్రాలు-"ది ఫార్టీఫస్ట్," "పావెల్ కొర్చాగిన్," "స్ప్రింగ్ కమ్స్ టు జార్యెచ్నీ స్ట్రీట్," 'ద వర్ ఫస్ట్," "కార్నివల్ నైట్" యువ నిర్మాతలు నిర్మించినవే.

అయితే పూర్వ నిర్మాతలుకూడా చేతులు ముడుచుకుని కూర్చోలేదు. యువ నిర్మాతల శీఘ్ర కార్య సాధన చూసేసరికి, పెద్దలైన నిర్మాతలకు ఉత్సాహంకలిగి, వారుకూడా కొత్త తరహాలలో పురోగమించడం మొదలుపెట్టారు. యువ నటీనటులు, సినేరియో రచయితలు, ఛాయా చిత్రగ్రాహకులు, శబ్దగ్రాహకులు, చిత్రకారులు మొదలైనవారు కొత్త దృక్పథంతో చలనచిత్రకళ రహస్యాలను శోధిస్తున్నారు.

దైనందిన జీవితంలోని వాస్తవ స్థితిగతులను యథాతథంగా ప్రతిబింబింపచేసి పునస్సృష్టి చెయ్యడానికి యువ నిర్మాతలు పాటుపడుతున్నారు. అతి సూక్ష్మమైన, విశిష్టమైన సన్నివేశాలను వారు వెతికి చూస్తారు, ఒక విధంగా చెప్పాలంటే, భూతద్దంతో జీవితాన్ని సూక్ష్మంగా పరిశీలించి, సూక్ష్మ విషయాల ద్వారా మానవ మనస్తత్వాన్ని చిత్రిస్తున్నారు.

## అసామాన్య లక్షణాలు

అయితే, ఈ యువ చలన చిత్రకళాకారులు, నిత్య జీవితాన్ని యథాతథంగా ప్రతిబింబింప చెయ్యడంలో, సమకాలీన జీవితానికి వీలైనంత సాన్నిహిత్యం సాధించే ప్రయత్నంలో, జీవితంలోని పరమ సూక్ష్మమైన విషయాలలో కల సౌందర్యాన్ని అన్వేషించడంలో, సోవియట్ చలనచిత్ర పరిశ్రమకు అమూల్యము అసామాన్యమైన లక్షణాలుగా ఉంటూవచ్చిన గాఢ విప్లవభావ సంప్రదాయాన్నీ ఉత్కృష్టశైలినీ విడనాడుతుంటే, అది చింతించవలసిన విషయం.

"స్ప్రింగ్ కమ్స్ టు జార్యెచ్నీ స్ట్రీట్" చిత్రంలోని రమ్యగేయాన్ని పోలిన ఇతివృత్తం సోవియట్ ప్రేక్షకులకు పరిచితమైనది, అర్థం చేసుకోగలిగేదీకూడా. "కార్నివల్ నైట్"లోని తీక్ష్ణ వ్యంగ్యం, సునిశిత హాస్యంకూడా వినోద దాయకమైనవి అయితే "పావెల్ కోర్చాగిన్" వంటి చిత్రాలవల్ల ప్రేక్షకులకు ఇంకా ఎంతో ఆనందం కలిగింది. ఓస్త్రొవస్కీ ప్రసిద్ధనవల "హౌ ది స్టీల్ వజ్ టెంపర్డ్" ఆధారంగా, యువ నిర్మాతలైన అలోవ్, నామొవ్ ఈ చిత్రాన్ని తయారుచేశారు. ఈ చిత్రం కరుణ వీర రసపూరితమైనది.

పునరుజ్జీవనం పొందుతున్న నవ సోవియట్ చలనచిత్ర పరిశ్రమ మరింత బలపడి మరింత ఆవేశంతో గాఢశక్తితో విలసిల్ల గలదని సులువుగా చెప్పవచ్చు. ★

మద్రాసు రాష్ట్ర శాసనసభ సభ్యురాలుగా నియమించబడ్డ మధురగాయని శ్రీమతి కె. బి. సుందరాంబాళ్ కు, ఫిలింఫాన్స్ సంఘం గతవారం సన్మానం చేశారు.



# దగాపడిన తమ్ముడు

(32-వ పేజీ తరువాయి)

వదిలేస్తాం వదిలేస్తే యేం చేశాడో తెలుసా? ఆలిద్దరి యింటికి వెళిపోతానని వెళిపోయాడు. వాళ్ళయిల్లు నీకు తెలుసా?"

"అన్న యిల్లు తెలుసు" అన్నాడు.

"చంద్రయ్యది!"

"ఊహుఁ"

"మీ అయ్యతో నీవెక్కడి కెళ్లావో చెప్తావా?" అన్నాడు.

"ఓ" అంటే యినస్పెక్టరు తన వెంబడి కుర్రవాడ్ని తీసుక వెళ్ళాడు. ఆ హోటల్ యజమాని యీ కుర్రవానితో యింకో యిద్దరు మనుషులు తనతో హోటలుకు అప్పుడప్పుడూ వచ్చేవారని ఒకోసారి యింకో పొట్టిమనిషి వచ్చేవాడని వాళ్లయిళ్లు ఎక్కడ వున్నవో తనకు తెలియదనీ చెప్పాడు. ఇన్‌స్పెకరు ఆ యజమానిని వాళ్లని అప్ప చెప్పకపోతే తననే తీసుకవెళ్తానని బెదరించాడు. తిరువాతి అన్న యిల్లు దూరంనుంచే చూసివెళ్లిపోయాడు "మీ అయ్యచంద్రయ్య యింట్లో ఉన్నాడేమో; ఆ యిల్లు తెలుసుకొని నీకు తీసుకెళ్తానులే" అని మల్లుకి వచ్చ చెప్పాడు.

తిరిగి సేమనుకు వచ్చేవరకు నీలి అలానే అక్కడ కూర్చుంది. ఇన్‌స్పెక్టరు ఆమెవేపు చూడగానె యెందుకో జాలివేసింది. తను అడిగిన ప్రశ్నలకు సమాధానాలు వున్నదున్నట్లు ఆమె తడుముకోకండా చెప్తుంటే తనకు ఆమెమీద గౌరవం యేర్పడింది. ఆమెకు యే విధంగానైనా సహాయం చేస్తే బాగుండునని అనిపించినా తన వుద్యోగ ధర్మం విడనాడకూడదని ఆమె చెప్పినవే అన్నీ వ్రాసుకున్నాడు.

ఆమె వెళ్ళిపోతూ తిరిగి వచ్చి యిన్‌స్పెకరుతో "ఆ మారాజు తండ్రికి యెలాగున్నది బాబూ! తెలిసి వచ్చిందా?" అంటే యిన్‌స్పెకరు "గండం గడిచింది. బ్రతుకుతాడు!" అన్నాడు. నీలి కదులుతూ "దేముడు లేడా? ఆ మంచి బాబుకి బాగ చూడడా?" అంటుంటే యిన్‌స్పెకరు నవ్వుతూ "వాడు మంచోడా? వాడి డబ్బు చూసి అంటున్నావా?" అన్నాడు.

"మంచిబాబు కాకపోతే పిస్తోలు దొంగల మీద పేలించడా బాబూ?" అని ఆమె మెల్లగా కొడుకును పట్టుకొని ముందుకు కదలి పోయింది. అలా వెళిపోతూ నాలుగైదు వీధుల్లో పనికోసం కొన్ని కుమ్మలిళ్ల దగ్గరకు వెళ్లింది. కష్టసుఖాలు చెప్పుకుంది.

ఒక యింట్లో యజమానురాలు చాలా తక్కువ డబ్బుకు పనికి కుదుర్చుకుంది; ఎన్నో షరతుల్ని పెట్టింది. ఆమె గొంతుక ధాటీ యెవరినైనా పాడలు గొట్టేటున్నది. అన్నిటికీ నీలి తల ఒగ్గింది. ఆ వేళనుంచే పని. చెప్పిన పని చేసుకొని యింటికి వెళ్తుంటే తన లాంటి మనిషే "వాళ్లయింట్లో పనికి కుదిరావా?" అని అడిగింది.

"అవునమ్మా!"

"వాళ్ళు మనుషులా? ఇచ్చేదియేగానీ గానీ! రక్తం పీల్చేస్తారు. అందుకే వాళ్ళ ఇంట్లో నెలకో పనిమనిషి మారుతుంది-వాళ్ళసంగతి తెలిసిన వాళ్ళెవరాపనికి వెళ్ళరు."

"కడుపానికి ఆదుకున్నదా అమ్మ! నాలుగంటే పడుతాను. ఏనాటికైనా ఆ యమ్మ మనిషేకదా, కనికరం రాదా?" అంటూ నీలి ముందుకు నడిచింది.

[—ఇంకా వుంది]

# కొందరు సభ్యుల పేర్లు

[11 వ పేజి తరువాయి]

పురం) 86 మంగు కమలకుమారి (చింతలపూడి, ప॥ గో) 87. సాతులూరి భాస్కరం (గోపవరం, ప॥ గో) 88. డి ఇంద్రమోహన శర్మ (గుండుగోలను, ప॥ గో) 89. పి. బాల సుబ్రహ్మణ్యం (చీరాల) 90. శ్రీరంగం శ్రీనివాసరావు (భీమవరం) 91. ఎన్. బసవనగౌడు (విరుపాపురం, కర్నూలుజిల్లా) 92. ఉప్పాడ అప్పల నరసింహారావు (సోంపేట, శ్రీకాకుళం) 93. కొట్రసీత (కలకత్తా) 94. పూజలకృష్ణమూర్తి (నరసారావుపేట) 95. కాశీభట్ల అనూరాధ (అనకాపల్లి) 96. గుజారి అచ్యుతకుమారి (గుంటూరు) 97. మల్లెల జయలక్ష్మమ్మ (డోను, కర్నూలుజిల్లా) 98. బి. పాండురంగారావు (సికింద్రాబాదు) 99. ఎస్. సింగరాచార్య (హైద్రాబాదు) 100. క్రొవ్విడి లలిత (నరసన్నపేట, శ్రీకాకుళం) 101. గోనా మీనాకుమారి (ఏలూరు) 102. పోడూరి ఉమ (విజయనగరం):

—మరికొన్ని పేర్లు వచ్చేవారం]

# న్యూఢిల్లీ లేఖ

(6 వ పేజీ తరువాయి)

ఫెడరేషన్ ఆర్థిక వ్యవస్థపై జరిగిన రౌండు టేబిల్ కమిటీ సమావేశానికి ఆయన అధ్యక్షుడుగా వ్యవహరించారు. ఆయన ఇలా వ్రాశారు:—

"ఆర్థికంగా ఫెడరేషన్ వ్యవస్థ సానుకూల మవుతుందో కాదో తేల్చుకోవటమొకటే నేను నా కప్పగించినపని. వివో



# న్యూఢిల్లీ లేఖ

విధంగా తాము కోరినవాటిని ఇవ్వకుండా ఆలస్యం చెయ్యటానికే బ్రిటిష్ ప్రభుత్వం 'రౌండు టేబిల్' కమిటీలంటూ ఏర్పాటు చేసిందని భారతదేశంలో ఒక అనుమానం బలంగా వ్యాపించింది. ఈ అనుమానం నిరాధారమైంది. నేను నా పని త్వరత్వరగా పూర్తిచేయ నిశ్చయించాను. నేను ఆలస్యం చేసినట్లయితే కమిటీలోని కనీసం ఒక భారతీయ సభ్యుడు వ్రాసిన మైనారిటీ నివేదిక మూలంగా ఆ అనుమానం ధ్రువపడేది. ఎందుచేతనంటే ఫెడరేషన్ సాధ్యమా అసాధ్యమా అనే ప్రశ్నకు సమాధానం 'సాధ్యమేగాని కష్టసాధ్యం' అని. ఈ సమాధానం కాంగ్రెసు పార్టీ విప్లవ నాయకులను గాని, ఫెడరేషన్ కావాలి కావాలని తొందరపడి గోలచేసి దాని ఫలితాలను స్వీకరించటానికి సిద్ధంగా లేని నరేంద్ర మండలిని గాని తృప్తిపరచక పోయింది.

ఈ అనుభవం వలన, కొత్త రాజ్యాంగ రచయితలమైన మేము ఇంతపూర్తిగా సంస్థానాధిపతులను లొంగిపోవటం మంచికేనా అని నాకు సందేహం బయలుదేరింది... కాని 1935 సం॥పు చట్టం ప్రకారం భారత రాజ్యాంగ ఐకమత్యం వీరిమీదనే ఆధారపడి ఉన్నది. వీరు కలిసివస్తే ఐకమత్యం కుదురుతుంది, లేకపోతే లేదు. అందుచేతే ఫెడరల్ వ్యవస్థ పనికిరాదని కొందరు వాదించడం జరిగింది. దానికిబదులు మరేం చెయ్యాలో ఎవరికీ తెలియదు కాని ఫెడరల్ పద్ధతి ఇంగ్లండులోని కన్సర్వేటివ్‌ల వైఖరిమూలంగా మరింత కష్టసాధ్యమైపోయింది. సంస్థానాధిపతులు ఫెడరేషన్‌లో చేరేటట్లు బ్రిటిష్ ప్రభుత్వం "ఒత్తిడి" చేయకూడదని వారి వాదన. ఈ వాదన అనాలోచిత వాదన అని నా నమ్మకం.

ఫెడరల్ పద్ధతిమీద నాకు నమ్మకం లేకపోవటానికి మరొక కారణం పాకిస్తాన్ నినాదం. జాయింట్ సెలెక్టుకమిటీలో పాకిస్తాన్ ప్రసక్తి రాలేదు. పాకిస్తాన్ అనేది జిన్నా అనే వ్యక్తి కంటున్న పగటికల అని భారతీయ ప్రతినిధులు, ముస్లిములతో సహా విశ్వసించారు. 1937 తరవాత రాష్ట్రీయ స్వయం నిర్ణయాధికారం రోజుల్లోను, యుద్ధానంతరం బ్రిటిష్‌వారు భారతదేశం నుంచి నిష్క్రమించబోతున్నారని రూఢీ అయిన రోజుల్లోను హిందువులు కొంచెం తెలివిగా వ్యవహరించకుండా ఉన్నట్లయితే జిన్నా పగటికల పగటి కలగానే ఉండిపోయేదని నా నమ్మకం. కాని 1935కు ముందురోజుల్లోకూడా ఈ నినాదం కేవలం పగటికల అనుకునే స్థితిలో లేదు. పాకిస్తాన్ నినాదం ముస్లిములపై ఎంతగా పనిచేస్తోందో నేను 1932 ప్రాంతాల్లోనే ప్రత్యక్షంగా చూశాను. భారతదేశంలో ఇతర ప్రాంతాల్లో కాకపోయినా వాయవ్య, ఈశాన్య ప్రాంతాల్లో మటుకు, భారతదేశానికి స్వాతంత్ర్యం ఇస్తే రక్తపుటేరులు ప్రవహిస్తాయని చర్చిల్ చెప్పిన జోస్యం నిజమైంది. 1935 లో గాని, అంతకు ముందుగాని రాజకీయవేత్తలు చాకచక్యంతో వ్యవహరించిన పక్షంలో ఆ హింసాకాండ జరగకుండా ఉండేదా?" ★



Printed and Published by Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at
The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.

# ఆంధ్రప్రదేశ్ అంతటా




ఏ.ఎల్.ఎస ప్రొడక్షన్సు సమర్పించు
పద్మిని పిక్చర్సు వారి

# బడిపంతులు

స్టూడియో:
భరణి

దర్శకత్వం:
బి.ఆర్. పంతులు



విజయ
రిలీస్

GHRAO

ARUNA